## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ


గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..





నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి. కనుక తమవంతుగా భక్తి,జ్ఞాన ప్రచారార్ధం మహానుభావులైన **ద్వారకాదీష్ వాస్తు** వెబ్ సైట్ వారు ఉచితంగా విలువైన గ్రంధాలను ఆన్ లైన్ ద్వారా eBOOK(PDF) రూపంలో అందిస్తున్నారు. వారు చేస్తున్న జ్ఞాన యజ్ఞానికి సాయి రామ్ కూడా తమవంతుగా సహాయం చేసే కార్యక్రమంలో భాగంగా వారి గ్రంధాలను సాయి రామ్ ద్వారా కూడా అందచేస్తున్నాము, ఇందుకు మేము వారికి కృతజ్ఞత తెలియచేసుకుంటున్నాము. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం చేసిన ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in),మైక్రోసాఫ్ట్ సైట్(http://www.microsoft.com) వారికి కూడా మేము ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) **ద్వారకాదీష్ వాస్తు** వారి వెబ్ సైట్: http://dwarkadheeshvastu.com
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com
సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement
సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంధ వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము.



**SaiRealAttitudeManagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)**

* సర్వం శ్రీ సాయి నాథ పాద సమర్పణమస్తు *

## ద్వారకాదీష్ వాస్తు వారి వెబ్ సైట్:

## http://dwarkadheeshvastu.com

Free Download Indian epic ×

dwarkadheeshvastu.com/Epic-List-of-Indian-Epics-in-Telugu.aspx

Hindi | Sanskrit | English | Gujrati | Bangali | Oriya | Telugu | Nepali | Marathi | Kannad | Asamiya | Urdu | Malyalam | Avdhi | Ved | Puran | Bhagwat | Ramayan | Geeta | Punjabi | Jain Dharm | Islam | Karm Kand

**Dwarkadheesh Vastu**

Home
Contact Us
हिन्दी वेबसाईट
Vastu Consultancy
Download Vastu Book
FREE Astrology Books

FREE Devotional Music (Mp3)
FREE Devotional Videos
FREE Devotional Books (PDF)
FREE Educational Books (PDF)
FREE Educational Videos
FREE Devotional Wallpapers

Dwarkadheesh Vastu
Like
3,663 people like Dwarkadheesh Vastu.
Facebook social plugin

A | B | C | D | E | F | G | H | I
J | K | L | M | N | O | P | Q | R
S | T | U | V | W | X | Y | Z

1. 12 Rashi Fal (Hindi)
2. 300 Saal Sikh Itihaas De Naal (English)
3. Aachar Manjari (Nepali)
4. Aadarsh Bhakti Prem (Telugu)
5. Aadarsh Dampatya Jeevan (Telugu)
6. Aadarsh Desh Bhakt (Hindi)
7. Aadarsh Manav Hridaya (Hindi)
8. Aadarsh Nari Sushila (Bengali)
9. Aadarsh Nari Sushila (Gujrati)
10. Aadarsh Nari Sushila (Tamil)

### Indian Epics in Telugu

1. Aadarsh Bhakti Prem (Telugu)
2. Aadarsh Dampatya Jeevan (Telugu)
3. Aadarsh Nari Sushila (Telugu)
4. Aadhyatm Ramayan (Telugu)
5. Aandhra Mahabhagwat Dasham Skandh (Telugu)
6. Agni Puranam (Telugu)
7. Aladdin Adbhutha Deepam (Telugu)
8. Alibaba Dongalu Katha (Telugu)
9. Amavasya Somavara Vratham (Telugu)
10. Amma Neeti Kathalu Katha (Telugu)
11. Amulya Samaya Ka Upyog (Telugu)
12. Anantapadmanabha Asthotram (Telugu)

You Tube

# అతి విశిష్టం ఈ దానం!

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.

రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!



మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

॥ శ్రీ హరిః ॥

# విషయ సూచిక

॥ శ్రీ హరిః ॥

# 1. యోగక్షేమం వహించుట

**అనన్యాశ్చింతయంతో మాం యే జనా: పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

**(గీత 9/22)**

'పరమేశ్వరుడనైన నన్ను నిరంతరము అనన్యభక్తితో చింతన చేయుచు, నిష్కామభావముతో సేవించువారియోగక్షేమములను నేనే వహించుచుందును'

ఈ శ్లోకానికి ఒక్కొక్కరు ఒక్కొక్క విధంగా అర్థం చెపుతూ వుంటారు. సర్వథా సకామంగాను, నివృత్తి పరంగాను దీనిని అన్వయిస్తారు. సంసారయాత్రను గురించి కించిత్తు కూడా చింతించక కేవలం భగవంతునిపై ఆధారపడి సర్వదా ఆయననే భజిస్తూ వుండటం ఉచితమని తలుస్తారు. దానికి ఈ క్రింది దృష్టాంతాన్ని చెపుతూవుంటారు.

ఈశ్వర భక్తుడు ఒకడుండేవాడు. అతడు గీతాధ్యయనపరుడు. నివృత్తి ప్రియుడు (విరాగి). అతడు నిరంతరం అర్థవంతంగా గీతాధ్యయనం చేస్తూ భగవన్నామాన్ని జపిస్తూ, ఆతనిస్వరూపాన్ని ధ్యానించటంలోనే తనసమయాన్నంతా గడిపేవాడు. అతడు కేవలం భగవంతుణ్ణే నమ్ముకున్నవాడు. అతనిపైనే ఆధారపడ్డాడు. తన జీవితాన్ని గురించి ఏమి ఆలోచించేవాడు కాడు. తనఅన్నపానాదులను గురించి కూడా ఆలోచించేవాడు కాడు. అతనితల్లిదండ్రులు స్వర్గస్థులయ్యారు. వీరు ముగ్గురన్నదమ్ములు. ముగ్గురూ వివాహితులే! ఈయన పెద్దవాడు. మిగతా ఇద్దరూ చిన్నవాళ్ళు. చిన్నవాళ్ళిద్దరూ పౌరోహిత్యం చేసి ఇంటిని నెట్టుకొస్తూండేవారు. తమ్ములిద్దరూ ఒకనాడు అన్నగారితో "మీరు మన ఇంటి బాధ్యతలను గురించి ఆలోచించటానికి కూడా కొంత సమయాన్ని కేటాయిస్తే బాగుంటుంది కదా!" అన్నారు. అది విన్న అన్నగారు "అందరినీ

భరించేవాడు, పోషించేవాడు అయిన భగవంతుడు అన్ని వేళలా సిద్ధంగా వున్నప్పుడు, మన బ్రతుకుదెరువు కోసం మనం ఆలోచించటం అనేది పసితనమే ఔతుంది (అజ్ఞానమే ఔతుంది). తన్ను నమ్మినవాని యోగక్షేమాలు తానే వహిస్తానని గీత యొక్క తొమ్మిదవ అధ్యాయంలోని 22వ శ్లోకంలో భగవంతుడే స్వయంగా (తన బాధ్యతను) వివరించాడు.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనా: పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

కాబట్టి "తమ్ముళ్ళూ! భగవంతుని నమ్మి, అతనిపై మన భారాన్ని ఉంచటమే మనం చేయవలసిన పని. ఆయన బ్రహ్మ మొదలుకొని క్షుద్రాతి క్షుద్రమైన జీవ పరమాణువులవరకు అందరి భారమూవహిస్తూ, పోషణమూ చేస్తాడు. అతనిని నమ్మి నిత్యమూ అతనినే స్మరించే వారి యొక్క యోగక్షేమాల బాధ్యతను విస్మరింపడు. కాబట్టి మనము గీతాధ్యయనం చేయటం, గీతాధ్యాపనం చేయటం, అనునిత్యమూ ప్రేమపురస్సరంగా భగవన్నామ సంకీర్తనం చేస్తూ వుండాలి సుమా!'' అన్నాడు.

"అన్నగారూ! మీరు చెప్పింది సబబుగానే ఉంది. కానీ జీవించటం కోసమేదైనా ప్రయత్నంచేయాలి కదా! ఏ ప్రయత్నమూ చేయని వానికి భగవంతుడు స్వయంగా ఇంటికొచ్చి ఏమీ ఇచ్చిపోడే?" అన్నారు తమ్ముళ్ళు. అది విన్న అన్నగారు దృఢ నిశ్చయంతో 'శ్రద్ధా విశ్వాసాలు వుంటే భగవంతుడే స్వయంగా ఇంటికొచ్చి అన్నీ ఇవ్వగలడు'' అన్నాడు. విసిగిన తమ్ముళ్ళు కొంచెం కోపంతో "అన్నగారూ! కబుర్లు చెప్పటంలో ఖర్చేమీ అవదు! మేము సంపాదించి తెస్తుంటే ఇల్లు గడుస్తోంది. మీరు ఇంట్లో ఉండి శ్లోకాలు వల్లిస్తూ కబుర్లు మాత్రం చెబుతున్నారు. ఎంత కష్టపడితే డబ్బు కూడగట్టగలమో మీకేం తెలుసు? మానుండి వేరుపడి ఇల్లు గడపండి. అప్పుడు తెలుస్తుంది ఇల్లు గడపటం ఎంత కష్టమో! ఏ ప్రయత్నమూ లేకుండా మీ పనెలా గడుస్తుందో అప్పుడు మేమూ చూస్తాం!'' అన్నారు.

అది విన్న అన్నగారు ధైర్యంగా "తమ్ముళ్ళూ! చాలా సంతోషం! మీరేది మంచిదనుకుంటే అలానే కానివ్వండి. నన్ను వేరు చేయండి. నేనెవరికీ భారంగా వుండదలుచుకోలేదు. భగవంతుడు నన్నెలా

బ్రతికించాలనుకున్నాడో, అది ఆయనకు బాగా తెలుసు!" అన్నాడు. దానిమీద తమ్ముళ్ళు "ఇదే చాలా మంచిది. రేపే ఎవరి వాటాకు ఎంత వస్తుందో పంచేసుకుందాం" అన్నారు. "మీరేది ఉచితమనుకుంటే అలా చేయండి. నాకెలాంటి అభ్యంతరమూ లేదు. మీ రెలా చేసినా నాకు సమ్మతమే!" అన్నాడు అన్నగారు.

ఇద్దరు తమ్ముళ్ళూ వున్న సామాను సంపదనంతా మరునాడే మూడు భాగాలుగా పంచారు. బ్రాహ్మణ భక్తుని వాటాకు ఒక చిన్న సామాన్య గృహమూ, కొంత నగదు, కొన్ని మామూలు నగలూ, బట్టలూ, వంట గిన్నెలూ మొదలైనవి వచ్చాయి. యజమానుల ఇండ్ల పౌరోహిత్యం లోని కొంత వాటా కూడా ఆయనకీయబడింది. యజమానుల ఇంటికి ఏ పురోహితుడైనా వెడితేనే ఏదో కొంత తెచ్చుకోగలడు. ఇంట్లో కూర్చున్న పురోహితుణ్ణెవరూ గుర్తించరు కదా!

ఇలా ముగ్గురూ వేరుపడ్డాక ఆ బ్రాహ్మణ భక్తుడు తన భార్యతో "నా తమ్ముళ్ళు మనకిచ్చినది కొంచెమే అయినా అది చాలా తృప్తిగా ఉంది. ఇప్పుడు మనం చేయవలసిందల్లా కేవలం భగవంతునిపై ఆధారపడటమే! ఎవరి ఇంటికీ వెళ్ళి యాచన చేయకూడదు. ఎవరేమి ఇచ్చినా తీసుకోకూడదు. భగవంతుడు తానే స్వయంగా భక్తుల యోగక్షేమాలు వహిస్తాడు. ఆయనే మన యోగక్షేమాలు చూస్తాడు. ఇప్పుడు తమ్ముళ్ళిచ్చిన దానితోనే మన అవసరాలు గడుపుకోవాలి సుమా!" అన్నాడు.

బ్రాహ్మణి ఈశ్వరభక్తురాలు, పతివ్రతాను. ఆమె తనభర్తమాటను గౌరవంగా స్వీకరించింది. ఇప్పుడు ఇల్లు గడపటానికి ఎంతో కొంత చేతిలో వుండనే వుంది. ఇది అయిపోతే స్వామి ఏది ఉచితమనుకుంటే అదే స్వయంగా చేస్తాడు అనుకుంది.

ఆ భగవద్భక్తుడైన బ్రాహ్మణుడు ప్రాతఃకాలం నాలుగు గంటలకే లేచి కాలకృత్యాల తర్వాత ఒక మైలు దూరంలో వున్న చెరువుకి వెళ్ళి స్నానం చేసి, సంధ్యావందనం చేసేవాడు. ఆ తరువాత భగవంతుని మానసిక పూజ, జపము, ధ్యానము చేసుకుని, భగవద్గీతా శ్లోకాలకు అర్థం

తెలుసుకుంటూ దానిని సంపూర్ణంగా పారాయణ చేసేవాడు. ఇదంతా పూర్తి చేసుకుని పగలు పదకొండు గంటలకు ఇంటికి వచ్చి భోజనం చేసేవాడు. తరువాత ఒంటిగంటకు మళ్ళీ అదే చెరువుకు పోయి జపము, ధ్యానమూ, స్వాధ్యాయమూ చేసేవాడు. అ తరువాత సాయంత్రం నాలుగు గంటలకు శౌచ స్నానం చేసి సంధ్యావందనం ఆచరించేవాడు. దాని తర్వాత మానసపూజ చేసి, సత్‌శాస్త్రాలను శ్రద్ధా భక్తులతో స్వాధ్యాయం చేసేవాడు. సూర్యాస్తమయం తరువాత భగవన్నామజపమూ, ఆయన స్వరూప ధ్యానమూ చేసేవాడు. రాత్రి ఎనిమిది గంటల వరకూ ఈ కార్యక్రమాలు చేసుకుని తరువాత ఇంటికి వచ్చి భోజనాదులు ముగించుకుని, తన భార్యతో సత్కాలక్షేపం చేసి రాత్రి పదింటికి పడుకునేవాడు. సాధ్వియైన ఆతని ధర్మపత్ని కూడా రెండు పూటలా భర్తకు నమస్కరించటం, ఆయన శుశ్రూషచేయటం, ఆజ్ఞ పాటించటం, అలాగే భగవద్భజన, ధ్యానాలను చేయటం తన పరమ కర్తవ్యంగా భావించేది. ఈ విధంగా ఇద్దరికీ రోజులు గడిచిపోతున్నాయి. రోజా ఉన్నదాంట్లో ఖర్చవుతూనే వుండేది. కొంతకాలానికి వారి దగ్గరున్న డబ్బు పూర్తిగా అయిపోయింది. ఒకరోజున 'డబ్బంతా పూర్తిగా అయిపోయింది' అన్నది భార్య. 'నగలు బట్టలూ కూడా అయిపోయాయా?' అన్నాడు భర్త. 'లేదు' అన్నది భార్య. 'ఓహో! ఈ నగలూ బట్టలతో కాలం గడుపమని కాబోలు స్వామి ఆజ్ఞ' అని అనుకుంది. వెంటనే వాటిని అమ్మి ఇల్లు గడపటం మొదలుపెట్టింది. కానీ అవెన్నాళ్ళకు సరిపోతాయి? అవీ అయిపోయాయి. మరొకనాడు 'నగలు బట్టలు కూడా అయిపోయాయి' అన్నది భార్య. 'ఏమీ భయంలేదు. ఇంకా గిన్నెలూ, తప్పెళాలు ఇంట్లో వున్నాయి గదా?' అన్నాడు భర్త. 'ఓహో స్వామి గిన్నెలూ, ఇంటినీ అమ్మి ఇల్లు గడుపుమని అంటున్నారు' అనుకున్నది భార్య. ఆమె ఆనందంగా ఇల్లు అమ్మేసి అద్దె ఇంట్లోకి మకాం మార్చింది. కొన్నాళ్ళిలా గడిచిపోయాయి. ఆ తరువాత గిన్నెలూ వగైరాలు అమ్మినా ఎన్నాళ్ళు గడుస్తాయి? చివరికి బ్రాహ్మణికి కట్టుకుంటానికొక చీర, బ్రాహ్మణునికి ఒక ధోవతి ఉత్తరీయం మాత్రం మిగిలాయి. ఒకనాడు బ్రాహ్మణుడు ప్రాత: కాలం నాలుగు గంటలకు లేచి అడవికి పోవటంచూసి నమస్కరించి వినమ్రురాలై 'స్వామీ! ఇప్పుడింక ఏమీ మిగలలేదు. ఈ ఇల్లు అద్దె ఇల్లు.

గిన్నెలూ మొదలైనవన్నీ పూర్తిగా అయిపోయాయి. ఇక మీరు పారాయణ చేసే గీతాగ్రంథం, మీ ధోవతి, ఉత్తరీయం, నా చీర మాత్రమే మిగిలివున్నాయి. ఈ వేళ అన్నం వండటానికి బియ్యం కూడా లేవు. ఉన్నవి అన్నీ నిన్నటితోనే నిండుకున్నాయి' అన్నది. బ్రాహ్మణుడు భార్యమాటలు విని కూడా మారుమాటాడకుండా ఎప్పటి లాగ అడవికి వెళ్ళిపోయాడు.

ఎప్పటిలాగానే బ్రాహ్మణుడు చెరువుకు చేరి, శౌచస్నానం ఆచరించి సంధ్యావందనం, గాయత్రీజపం మొదలైన నిత్యకృత్యాలాచరించాడు. తదనంతరం ఆయన గీతాపారాయణం చేస్తుండగా ఆయన కిష్టమైన శ్లోకం ముందుకొచ్చింది.

**అనన్యాశ్చింతయంతో మాం యే జనా: పర్యుపాసతే ।**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ ॥**

**(గీత 9/22)**

ఆరోజు ఆశ్లోకాన్ని చదివి ఉలిక్కిపడ్డాడు. దాన్నే మననం చేసుకుంటూ మనసులో ఇలా అనుకోసాగాడు. ఈ శ్లోకంలో భగవంతుడు వాగ్దానం ఏమీ చేయలేదు. ఇదిబహుశా ఎవరో చేర్చిన వాక్యం కావచ్చు. నిజంగా భగవంతుడే ఇలా శపథం చేసి వుంటే నేటి వరకూ నా గురించి కొంచెం కూడా పట్టించుకోలేదేం? నేను పూర్తిగా ఆయన్నే నమ్ముకున్నానే! ఆయన మీదే ఆధారపడ్డానే! అని పరిపరివిధాల ఆలోచించి, సమాధానపడలేక ఆ శ్లోకాన్ని విడిచిపెట్టి మిగతా శ్లోకాలను పారాయణ చేయటం మొదలుపెట్టాడు.

సర్వ హృదయేశ్వరుడు, భక్తవాంఛాకల్పతరువు అయిన భగవంతుడు బ్రాహ్మణుని మనసులోని భావాన్ని గ్రహించి స్వయంగా ఒక విద్యార్థి రూపాన్ని ధరించి ఒక గుర్రంమీద ఆయనింటికి వెళ్ళి బ్రాహ్మణి ఎదుట మిఠాయిలతో నిండిన ఒక పళ్ళెరాన్నుంచి 'అమ్మా! గురువుగారు ఎక్కడున్నారు?' అని అడిగాడు. అది విన్న బ్రాహ్మణి 'ఇక్కడికొక మైలు దూరంలో ఒక చెరువు వుంది. ఆ చెరువు దగ్గరే తమ శౌచస్నానాదులు చేసి నిత్యానుష్ఠానం చేసుకోవటానికి పండితులు ప్రతిదినమూ అక్కడికే వెడతారు. తిరిగి పదకొండు గంటల ప్రాంతంలో తిరిగి వస్తారు. ఇప్పుడు పది గంటలైంది. వారు రావటానికి ఇంకో గంటపడుతుంది. ఇంతకూ

మీరెవరు? ఈ మిఠాయిలను ఎందుకు తెచ్చారు?' అన్నది. విద్యార్థి 'నేను పండితులవారి శిష్యుణ్ణి. మా గురువు, గురుపత్నులసేవార్థం ఈ మిఠాయి తెచ్చాను. దీనిని మీరు స్వీకరించండి' అన్నాడు. అందుకామె 'పండితులవారెవరినీ శిష్యులుగాచేసుకోరు. ఎవరిచ్చిన వస్తువులనూ తీసుకోరు. ఎవరి వస్తువులనూ స్వీకరించవద్దని నన్ను ఆజ్ఞాపించారు. కాబట్టి ఎవరు ఏమి ఇచ్చినా వాటిని స్వీకరించలేను. వీటిని మీరు తీసికొని వెళ్ళండి' అన్నది. దానికి విద్యార్థి 'మీరన్నది నాకు తెలిసిందే. గురువుగారెవరినీ శిష్యులుగా స్వీకరించలేదు. ఇది అక్షరాలా నిజం. కాని నన్నుగాక మరెవ్వరినీ శిష్యునిగా చేసికోలేదు. ఇక చేసికోరు కూడా. నాపై వారికి విశేషమైన కృపాదృష్టి వున్నది. అందుకే నన్ను శిష్యుణ్ణి చేసుకున్నారు' అన్నాడు. 'నిన్నొక్కణ్ణే చేసుకున్నట్టు నేనెప్పుడూ వినలేదు. నాకు తెలిసినంతవరకు వారెవరినీ శిష్యుణ్ణి చేసుకున్నది లేదు. మరి మీరు వారి శిష్యులని ఎలా నమ్మమంటారు? ఏదేమైనా యీ మిఠాయిని మాత్రం నేనెట్టి పరిస్థితిలోనూ స్వీకరించలేను. పండితుల వారొచ్చిన తర్వాత మీరే వారికి ఇవ్వవచ్చు' అన్నదామె. 'సరే మంచిది. ఈ పళ్ళెరమూ, నా గుర్రమూ కూడా ఇక్కడే వుంటాయి. నేను మళ్ళీ వచ్చి గురువుగార్ని కలుసుకుంటాను' అన్నాడు విద్యార్థి. అదివిన్న బ్రాహ్మణి 'మీరు మీ పళ్ళెరాన్ని తీసుకొని వెళ్ళండి. పండితులు వచ్చిన తర్వాత తిరిగి తేవచ్చు. వారి అనుజ్ఞలేకుండా సుతరామూ దీన్నిక్కడ వుంచరాదు' అన్నది. కానీ భగవంతుడు చిత్రమైన వాడుకదా! ఆయన ఆ పళ్ళెరాన్ని అక్కడే వదిలి వెళ్ళిపోయాడు. ఆయన వెళ్ళిపోతుంటే 'మీ పేరు, ఊరూ చెప్పండి, వారొచ్చిన తర్వాత మీ పళ్ళెరాన్ని మీ ఇంటికి పంపటానికి వీలవుతుంది' అన్నది. 'వారు నన్నెరుగుదురులెండి. వారికి నేనొక్కడినే శిష్యుణ్ణి అవటం వలన నాపై వారికి విశేషమైన దయవుంది. నేను తప్ప వారికి వేరే శిష్యులెవరూ లేనేలేరు. ఇవాల్టి ఉదయాన ఎవరిపై అలిగి వదిలేశారో వారే వచ్చారని చెప్పండి చాలు. వారర్థంచేసుకుంటారు' అని బదులిచ్చి భగవంతుడు వెళ్ళిపోయాడు.

అడవినుంచి ఒక గంట తర్వాత వచ్చిన పండితుడు ఇంటిలోకి ప్రవేశించగానే మిఠాయిలతో నిండివున్న పళ్ళెరాన్ని చూచాడు. పండితుడు

కొంచెం కోపంగా 'ఈ మిఠాయి ఎక్కడిది? ఎవరిచ్చారు? ఇది ఇక్కడెందుకున్నది?' అన్నాడు. బ్రాహ్మణునిభార్య చేతులు జోడించి వినయంగా 'స్వామీ! దీన్ని నేనుంచలేదు. ఒక విద్యార్థి బలవంతంగా దీన్ని ఇక్కడుంచి వెళ్ళాడు. గురుసేవకై తెచ్చానన్నాడు. ఐనా నేను సమ్మతించలేదు. కానీ బలవంతంగా దాన్నిక్కడుంచి వెళ్ళిపోయాడు' అన్నది. 'నేనింతవరకూ ఎవరినీ శిష్యునిగా చేసుకోనూలేదు. ఇక ముందు కూడా అలా చేయనన్న విషయం నీవెరుగుదువుకదా?' అన్నాడు బ్రాహ్మణుడు. 'ఔను ఇది నిజమే! పండితులెవరినీ శిష్యులను చేసికోలేదు. ఇక ముందు కూడా చేసికోరన్న విషయాన్ని నేనూ చెప్పాను. దాన్ని సమర్థిస్తూ నాకీ విషయం విదితమే! నన్ను తప్ప మరెవ్వరినీ శిష్యునిగా చేసికోలేదు. చేసికోరు కూడా! నేనొక్కడినే ఆయన శిష్యుణ్ణి. నాపై వారి కృపా విశేషం అపారంగా వుంది. కాబట్టే ఆయన నన్ను మాత్రమే శిష్యునిగా స్వీకరించారు. నే చెప్పే విషయాన్ని పరమ సత్యంగా నమ్మాలి మీరు అన్నాడు'. దానిమీద మిమ్మల్ని వారు శిష్యునిగా స్వీకరించినట్లు నేను వినలేదు. ఐనా వారి ఆజ్ఞ లేకుండా ఈ కానుకను నేను ఇక్కడ వుంచలేను అని చెప్పినా ఆ పళ్ళెరాన్నిక్కడే వదిలి వెళ్ళిపోయాడని' జరిగినది వివరించింది బ్రాహ్మణ పత్ని. అతని పేరూ ఊరు అడిగి ఉండాల్సింది. ఈ కానుక త్రిప్పి పంపేందుకు వీలు కలిగేది' అన్నాడు బ్రాహ్మణుడు. 'నేను ఆ వివరాలడిగాను. అవి చెప్పకుండానే గురువుగారు నన్ను తప్పక తెలుసుకుంటారన్నాడు. ఇవాల్టి ఉదయాన్నే నామీద అలిగిన వారు ఈ కాస్త సేపటికే మరిచిపోతారా? అని, ఇవాల్టి ఉదయాన మీరెవరి మీద అలిగారో అతడే మీ ఏకైకశిష్యుడనీ, అతడే ఈ కానుక సమర్పించాడనీ చెప్పండి!' అని ఈ పళ్ళెరాన్నిక్కడే ఉంచి, గుర్రాన్ని కూడా ఇక్కడే కట్టేసి వెళ్ళాడు. తిరిగి వచ్చి మిమ్మల్ని దర్శించుకుంటానన్నాడు' అన్నది.

అది వినిన పండితుని ఒడలు పులకరించింది. ఆయన గద్గదకంఠుడై భార్యతో 'బ్రాహ్మణీ! నీవు చాలా ధన్యురాలవు. ఆయన సాక్షాత్తు భగవంతుడే! సాక్షాత్ భగవంతుని దర్శనాన్ని పొందిన నీవెంత భాగ్యశాలినివి! నేను భాగ్యహీనుణ్ణి కావటం వలన నాకాయన దర్శన భాగ్యాన్నీయలేదు.

నేను ఒక్కరోజు కూడా ఆకలికి తట్టుకోలేకపోయాను. అధీరుణ్ణయి భగవంతుని వాక్యాలనే విశ్వసించక ఆయనపై అలిగాను. అవిశ్వాసాన్ని ప్రకటించాను. గీత సాక్షాత్తుగా భగవంతుని నోటినుండి వెలువడింది. దాన్ని విశ్వసించక పోవటం అంటే పూర్తిగా భగవంతుణ్ణే నమ్మక అపరాధం చేసినట్టు అని అర్థం. ఈ రోజు గీతా పారాయణ సమయంలో

**అనన్యాశ్చింతయంతో మాం యే జనా: పర్యుపాసతే !**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ !!**

(గీత 9/22)

అనే శ్లోకం వచ్చినప్పుడు అవిశ్వాసాన్ని మనస్సులో నింపుకున్న నాకు భగవంతుని వాక్యాలపై అనుమానం వచ్చింది, అపనమ్మకం కలిగింది. ఇవి నిజంగా భగవంతుడు పలికిన వాక్యాలే అయితే నిశ్చయంగా నా యోగక్షేమాన్ని భరించేవాడు. అలా జరగలేదు కాబట్టి ఇవి భగవద్వాక్యాలు ఏమాత్రం కావుఅని, వీటినెవరో భగవంతుని వాక్యాలుగా చేర్చి వుంటారు అనే అనుమానం, అపనమ్మకం కలిగి ఆ శ్లోకాన్ని చదవకూడదని నిర్ణయించుకుని (వదిలేసి) మిగతా శ్లోకాలను అనుసంధానం చేశాను! నేను నీచాతి నీచుణ్ణి. మహాపాపిని, విశ్వాసహీనుణ్ణి. మనస్సులో కాస్తంత ధైర్యం వున్నా ఇలాంటి నీచకార్యానికి ఒడిగట్టేవాణ్ణికాను. ఆ పరమదయాళుడైన భగవంతుడు సర్వాదా మన యోగక్షేమాల కార్యం సాగిస్తూనే ఉన్నాడు. అంతా అయిపోగానే వెంటనే వచ్చి ఆదుకున్నాడు. అవిశ్వాసం చూపిన అపరాధ కారణంగా నేను ఆయనదర్శనభాగ్యానికి నోచుకోలేకపోయాను. నీవు శుద్ధమైన అనన్యభక్తురాలివి. పతివ్రతవు! కాబట్టే నీకు స్వామి దర్శనమిచ్చారు. ఇక స్వామి దర్శనమిచ్చేవరకూ నాకు మనశ్శాంతి లేదు' అని విచారిస్తూ బయటకు చూచాడు. ఆశ్చర్యం! బయటవున్న గుఱ్ఱం మీద ఒక పెద్ద మూట వుండటాన్ని గమనించి వెంటనే దాన్ని ఇంటిలోనికి తెచ్చి విప్పి చూడసాగాడు. అందులో లక్షలరూపాయల విలువచేసే రత్నాలు నిండివున్నాయి. బ్రాహ్మణుడు వీటిని చూసి తాను చేసిన పనికి పశ్చాత్తాప పడసాగాడు. ఆయన గద్గదకంఠుడయ్యాడు. ప్రేమతన్మయత్వంతో భక్తిపారవశ్యంతో భాగవతంలోని శ్లోకాన్ని పఠించసాగాడు.

అహోబకీ యం స్తనకాలకూటం జిఘాంసయాపాయయదప్యసాధ్వీ।
లేభే గతిం ధాత్ర్యుచితాం తతో న్యం కం వా దయాలుం శరణం వ్రజేమ॥*
(భాగ 3/2/23)

'ఇటువంటి దీనబంధువు, పతితపావనుడు, అందరిని భరించి పోషించే విశ్వంభరుడైన ప్రభువుమీద అసత్యపు దోషాన్ని మోపి, నన్ను నేను కళంకితునిగా చేసుకున్నానంటే...నన్ను నేనే చీత్కరించుకోవాలి. నేను ధనానికి దాసుణ్ణి కాక నిజంగా ప్రభువుకే దాసుణ్ణయివుంటే నాకు అన్నవస్త్రాల చింత ఎందుకుండేది? నన్ను సంతోషపరచటానికి ఆయన నాకి రత్నరాసులనెందుకిచ్చి వుండేవాడు? నేను వాస్తవానికి భగవత్తత్త్వ రహస్యాన్ని తెలుసుకుని వుంటే, నాకు ఆయనపై నిజమైన భక్తి ప్రేమ వుంటే, నా మనసులో లేశమాత్రమైనా ధనాశలేకుండా వుండి వుంటే, స్వామి నాకీ రత్నరాసులనిచ్చి ఎందుకు మరిపిస్తాడు?' అని అంటూ బ్రాహ్మణుడు ఆనంద ముగ్ధుడైపోయాడు.

చాలా సేపవటం చూచిన బ్రాహ్మణి 'భగవత్ప్రసాదాన్ని తీసికొందాం రండి స్వామీ!' అంది. 'తాను వస్తానని స్వామి చెప్పి వెళ్ళారుకదా! వారు వచ్చిన తరువాతనే ప్రసాదాన్ని తీసుకుంటా' నన్నాడు బ్రాహ్మణుడు. సాయంకాలమైనా స్వామి రాలేదు. బ్రాహ్మణి మళ్ళీ 'ఇకనైనా ప్రసాదం తీసికోండి' అంది. పండితుడు ఆమెమాట వింటాడా? మళ్ళీ అదే మాట చెప్పాడు. రాత్రి పదిగంటలైంది. ఇక పడుకునే సమయం కూడా అయింది. ఐనా భగవంతుడు రానేలేదు. అప్పుడు మళ్ళీ బ్రాహ్మణి ఎంతో వినయంగా 'ప్రసాదం తీసికోండి స్వామి' అని ప్రార్థించింది. ఐనా బ్రాహ్మణుడు ప్రసాదం తీసికోలేదు. భార్యాభర్తలు ఇద్దరూ ఏమీ తినకుండానే నిద్రపోయారు.

---

* శ్రీకృష్ణ భగవానుడు తనను చంపుటకై స్తనములందు విషము నింపుకుని వచ్చిన పూతనను కూడ తన తల్లివలె భావించి ఆమెకు ఉత్తమ గతినొసంగెను. అట్టి దయాళువును వదలి ఇంకెవరి శరణు వేడవలెను?

రాత్రి పదకొండు గంటలైంది. ఇంతలో ఎవరో తలుపుతట్టుతూ 'గురుమాతా! తలుపు తీయండమ్మా' అని మధురస్వరంతో పిలవటం వినబడింది. బ్రాహ్మణ దంపతులకింకా నిద్రపట్ట లేదు. గురుమాతా అన్న మధురమైన కంఠస్వరంతో పిలిచిన పిలుపును విన్న బ్రాహ్మణి ఉలిక్కిపడింది. ఆమె ఆనందంతో ఉక్కిరిబిక్కిరై 'స్వామీ! చూడండి. మీ భగవంతుడు వచ్చేశాడు!' అన్నది బ్రాహ్మణునితో. వెంటనే బ్రాహ్మణుడు పరుగున వెళ్ళి తలుపు తీశాడు. భగవంతుని చరణాల మీద వాలిపోయాడు. భగవంతుడు అతనిని తనహృదయానికి హత్తుకున్నాడు. ఆ సమయంలో పండితునిస్థితి చాలా విచిత్రంగా ఉంది. అతనిశరీరం రోమాంచిత మయింది. కళ్ళనుండి అశ్రువులు ధారాపాతంగా కురవసాగాయి. హృదయం ప్రఫుల్లితమయింది. గొంతు మూగబోయింది. అయినా ఎలాగో తన్ను తాను సంబాళించుకుని 'నాథా! నేను కేవలం అర్థానికే దాసుణ్ణయిన వాణ్ణి. అయినా నావంటి పామరుని మీదకూడా మీకృపా కటాక్షం కలగటం మీదయాగుణ కారణంగానే! నాభావాలు, నాచేతలు గమనించినట్లైతే నాకు మీదర్శనభాగ్యం కల్గటం కాదుకదా, నరకంలో కూడా నాకు చోటు లభించకూడదు. సర్వదా ఏదోషమూలేని మహాపురుషులైన మీకు దోషమంటగట్టాను. నావంటి ధనదాహంగలవాడు, నీచుడు మరొకడెవడు బహుశ వుండడు. ధనం కోసమే మిమ్మల్ని భజించాను. అందుకే మీరు నా సంతోషం కోసం ఈ రత్నాల్నిచ్చారు. నేనొక స్వార్థపరుణ్ణవటం వలన మిమ్మల్ని సాంసారికమైన యోగక్షేమం వహించేవాడనే భావించాను. నిజంగా మిమ్మల్ని అర్థం చేసుకుని ఉంటే ఇహలోక యోగక్షేమం కాక పారమార్థిక యోగక్షేమమునే కోరివుండేవాణ్ణి. నిష్కామభావంతో కేవలం మిమ్ము మాత్రమే నమ్మినవాడు ఈ యోగక్షేమాల్ని కోరనేకోరడు. మీరు అతడు కోరకుండానే అతనియొక్క యోగక్షేమాన్ని వహిస్తారు. మీ వంటి మహాపురుషులయందు కారణంలేని అనన్య శరణాగతిని పొందటానికి నావంటి అభాగ్యులకు ఇలాంటి శ్రద్ధ, ప్రేమ, విశ్వాసం, ఆధారపడకుండటం అనే గుణాలు ఎక్కడున్నాయి?' అన్నాడు.

'ఇందులో నీ దోషం ఏమీ లేదు. నీవు నామీదే ఆధారపడ్డావు. నేనే

రావటంలో ఆలస్యం చేశాను. ఇది నా స్వభావ దోషమే! ఐనా నీవింతవరకూ భోజనమెందుకు చేయలేదు?' అని భగవంతుడు పండితుని అడిగాడు. 'తమరు మళ్ళీ వస్తానని చెప్పివెళ్ళారు కదా! మరి మీరు రాకుండా నేను భోజనం ఎలా చేయగలను? స్వామీ! ముందు మీరు భోజనం చేయండి. ఆ తరువాతనే మేము ప్రసాదాన్ని తీసికొంటాము' అన్నాడు బ్రాహ్మణుడు. 'అలాకాదు, మనం అందరం కలిసే భుజిద్దాం' అన్నాడు భగవంతుడు. అపుడు బ్రాహ్మణునిభార్య భగవత్సంకేతాన్ని అర్థం చేసుకుని వారిద్దరికీ భోజనం వడ్డించింది. అత్యంత భక్తి పారవశ్యంతో బ్రాహ్మణుడు భగవత్ప్రసాదాన్ని సంతోషంగా స్వీకరించాడు. అది చూచిన భగవంతుడు 'నీకేమి కావాలో కోరుకో. నీకు దుర్లభమైనదేదీ లేదు' అన్నాడు. 'స్వామీ! మీరే స్వయంగా దయచేసినప్పుడు ఇంకా నేను కోరుకునే దేముంటుంది? ప్రభూ! నాలో ఈ యోగక్షేమానికి సంబంధించిన కోరిక లేశమాత్రమైనా లేకుండా కేవలం మీ యందే అనన్యవిశుద్ధభక్తిని (ప్రేమను) ప్రసాదించండి' అని అన్నాడు బ్రాహ్మణుడు. భగవంతుడు 'తథాస్తు' అని అంతర్ధానమయ్యాడు. ఆ తరువాత బ్రాహ్మణపత్ని కూడా ప్రసాదాన్ని స్వీకరించింది.

ఇక్కడ తమ్ముళ్ళు భగవద్భక్తుడైన అన్నగారినుండి వేరు పడినప్పటి నుండి అత్యంతదు:ఖాన్ని, దరిద్రాన్ని, అనుభవిస్తూనేవున్నారు. వారికి ఎవరి సాయమూ లభించక, అడిగినా అప్పిచ్చేవాళ్ళూ కరువై, చాలా హీనమైన స్థితికి దిగజారిపోయారు. తమ అన్నగారు చాలా ధనవంతుడయ్యాడని, ఆయన ఇంటిముందు యాచకులు బారులుతీరి వుంటారని విన్న తమ్ముళ్ళు అన్నగారి దగ్గరకు చేరుకున్నారు. పరమభక్తుడైన పండితుడు తన తమ్ముళ్ళిద్దరినీ దగ్గరకు తీసుకుని హృదయానికి హత్తుకున్నాడు. వారి క్షేమ సమాచారమడిగి తెలుసుకున్నాడు. 'మీవంటి సత్పురుషులనుండి విడిపోయినవాళ్ళు క్షేమంగా ఎలా వుంటారు? మీకు మాముఖం కూడా చూపించే స్థితిలో లేము. ఐనా మాపై ఎంతో ప్రేమతో మమ్మల్ని ఆదరిస్తున్నారు. ఇది మీ సౌహార్దమే!' అన్నారు తమ్ముళ్ళు. 'కాదు, అలా అనకండి తమ్ముళ్ళూ! మనం ముగ్గురు సహోదరులం. మనం ఎప్పటికీ వేరుకాలేము. ఇదేదో కర్మఫలం కాబట్టి అలా జరిగింది. మనం ఇంతకు

ముందు ప్రేమగా ఎలా వుండేవాళ్ళమో ఇప్పుడూ అలానే వుండాలి మరి! ఈ లోకంలో సహోదరులను మించిన హితైషులూ, ప్రేమ కలవారూ ఎవరుంటారు? మీరిక బిడియపడకుండా, పశ్చాత్తాపపడకుండా మునుపటి లాగానే ప్రేమతో వుండాలి. ఈ కనిపించే ఐశ్వర్యంలో నాదేముంది? ఇదంతా ఆ భగవంతుని విభూతియే (ఐశ్వర్యమే)! భగవంతుని మనస్ఫూర్తిగా నమ్మిన వాని యోగక్షేమాలు ఆయనే స్వయంగా వహిస్తాడు. పసివాడు తన తల్లిదండ్రుల మీద ఆధారపడి నిర్భయంగా వుంటే, వాడి సంరక్షణా భారాన్ని వారెలా వహిస్తారో అలానే, కాదు కాదు...అంతకంటే ఎక్కువగా...భగవంతుడు తన్ను నమ్మి, తన భారాన్నంతా ఆయనపైనే వుంచే వారి యొక్క యోగక్షేమాల్ని స్వయంగా వహిస్తాడు. వారిని పాలిస్తాడు, పోషిస్తాడు, సంరక్షిస్తాడు. ఇంతెందుకు ఆయన తన్ను తాను తన భక్తునికే సమర్పించుకుంటాడు. కాబట్టి మీరు

**అనన్యాశ్చింతయంతో మాం యే జనా: పర్యుపాసతే !**
**తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్ !!**

**(గీత 9/22)**

అనే శ్లోకంలో చెప్పిన దానిపై విశ్వాసముంచి సర్వదా భగవానుని స్మరిస్తూ వుండాలి. అంతేకాదు, దాని అర్థాన్ని, దానిభావాన్ని పూర్తిగా తెలిసికొని నిరంతరము గీతాధ్యయనమూ, గీతాధ్యాపనమూ చేయాలి' అన్నాడు.

దీని తరువాత తమ్ములిద్దరూ అన్నగారిదగ్గరే వుంటూ ఆయన ఆజ్ఞానుసారమే నిత్యమూ జపధ్యానాదులు చేస్తూ, గీతాపారాయణం చేయటం ప్రారంభించారు. అనతికాలంలోనే భగవద్భక్తిలో తన్మయులై భగవత్కృపచేత ఆయన సాన్నిధ్యాన్ని పొందారు.

ఈ కథ ఎంతవరకు నిజమో తెలియదు. కాని దీనివలన భగవంతుని నమ్మి తన భారాన్ని ఆయనపై వుంచిన వాని యొక్క యోగక్షేమాలు ఆయనే వహిస్తాడను భావం సుస్పష్టమైంది. కాబట్టి మనం కూడా దీన్ని విశ్వసించి భగవంతునిపై నమ్మకంతో ఆధారపడదాం. అన్నిటికంటే ఉత్తమమైన

విషయమేమంటే నిష్కామ భావంతో నిత్యమూ, నిరంతరమూ భగవంతుని స్మరిస్తూ వుండాలని గ్రహించాలి. యోగక్షేమాలకోరికకూడా లేకుండా అహేతుకమైన పవిత్రప్రేమను కలిగివుండటానికే ప్రయత్నం చేయాలి. ఒకవేళ యోగక్షేమాలకోరిక వున్నట్లైతే, పారమార్థిక యోగక్షేమమే కోరుకోవాలి. అప్రాప్తమైనది ప్రాప్తమవటాన్నే 'యోగం' అంటారు. ఈ 'ప్రాప్తమైన దాన్ని రక్షించటమే 'క్షేమం' అంటారు. పారమార్థిక 'యోగక్షేమానికి' అర్థమేమంటే పరమాత్మను పొందటానికి చేసే సాధనమార్గంలో మనం చేరుకున్న సాధనసంపత్తి స్థాయిని భగవంతుడే రక్షిస్తూ ఆ సాధనలో ఏదైనా కొరత కలిగితే దాన్ని పూరిస్తాడు. ఇది భగవంతుడిచ్చిన వాగ్దానం (ఓదార్పు). ఇలా ఈ తత్వాన్ని తెలిసికొని విశ్వసించి భగవంతునిపై భారంమోపి, నిర్భయులయి కేవలం భగవచ్చింతనం తప్ప మరే చింతన లేకుండా వుండాలి.

సాంసారికయోగక్షేమాల్ని కాంక్షించి భగవంతుని భజించేవారు, భగవంతుణ్ణే స్మరించని వారికన్నా ఉత్తములే! ఎందువల్లనంటే అర్థార్థులు, ఆర్తులు మొదలైన భక్తులు కూడా ఉదారులూ, శ్రేష్ఠులుగా చెప్పబడ్డారు. **'ఉదారాః సర్వ ఏవైతే' (గీత 7/18)** - అంతేకాదు జ్ఞాని, నిష్కామ-అనన్యభక్తుడూ తనస్వరూపమేనన్నాడు గీతాకారుడు. అట్టి భక్తునికి భగవంతుడుతప్ప వేరు గతి లేనేలేదు.

కాబట్టి, మనం అందరం భగవంతునికి నిష్కామ జ్ఞానులమైన అనన్య భక్తులం కావాలి. ఇలాంటి భక్తులే భగవంతునికి అత్యంతప్రియులు.

**తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తిర్విశిష్యతే ।**
**ప్రియో హి జ్ఞానినో త్యర్థమహం స చ మమ ప్రియః ॥**

**(గీ 7/18)**

'ఆ భక్తులలో నిరంతరము నాయందే ఏకీభావస్థితుడై, అనన్య భక్తియుతుడైన జ్ఞాని అత్యుత్తముడు. ఏలయన వాస్తవముగ నన్ను (నా తత్త్వమును) తెలిసికొనిన జ్ఞానికి నేను మిక్కిలి ఇష్టుడను. అతడును నాకు మిక్కిలి ఇష్టుడు'.



# 2. నిష్కామభావం

రామూ, గోపాలూ ఇద్దరూ రాంపురం అనే గ్రామంలో ఉండేవారు. ఇద్దరూ గొల్ల కులస్థులు. గోపాలుడు ఇచ్ఛానగరం రాజుగారి ప్రధానమంత్రి యొక్క పేష్కారు ఇంట్లో అంట్లు తోమటం, ఇల్లు తుడవటం మొదలైన పనులు చేస్తూ ఉండేవాడు. ఇతడు రాముడికంటే పెద్దవాడు. వరుసకి సోదరుడౌతాడు. రామూతండ్రి ఆవూళ్ళో బాగా పేరు ప్రతిష్ఠలు కలవానిగా గౌరవించబడేవాడు. రామూ గొల్లలఇంట పుట్టినా మంచి బుద్ధిమంతుడు. సాత్త్వికగుణాలు స్వాభావికంగానే కనపడుతూవుండేవి. రామునిలో భగవద్భక్తి, వినయం, సంతోషం, నిష్కామత్వం మొదలైన గుణాలు కూడా వృద్ధిచెందాయి. అతనిముఖవర్చస్సు రాజకుమారునివలె అందంగా వుండేది. గ్రామస్థులంతా అతణ్ణి ప్రేమగా చూసేవారు. అతడు పదిహేను సంవత్సరాల వయసులోనే గ్రామంలోని వయోవృద్ధుడైన రమాకాంత్ పండితునిదగ్గర మంచి విద్యాభ్యాసంతోపాటు చాలా సద్గుణాలను పొందాడు. ఆయన గొప్ప సంయమనం కలవాడు, సదాచారపరుడు, భగవద్భక్తుడైన విద్వాంసుడు. నగరంలో ఉన్నతమైన అధ్యాపకవృత్తిని విడిచిపెట్టి నిస్వార్థభావంతో గ్రామంలోని పిల్లలకు చదువుచెప్పేవాడు.

రామూ గ్రామమైన రాంపురం ఇచ్ఛానగరి రాజధానికి కొంచెం దూరంలోనే ఉంది. ఒకనాడు వేకువనే రామూ స్నానంచేసి ఇంటినుండి బయలుదేరి తెల్లవారుతుండగా ఇచ్ఛానగరిని చేరుకున్నాడు. అతడు గోపాలుని ఇంటిని వెతుకుతూ కనుగొని హఠాత్తుగా అతని కాళ్ళు పట్టుకున్నాడు. గోపాలుడు అప్పుడే పక్కమీదినుండి లేచాడు. రామూని యీస్థితిలో చూచి అతడు చకితుడైపోయాడు. ఆనందాశ్చర్యాలతో అతనిముఖంలోకి చూస్తూ వుండిపోయాడు.

'అన్నా! నువ్వు ధన్యుడవు!' అన్నాడు రాముా గోపాలుని కాళ్ళుపట్టుకుని. గోపాలుడు కాళ్ళు వెనక్కి తీసుకుంటూ 'అరే! తమ్ముడూ! చాలా మంచిపని చేశావు. ఊళ్ళో అంతా బాగున్నారు కదా! నువ్వు నా కాళ్ళెందుకు పట్టుకుంటున్నావు? నువ్వు నా తమ్ముడివి కదా!' అని అడిగాడు ఒక్క గుక్కలో.

'అన్నా! నీ మహిమ నేనేమని చెప్పను? నీవు ధన్యుడవు అంతే!' అన్నాడు రాముా గద్గద స్వరంతో.

తమ్ముడూ! నేనూ నీఇంటిలో మనిషినే కదా! నేను మహారాజు గారి దీవానుగారి పేష్కారుదగ్గర అంట్లు తోమే నీచమైన పనిచేసే నౌకరునే! నేను ధన్యుణ్ణవటమేమిటి?' అన్నాడు గోపాలుడు విషయం తెలుసుకుందామని.

'అందుకే నీవు ధన్యుడవన్నా! మన మహారాజు అనన్యభక్తుడూ, జ్ఞానీ, యోగిపుంగవుడూను. ఆయనొక గొప్ప మహాపురుషుడని నీకు తెలియదా?' అన్నాడు రాము గోపాలుని కాళ్ళకు అతుక్కుపోతూ. 'అయితే ఏమిటట? ఇన్ని సుగుణములున్నవాడు మహారాజు కదా! నాలో అందులోని ఒక్క గుణమూ లేదు!' అన్నాడు గోపాలుడు రాముని వదలించుకుంటూ.

అలాంటి మహారాజుగారి దివాన్‌యొక్క పేష్కారు దగ్గర నౌకరీ దొరకటం మామూలు మాటా ఏమిటి? అలాంటి నౌకరీ నాకు దొరికినట్లైతే నా జీవితమే ధన్యమైందనుకుంటాను. కనీసం నీలాంటి వానికి సేవ చేసే భాగ్యం లభించినా నా జీవితం ధన్యమైనట్లే అనుకుంటాను' అంటూ ప్రేమతో నిండిన వాక్యాలు పలుకుతూ రాముా గోపాలుని ముఖంలోకి చూడసాగాడు.

గోపాలునిపై రాముా వాడిన పదాల ప్రభావం బాగానే పనిచేసింది. 'తమ్ముడా! పేష్కారుగారికొక మనిషి అవసరమేనట! నాతో అన్నారు. నీవూ అలాంటి వారి దగ్గర పని చేద్దామనుకుంటున్నావు కదా! నీవు రానే వచ్చావు కాబట్టి ఇవాళే నీకాపని ఇప్పిస్తాను' అన్నాడు గోపాలుడు.



రామూ పేష్కారుదగ్గర చాలా శ్రద్ధగా పనిచేయసాగాడు. నెల పూర్తవగానే గోపాలునితో పంపిన జీతాన్ని రామూ తీసుకోలేదు. అప్పుడు పేష్కారు రాముని పిలిచి, 'నీవు రాత్రింబవళ్ళు అత్యంత భక్తి శ్రద్ధలతోనూ, ఉత్సాహంగానూ, జాగ్రత్తగానూ పనిచేస్తున్నావు. ఇంతకు ముందు పనిచేసిన నౌకరుకంటే రెండింతలు పని చేస్తున్నావు. ఇంతపని ఏనౌకరూ చెయ్యడు. ఐనా క్రితం నెల నీకు పంపిన జీతం తీసుకోలేదు నీవు. నాకు చాలా సిగ్గుచేటుగా వుంది. బహుశా నీకిచ్చే ఈ పదిరూపాయల జీతం చాలా తక్కువేమో! ఇప్పుడు నీకెంత కావాలో చెప్పు. అదే నీకు నెలనెలా జీతం క్రింద ఇస్తాను' అన్నాడు.

శుద్ధ సాత్త్వికుడూ, దివ్యగుణ సంపన్నుడూ అయిన రాజుగారి దివాను యొక్క పేష్కారు దగ్గర వుండటానికి తనకు చోటు లభించటంతో రాముని ఆనందానికి హద్దు లేకుండాపోయింది. ఈ చోటు సంపాదించటానికే అహంకారమూ, మమకారమూ, ఆసక్తి మరియు స్వార్థమూ అనేవన్నీ వదిలేసి అత్యంత శ్రద్ధాభక్తులతో నిండిన హృదయంతో నిష్కామభావంతో అతడు సేవ చేస్తూవుండేవాడు. పేష్కారు వానిసేవలకు అత్యంత సంతుష్టుడయ్యాడు. పేష్కారుమాటలను విన్న రామూ అత్యంత వినమ్రుడై 'నేను జీతం తీసుకోపోవటానికి కారణం జీతం తక్కువని మాత్రం కాదు' అన్నాడు. పేష్కారు ఆశ్చర్యపోయాడు. అతనికి రామూ అన్న మాటల్లో నమ్మకం కలగలేదు. 'మరి అంత ఎందుకు ఎక్కువ కష్టపడుతున్నావు?' అని అడిగాడు. 'అయ్యా! మన రాజుగారు ఒక గొప్ప జ్ఞాని, యోగి, ఈశ్వరభక్తుడూ, మహాత్ముడూ అయిన గొప్ప మహాపురుషుడు అని మీకు తెలియనిదేముంది? తమరు వారి దివానుగారిపేష్కారు కదా! అటువంటి మీకు చాకిరీ చేసే సౌభాగ్యం నాకు లభించటమే గొప్ప! ఇంతకుమించిన నెలసరిజీతం ఏముంటుంది చెప్పండి?' అని రామూ నతమస్తకుడౌతూ సమాధానమిచ్చాడు.

'నీవు చెప్పినట్లు రాజుగారు సరిగా అలాంటివారే! కానీ నేనొక మామూలు మనిషినే కదా! ఆయనలోవున్న గుణంలో ఏ ఒక్కటీ నాలో లేవు. అలాంటినాకు సేవచేస్తే నీకేంలాభం?' అని పేష్కారు ఉత్సుకతతో ప్రశ్నించాడు.

'తమరైతే రాజుగారి దీవానుయొక్క పేష్కారులేకదా! నావంటి వానికి తమవంటి గొప్పవారి సేవ ఎలా లభిస్తుంది? భగవంతుని సేవాభాగ్యం మాట అటుంచితే, ఆయనదాసానుదాసుల దాసానుదాసుని సేవ లభించటమే మహాభాగ్యం కదా! అటువంటివారిసేవలభిస్తే ఎప్పుడో ఒకనాడు వారి సంపర్కంతో ఆ భగవదనురాగులైన మహాపురుషులదర్శనం కలుగకపోదు. కాబట్టి తమరిసేవ చేసుకుంటూవుంటే ఏనాటికైనా భగవద్భక్తుడైన రాజుగారి సంపర్కంలో వుండే ఆ దీవానుగారి దర్శనంనాకు కలుగకపోదా అని ఆశ!' అని తనమనసులోని అసలైన మాటను ఎంతో సరళంగా విన్నవించుకున్నాడు.

'దీవానుగారిదర్శనం లభించటం పెద్ద విశేషమా ఏమిటి? రేపే వారి దర్శనం చేయిస్తాను' అన్నాడు పేష్కారు రామూ యొక్క పవిత్రభావానికి ముగ్ధుడై. 'దీవానుగారు రోజూ ఉదయం ఎనిమిదిన్నర గంటలకు న్యాయాలయానికి వస్తారు. నేను ఎనిమిది గంటలకు అక్కడుంటాను. నీవు తొమ్మిది గంటలకు ఒక గ్లాసుతో నిమ్మరసం, మంచినీళ్ళు తీసుకుని అక్కడికి రా! జీతం ఎంత కావాలో చెప్పు! అంతా మీ ఇంటికి పంపుతాను' అన్నాడు పేష్కారు.

'నాకు డబ్బుతో ఇప్పుడు అవసరంలేదు. ఇల్లు గడుస్తూనే ఉంది. నాకు దీవానుగారి దర్శనంతోనే అన్నీ లభిస్తాయి!' అని వినయంగా జీతాన్ని తీసుకోలేదు.

రామూ యొక్క స్వభావాన్ని లోలోపలే ప్రశంసిస్తూ పేష్కారు అతనివైపు అలానే చూస్తూ వుండిపోయాడు.



గద్దెమీద దిండునానుకుని కూర్చున్న దీవాను గుమ్మంవైపు చూశాడు. ఒక అందమైన అపరిచితనవయువకుడు ఒక గ్లాసు చేతబట్టుకుని రెప్పవేయకుండా ముగ్ధమోహనంగా ఆయనవైపే చూస్తుండటం గమనించాడు. 'అతడు భగవద్దర్శనం చేసుకుంటున్నాడా అనిపించింది. అతడు రెప్ప వాల్చకుండా చూస్తున్నట్లు దీవాను చాలా సార్లు గమనించాడు. అతడు అతృప్త నేత్రాలతో అదేపనిగా దీవాన్నే చూస్తున్నాడు.

'ఇతడెవరు? ఇక్కడెందుకు నుంచున్నాడు?' అని దీవాను పేష్కారునడిగాడు.

'అయ్యా! ఇతడు తమ నౌకరే. ఇవాళ నేను ఫలహారం చేయకుండా వచ్చాను. అందుకే ఇతడు ఇక్కడికే తెచ్చాడు' అన్నాడు పేష్కారు.

'అలానా, ఐతే ముందు ఫలహారం చెయ్యి' అన్నాడు దీవాను. పేష్కారు ఫలహారం చేసి తనపనిలో నిమగ్నమైపోయాడు. కానీ రామూ యొక్క ముగ్ధమోహనదృష్టి యొక్క ప్రభావం దీవానుపై పడనే పడింది. ఆయన మాటి మాటికీ రామూవైపు చూస్తూనే వున్నాడు. రామూ పేష్కారు ఫలహారం చేసిన చోటును తుడిచి శుభ్రం చేశాడు. దీవానుగారి పాదరక్షలను శుభ్రంచేస్తూ దీవానుగారివైపు శ్రద్ధగా ప్రేమపూర్వకంగా అప్పుడప్పుడూ చూస్తున్నాడు.

'ఈ కుర్రవాడు తనుచేసే పనిని అత్యంత ఉత్సాహంగాను, ప్రేమపూర్వకంగా చక్కగా చేసుకుపోతున్నాడు. ఏమిస్తున్నావేమిటి?'అని అడిగాడు పేష్కారుని దివాను.

'అయ్యా! పనిని చాలా శుభ్రంగాను, అందంగాను చేస్తాడు. కానీ ఏమీ తీసుకోడు' అన్నాడు.

ఆశ్చర్యచకితుడైన దీవాను అతణ్ణి దగ్గరికి పిలిచి 'ఏమీ పుచ్చుకోకుండానే పనిని ఇంతచక్కగా ఎందుకు చేస్తున్నావు? కారణమేమిటి?' అని అడిగాడు.

'ప్రభూ! మీ దర్శనం కోసమే! ఇవాళ నేను ధన్యుణ్ణయ్యాను!' అని రామూ మెల్లిగా గొణిగాడు.

'నాలో అలాంటి దేమున్నదయ్యా!' అన్నాడు దీవాను ఆశ్చర్యపోతూ.

'దీవానుగారూ! మన రాజుగారు ఒక గొప్ప యోగి, జ్ఞాని, ఈశ్వరభక్తుడూ, మహాత్ముడూ అయిన గొప్ప మహాపురుషుడని మీరెరుగుదురు కదా! అటువంటి పవిత్రాత్ముడైన రాజుగారికి తమరు దీవానులు! తమవంటి వారిదర్శనం కలగటం మామూలు విషయం

ఏమాత్రమూ కాదు!. ఎంతో అదృష్టం చేసుకున్న వారికే తమవంటి వారి దర్శనం లభిస్తుంది' అని రామూ అతివినయుంగాను, అతిప్రేమగాను పలికాడు.

'నీవు అలా అనుకుంటున్నట్లైతే నా దగ్గరే వుండవచ్చు' అన్నాడు దీవాను. రామూ ప్రయోగించిన ప్రేమమంత్రపుమాయ దీవానుమీద బాగానే పనిచేసింది.

రామూ ఆశ్చర్యపోయాడు. అత్యంత ఆనందంతో 'తమచరణాల సాన్నిధ్యం పొందిన నేను ఎంతో సౌభాగ్యవంతుణ్ణయ్యాననుకుంటున్నాను' అన్నాడు.

'ఏమోయ్ ఇతణ్ణి నా దగ్గరుంచుకోవాలనుకుంటున్నాను' అని పేష్కారువైపు చూసి అడిగాడు.

'సంతోషంగా తమదగ్గరే వుంచుకోండి!' అని పేష్కారు తన సమ్మతిని తెలిపాడు.



'నా దగ్గర పని చేయటం మొదలుపెట్టి చాలా రోజులైంది. మొదటి రోజున్న ఉత్సాహము, శ్రద్ధాభక్తులతోనే ఇప్పటి వరకూ పనిచేస్తున్నావు. మామూలు నౌకర్లెవరూ ఇలా చేయనే చేయరు. కాని, ఇంతవరకు నీవేమి వేతనం తీసుకోనేలేదు. నాకు చాలా సంకోచంగా ఉంది. పోనీ జీతమని కాకుండా బహుమతిగానైనా ఎంతో కొంత డబ్బు తీసుకోవోయ్! రెండు మూడొందలు ఎంతైనా సరే చెప్పు. మీ ఇంటికి పంపిస్తాను' అన్నాడు స్నేహపూర్వకంగా దీవాను.

'ఇంట జరుగుబాటు బాగానే ఉందయ్యా! అక్కడ డబ్బు అవసరం ఏమాత్రం లేదు' అన్నాడు రామూ శ్రద్ధాభక్తులతో.

'అరె! డబ్బు కాకుంటే ఇంకేదైనా వస్తువు కోరుకో! నీసేవలకు నేను చాలా ఋణపడిపోతాను. నీకు ఎంతో కొంత ప్రత్యుపకారం చేయాలనుంది' అన్నాడు దీవాను అర్థిస్తున్నట్లుగా.

'అలా అని తమరు నన్ను సిగ్గుపడేలా చేస్తున్నారయ్యా! తమసేవను మించిన బహుమతి నాకు మరేదీ లేదు. తమరొక మహాపురుషుని యొక్క దీవానుగా దేశానికి సేవ చేస్తున్న సేవకులు! నాకైతే తమదర్శనమే దుర్లభము. అలాంటివానికి తమ సేవాసౌభాగ్యాన్ని ప్రసాదించి నన్ను ఋణగ్రస్తుని చేసేశారు. తమసేవనే చేస్తూ వుంటే నా అదృష్టం పండి తమదయవలన ఎప్పుడో ఒకప్పుడు మహారాజుగారి దర్శనభాగ్యం లభించక తప్పదు' అన్నాడు తనమనసులోని మాటను బయటపెడుతూ రాము.

'రాజుగారి దర్శనమా! అదెంత పని? అది రేపే చేయిస్తాను నీకు. నేను రాజసభకు పన్నెండు గంటలకు వెడతాను. రాజుగారు ఒంటిగంటకొస్తారు. రేపు మంగళవారం కదా! నేనేమీ తినకుండానే సభకు వెడతాను. నా ఫలహారం అక్కడికే వస్తుంది. కాబట్టి నీవు రెండు గంటలకు ఫలహారం తీసికొని అక్కడికిరా. కానీ ఇంటికి కొంత డబ్బు పంపనయ్యా!' అన్నాడు దీవాను రామూని బ్రతిమిలాడుతూన్నట్లుగా.

'నేను తమకెప్పుడూ ఋణపడేవుంటానయ్యా! నాకు డబ్బేమీవద్దు' అన్నాడు రామూ నతమస్తకుడౌతూ.



ఆనందసాగరంలో మునిగితేలుతున్న రామూని చూశారు రాజుగారు. అతనిలో పొంగిపొరలుతున్న ఆనందానుభవాన్ని రాజుగారు పసికట్టారు. రామూ కన్నార్పకుండా రాజుగారినే తదేకదృష్టితో చూస్తూ ఆనందమగ్నుడవటం రాజుగారు కనిపెట్టేశారు. 'ఇతడెవరు? ఇక్కడెందుకు నుంచున్నాడు?' అని దీవానుని రాజుగారు అడిగారు.

'శ్రీమాన్! ఇతడు తమసేవకుడే! ఇవాళ మంగళవారం కదా! ఫలహారం తెచ్చాడు!' అన్నాడు దీవాను.

'ఔనా అయితే మీరు ఫలహారం తీసుకోండి!' ఆజ్ఞాపించారు రాజుగారు. దీవాను మరోచోటుకి వెళ్ళి ఫలహారం చేసి, తన కార్యాలయం లోనికివచ్చి, తిరిగి తన పనిలో నిమగ్నమయ్యాడు. రామూ ఎంగిలి గిన్నెలు శుభ్రంచేసి, దీవానుగారివి, రాజుగారివి పాదరక్షలు తుడవసాగాడు. మాటి

మాటికీ రాజుగారివైపు చూస్తూ ఆనందంలో మునిగిపోతున్నాడు రాము. అతడు మంత్రముగ్ధునిలా వున్నాడు. రాముస్థితి రాజుగారికర్థమయింది.

'ఇతడు చాలా ఉత్సాహవంతుడిలా వున్నాడు. జీతమెంత ఇస్తున్నారు!' అని దీవానుని అడిగారు.

'ప్రభూ! ఇతడు పనిమాత్రం అత్యంతతత్పరతతో శ్రద్ధాభక్తులతో చేస్తాడు. కానీ ఎంత బలవంతపెట్టినా జీతం మాత్రం తీసుకోడు' అని సమాధానం చెప్పాడు దీవాను. రాజుగారు ఆశ్చర్యపోయారు. రామూని పిలిచి ఇంత చక్కగా పనిచేస్తూ కూడా జీతం తీసుకోకపోవటానికి కారణం ఏమిటి?' అడిగారు.

'జీతం లేకుండా ఏమిటి ప్రభూ! మీరి దయవలననే కదా తమవంటి మహాపురుషుల్ని దర్శించి నేను ధన్యుణ్ణయ్యాను! నేడు ప్రభువులను దర్శిస్తున్నానూ అంటే ఇది నా పరమసౌభాగ్యమే!' అని గద్గదకంఠుడయ్యాడు రామూ.

'నిన్ను నీవు కృతకృత్యుణ్ణనుకోవటంలోని విశేషమేమిటి?' అడిగారు రాజుగారు.

'ప్రభువులు మహాపురుషులు. తమరు యోగులు, జ్ఞానులు, భక్తులు మరియు మహాత్ములు. అట్టి మీవంటి వారిదర్శనం కల్గటం అతిదుర్లభం. అట్టివారి దర్శనం కలిగిందీ అంటే అది మహద్భాగ్యం వల్లనే! ఇవాళ ప్రభువులను దర్శించి నేను పరమధన్యతను పొందాను! నాజన్మ తరించింది. ఫలించింది. ప్రభుకృపవలన నేను నిజంగా కృతార్థుడనయ్యాను!' అంటూ రామూ మహారాజుగారి పాదాలమీద పడ్డాడు.

'నీకోరిక ఇదే అయితే నీవు నాదగ్గరే ఉండిపోవచ్చు' అని రామూ వలన ప్రభావితుడైన రాజుగారు అన్నారు.

'నాకింతకంటే కావలసినదేముంది ప్రభూ? ఇది నా మహద్భాగ్యం అనుకుంటాను' అన్నాడు రామూ తనతలను రాజుగారి పాదాలమీద వుంచి.

'ఈ పిల్లవాణ్ణి నాదగ్గరే వుండనీయండి!' అన్నారు రాజుగారు దీవానుతో. ఆయనహృదయంలో స్నేహభావం ఉప్పొంగింది. దీవాను తలవంచి తనసమ్మతిని తెలిపాడు.



'నీవు చేసే సేవకు నాకు చాలా సంతోషంగా వుంది. కానీ నీవేమీ జీతం తీసుకోవు, మీ ఇంటికేమీ పంపవు. ఇది మాత్రం ఏమీ బాగుండలేదు. నీకు నేనెంతో ఋణపడియున్నాను. నీకేంకావాలో చెప్పు. నీ కోరిక తీరుస్తాను' అన్నారు రాజుగారు.

'ప్రభూ! అల్పుడైన ఈ దాసునిమీద మీకెంతో దయ కలిగింది. అదే నాకు పదివేలు. నాకు డబ్బుతో పనిలేదు' అన్నాడు రామూ సమాధానంగా.

'నేను నీ ఉపకారం మరిచిపోలేను. నా సంతోషానికైనా నీవు ఏదో ఒకటి తీసికోవాల్సిందే!' అన్నారు రాజుగారు అనునయంగా.

'అలా అని నన్ను సిగ్గుపడేలా చేయకండి ప్రభూ! ప్రభుసేవలో ఈ భౌతికమైన వస్తువులన్నీ చాలా తుచ్ఛంగా కనిపిస్తున్నాయి. దీన్ని మించి నాకేమీ వద్దు. ఐనా తమరింకా ఏదైనా చేయాలనే పట్టుదలతో వున్నట్టైతే నేనడిగిందే తమరీయవలసి వుంటుంది' అని మధురంగా పలికాడు.

ఇతడడిగితే నా సమస్త రాజ్యాన్ని కూడా సంతోషంగా ఇచ్చేయగలను అని మనస్సులో సంకల్పించి, పైకి ధృఢంగా 'నీవడిగింది తప్పకుండా ఇస్తానయ్యా! చెప్పు!' అన్నారు రాజుగారు.

'నేను ఎల్లప్పుడూ తమపాదాలదగ్గరే వుండేటట్టు, ఒక్కక్షణం కూడా తమరు నన్ను మీ నుండి వేరుచేయననే వరాన్ని ప్రసాదించండి!' అంటూ అత్యంత శ్రద్ధావిగళితహృదయంతో రామూ మహారాజుగారిపాదాలపై వాలిపోయాడు.

'ఇందులో ఏముంది? నీవు ఎక్కువ సమయం నాతోనే వుంటున్నావు కదా! సరే! ఇంకేమైనా కోరుకో!'

'చాలు ప్రభూ! నేనిదే కోరుకుంటున్నాను'

'నాకేమీ అభ్యంతరం లేదు. ఆనందంగా నీవు నాతోనే వుండిపో!' అన్నారు రాజుగారు.



'రాత్రిపూట పడక గదిలో నా వెనుకే నీవు ఎందుకు?'

'ప్రభూ! నిత్యమూ తమతోనే వుండే ఆజ్ఞ లభించింది కదా!' అన్నాడు వెంటనే రామూ చేతులు జోడించి.

'ఇలారా!' అని పిలిచారు రాజుగారు.

'నీకు కొడుకులు లేరు కదా! అందుకే నీ సేవకోసం కొడుకులాంటి వాణ్ణి ఇతణ్ణి తీసుకొచ్చాను!' అని రాజుగారు రాణితో చెప్పారు.

'సరే మంచిది!' అని రాణి రాముని వైపు చూసింది. అతనిముఖాన్ని చూడగానే ఆమెకన్నులు స్నేహాశ్రువులతో నిండిపోయాయి. ఆమెలో వాత్సల్యం పొంగిపొర్లింది. రామూ మంత్రముగ్ధుడైన శిశువులా మహారాణినే చూస్తూ వుండిపోయాడు.



'ఇప్పటి వరకూ ఇతడు రోజువారీ పనులను మాత్రమే చూస్తూ వచ్చాడు. ఇకపై అన్ని పత్రాలమీద ఇతనే సంతకం చేస్తాడు. ఈతని సంతకం నా సంతకంతో సమానమైనదిగా చెలామణి ఔతుంది' రాజుగారు దీవాన్‌గారితో అన్నారు. రాము చేసిన సేవలకు ఆయన చాలా సంతుష్టులయ్యారు. రామూ చాలా తీక్ష్ణ బుద్ధికలవాడు. రాజుగారికి అనన్య సేవకుడే కాక వారి గుణాలన్నింటినీ తనలో నింపుకున్నవాడు. కాబట్టే కొద్ది రోజులకే కావలసిన యోగ్యతను సంపాదించుకున్నాడు. రామూ చదువుకున్నవాడు కూడా కదా!

దీవాను రాజాజ్ఞను శిరసావహించాడు. కాగితాలమీద రామూ సంతకాలు చేయటం ప్రారంభించాడు.

కొన్నాళ్ళ తరువాత -

'నాకు సంతానం లేదు. నిన్నే యువరాజుని చేద్దామనుకుంటున్నాను' అన్నారు రాజుగారు. రామూని ఆయన తమ పుత్రునిగానే భావిస్తూ ప్రేమిస్తున్నారు.

'నన్ను సిగ్గుపడేలా చేయకండి ప్రభూ! నేను ప్రభువుల పాదసేవను ఏమాత్రం వదులుకోలేను. ఈ లాభం ముందు రాజ్యసుఖం తుచ్ఛమైనదే కదా!' అని సేవాపరాయణుడైన పుత్రునిగా రామూ రాజుగారితో విన్న వించుకున్నాడు.

రాజుగారు రామూ మాటను మన్నించారు. రామూచేత రాచకార్యాలు నిర్వహించటానికై తమఆజ్ఞను ప్రకటించారు.



'నేను మీ బంటును. ఇదంతా మీ దయవల్లనే జరిగింది' అని రామూ దీవానుగారిపాదాలు పట్టుకుని అన్నాడు.

'మీరిప్పుడు రాజుగారిప్రతినిధులు! మీరు సింహాసనానికి అధికారులు. నన్ను సిగ్గుపడేలా చేయకండి!' అని కంగారుపడుతూ దీవాను రామూని సింహాసనం మీద కూర్చోబెట్టాడు. దీవాను సభలోకి వచ్చాడు.

'నేను మీ పాదదాసుణ్ణి! మీనౌకర్ని. ఇదంతా మీదయవల్లనే నాకు లభించింది!' అంటూ రామూ పేష్కారుకాళ్లు పట్టుకుని అతనిని సింహాసనం మీదకి తనవైపు లాగసాగాడు.

పాపం. పేష్కారు ఏదో పనిమీద అక్కడికి వచ్చాడు. ఎంతో ప్రయత్నం మీద రామూని సింహాసనంమీద కూర్చుండబెట్టి తనచోటుకు వెళ్ళి కూర్చున్నాడు.

'అన్నా! నీదయవల్లనే నాకీసింహాసనం లభించింది. పద! ఈ సింహాసనం మీద కూర్చో!' అంటూ సింహాసనం దిగి పేష్కారు పాతనౌకరువైపు పరిగెత్తిపోయి ఎంతో వినయంగా ప్రార్థించాడు.

'పేష్కారు, దీవానుగార్ల ఎదుట నేను ఎత్తైన సింహాసనం మీద ఎలా కూర్చోగలను? ఎప్పటికీ కూర్చోలేను. మీరు నన్ను లజ్జితుణ్ణి చేయకండి!' అంటూ పేష్కారుగారినౌకరు అక్కడే నేలమీద క్రింద కూర్చుండిపోయాడు. పాపం అతడెందుకో అటువైపుగా వచ్చాడు. రాములో లేశమాత్రమైనా అహంకారం కనబడలేదు.

'నీవు వినయమే మూర్తీభవించినవాడవు! అహంకారము, మమత మొదలైనవి నీ ఛాయలకు స్పృశించటానికి కూడా రాలేవు. అతి చిన్న ఉద్యోగి నుండి అత్యుత్తమ-అధికారివరకూ అందరూ నీవలన ప్రసన్నులే! సంతుష్టులే! నీలో రాజ్యాన్ని శాసించే అపూర్వమైన యోగ్యత, ఓర్పు రెండూ కన్పిస్తున్నాయి. కాబట్టి నామాటవిని ఈ రాజ్యపాలనాధికారాన్ని స్వీకరించు. ఇక నేను ఏకాంతవాసాన్ని కోరుకుంటున్నాను' అని రాజుగారు తమ మనోభీష్టాన్ని రాము ముందు ప్రస్తావించారు.

'ప్రభూ! సర్వదా తమచరణాలచెంతనే వుండే వరాన్ని ప్రసాదించారు. మరి ఒక్క క్షణమైనా నన్ను తమనుండి వేరుచేయలేరు కదా? నాకు రాజ్య పదవీకాంక్ష ఏమాత్రం లేదు. ప్రభూ! తమరిలా అని నన్ను లజ్జితుణ్ణి చేయకండి. నేనీ రాజ్యపదవిని స్వీకరించటానికి సర్వథా అసమర్థుణ్ణి. కాబట్టి నన్ను క్షమింపుమని ప్రార్థిస్తున్నాను' అని తన దృఢనిశ్చయాన్ని వినయమూ, ప్రేమా ఉట్టిపడేటట్టు రాజుగారికి విన్నవించుకున్నాడు.

'సరే! నాతోనే వుంటూ రాజ్యపాలనాధికారాన్ని స్వీకరించు!' అన్నారు రాజుగారు తమ అభిప్రాయాన్ని మార్చుకుంటూ.

రాజుగారితో వుంటూనే రామూ రాజ్యకార్యభారాన్ని కూడా మోయసాగాడు.



రాముూ గొల్లవాని ఈ కల్పితకథ ఒక దృష్టాంతరూపంగా చెప్పబడింది. పారమార్థిక దృష్టితో ఈ విధంగా దీన్ని అన్వయించుకోవాలి. పరమాత్మప్రాప్తికై చేసే సాధనమార్గంలోని సాధకుడు రాముూ అని అనుకోవాలి. భగవంతునిదాసునియొక్క దాసానుదాసుడు పేష్కారు దగ్గర పనిచేస్తున్న నౌకరు గోపాలుడే అని తెలుసుకోవాలి. భగవంతుని దాసానుదాసుడు పేష్కారుగాను, దీవానుని భగవంతునిదాసునిగాను, ఇచ్ఛానగరిని పాలించే మహారాజును సాక్షాత్తు భగవంతునిగాను అర్థంచేసుకోవాలి. మహారాజుగారి యొక్క భక్తి, జ్ఞానము, యోగము మొదలైన గుణాలన్నింటినీ భగవద్గుణాలుగానే భావించాలి. రాజుగారి భార్య రాణిగారిని ఈశ్వరశక్తియైన భగవతీదేవిగా తెలుసుకోవాలి! రాముూయొక్క జీతం మొదలు రాజ్యపదవివరకూ ఏమీ స్వీకరించకుండా వుండటాన్ని నిష్కామయుక్తమైన స్వార్థత్యాగమే అని అర్థం చెప్పుకోవాలి. అతడు శ్రద్ధ, ఉత్సాహంతో పనులు చేయటాన్ని సాధకుడు చేసే సాధనగా తెలుసుకోవాలి. అతని శ్రద్ధ, భక్తి, వినయపూర్వకమైనట్టిది, అహంకారరహితమైనట్టి ప్రవర్తనయే ఆదర్శమైన శిష్టాచారముగా తెలుసుకోవాలి. రాజ్యపదవిని ముక్తిగాను, ఎల్లప్పుడూ రాజుగారి సమీపంలో వుండటాన్నే అత్యుత్తమ విశుద్ధప్రేమగాను అర్థం చేసుకోవాలి.

ఈ దృష్టాంతంవలన మనం నేర్చుకోవలసిన దేమంటే... అహంకార, మమకారాలను, ఆసక్తిని, స్వార్థాన్ని త్యాగం చెయ్యాలి. శ్రద్ధాభక్తులు కలిగి వినయపూర్వకమైన నిష్కామభావంతో భగవంతుని దాసానుదాసుల సాంగత్యాన్ని పొంది వారికి సేవ చేస్తూ భగవదాజ్ఞను పాలించటమే కాక మోక్షాపేక్ష కూడా లేకుండా నిష్కామప్రేమభావంతో భగవంతుని సామీప్యంలోనే వుంటూ ఆయననే నిరంతరం స్మరిస్తూ, ఆయన సేవనే కోరుకుంటూ వుండాలి.



# 3. గీతాశ్లోకార్థము - దాని రహస్యము

సంతుష్టుడు, సదాచారవంతుడు, విద్వాంసుడు అయిన ఒక గొప్ప బ్రాహ్మణుడుండేవాడు. కానీ ఆయన చాలా పేదవాడు. ఆయనభార్య మహాపతివ్రత, విద్వాంసురాలు, తత్త్వజ్ఞాన సంపన్నురాలైన జీవన్ముక్తురాలు. ఆదేశపురాజు కూడా తత్త్వజ్ఞాని, జీవన్ముక్తుడు అయిన మహాత్ముడు. బ్రాహ్మణపత్ని ఒకనాడిలా అనుకొంది 'నా భర్త నిత్యసంతోషి, సదాచారి, విద్వాంసుడూను. కాబట్టి ఈయన 'ముక్తి'కి అధికారియే! ఈయన జీవన్ముక్తుడైన మనరాజుగార్ని కలిసినట్లైతే త్వరలో ఈయన కూడా తత్త్వజ్ఞాని, జీవన్ముక్తుడు కాగలడు' అని ఆలోచించి తన పతిని ఇలా ప్రార్థించింది. 'పతిదేవా! ప్రస్తుతం మనకు కుటుంబ నిర్వహణమే చాలా కష్టంగా ఉంది కదా! ఆదాయానికి ఏదారీ కనిపించటం లేదు. ఇక్కడున్న రాజుగారు గొప్ప సదాచారసంపన్నుడు, జీవన్ముక్తుడైన మహాత్ముడని, బ్రాహ్మణులను ఆదరించి సత్కరించే ఉదారుడనీ విన్నాం. మీరొక మారు వారిని దర్శిస్తే ఆయన మీకు తగిన సత్కారం చేయగలరేమో! పైగా శాస్త్రవిధిననుసరించి యాచించకుండానే బ్రాహ్మణులకు రాజు ఏ కొంచెమిచ్చినా అది బ్రాహ్మణులకు అమృతతుల్యమౌతుందన్న విషయం మీకు తెలియనిది కాదుకదా! ఆలోచించండి!' అన్నది.

'నీవు చెప్పినది నిజమే! కానీ నేనెవరికీ ఏ ఉపకారమూ చేయకుండా దానం పుచ్చుకొని జీవనం గడపటాన్ని నిందాస్పదమనే అనుకొంటున్నాను. కనుక నేనలా చేయను. నేనాకలితో పస్తులుండవలసి వచ్చినా సరే!' అన్నాడు పండితుడు.

'మీరు విద్వాంసులే కదా! రాజుకు తగిన ఉపదేశం చేసి ఆయనకు ఉపకారం చేయొచ్చు కదా!' అన్నది బ్రాహ్మణపత్ని.

ఈ మాట పండితునికి కొంచెం రుచించింది. కానీ అతని మనసు

రాజుని చూడటానికి ఇష్టపడటంలేదు. చివరకు భార్య ఎంతో నచ్చజెప్పిన మీదట వెళ్ళటానికి సిద్ధపడ్డాడు.

రాజసభకు వెళ్ళాడు. రాజు పండితుని ఆదరించి ఘనంగా సత్కరించాడు. కుశల ప్రశ్నలతరువాత బంగారు నాణేలను పండితునికి కానుకగా ఇచ్చాడు. పండితుడు వానిని స్వీకరించకుండా 'రాజా! తమరు గొప్ప ఉదారులని నేనెరుగుదును. కానీ నేనెవరికీ ఏ ఉపకారమూ చేయక వారినుండి అయాచిత రూపంలో కూడా దేనినీ గ్రహించకూడదనే నాకొక నియమం ఉంది. కనుక కానుకను స్వీకరించనందుకు క్షమించి, తమరేదైనా ఒక పనినీయండి. దానిని పూర్తిచేసి తమకు సంతోషం కలిగించినట్లైతే తమరేమిచ్చినా స్వీకరిస్తాను అన్నాడు.

'మంచిది బ్రాహ్మణోత్తమా! మీరు సదాచారులైన విద్వత్ బ్రాహ్మణులు! మీనుండి గీతారహస్యం తెలుసుకోగోరుతున్నాను. నాయందు దయఉంచి గీతలో పన్నెండవ అధ్యాయపు పదహారవ శ్లోకానికి భావంతో సహా స్పష్టమైన అర్థాన్ని తెలియజేయండి' అన్నారు రాజుగారు.

పండితుడు మొదట శ్లోకాన్ని పఠించి దానికి శబ్దార్థాలను వివరించాడు.

**అనపేక్షః శుచిర్దక్షః ఉదాసీనో గతవ్యథః ।**

**సర్వారంభపరిత్యాగీ యో మద్భక్తః స మే ప్రియః ॥**

'ఎవడు కాంక్షలేకుండ, బాహ్య-అభ్యంతరములందు శుద్ధి కలిగి, చతురుడు, పక్షపాతరహితుడై దుఃఖములనుండి విముక్తుడవుతాడో, అట్టి సర్వారంభాలను విడిచిన నా భక్తుడు నాకు ప్రియుడు'.

తదనంతరం ఆయన శ్లోకం యొక్క భావార్థాలను ఈ విధంగా వివరించసాగాడు.

'ఎవనికి ఏ విధమైన కోరిక, స్పృహ, కామన ఉండవో, ఎవడాప్త కాముడో, ఎవనికి ఏ విషయంలోను లెక్క ఉండదో అట్టి వానిని 'అనపేక్షు'డంటారు.

ఎవని అంతఃకరణమత్యంతపవిత్రమో, ఎవని బాహ్యావ్యవహారము

కూడా ఉద్వేగరహితమూ, పవిత్రమూ, న్యాయయుక్తమూ అయి వుంటుందో, ఎవని దర్శన, భాషణ, స్పర్శ, వార్తాలాపములవలన జనులు పవిత్రులౌతారో ...అతడే 'శుచి'యైనవాడు.

ఏ మహాకార్యనిమిత్తం ఈ మానవశరీరం లభించిందో దానిని పొందటం అనగా భగవంతుని పొందుటలోనే మనుష్యునియథార్థమైన దక్షత వున్నది. అట్టి తనకార్యాన్ని ఎవడు సఫలీకృతం చేసుకుంటాడో అతడే 'దక్షుడు' అనబడుతాడు.

ఎవడు సాక్ష్యాలనిచ్చే సమయంలోను, న్యాయము లేక పంచాయితీలు తీర్చే సమయంలోను కుటుంబము, మిత్రులు, బంధువులు అనే దృష్టితో గాని, రాగద్వేషలోభ మోహభయాదులకు వశపడి పక్షపాతియైగాని వ్యవహరించక ... సదా సర్వథా పక్షపాతరహితునిగా ఉంటాడో అట్టి వానినే 'ఉదాసీను' డంటారు.

ఎట్టి మహాదు:ఖము, దు:ఖహేతువు ప్రాప్తించినప్పటికీ ఎవడు దు:ఖితుడు కాడో ... అనగా ఎవని అంత:కరణములో ఎప్పుడూ ఏ రకమైన విషాదమూ, దు:ఖమూ, శోకమూ ఉండవో ... అట్టివాడే 'గతవ్యథు'డౌతాడు.

ఎవడు సమస్త బాహ్యాభ్యంతర కర్మలను విడిచి కేవలం ప్రారబ్ధం పైనే ఆధారపడి ఉంటాడో ఎవడు తన స్వార్థ సిద్ధికోసం ఏ కొద్ది కర్మను కూడా చేయకుండా ఉంటాడో, ఎవడు తనంత తాను లభించిన దానితోనే సంతుష్టుడైవుంటాడో, ప్రారబ్ధవశాన జరిగే క్రియలలో ఎవనికి కర్తృత్వాభిమానం ఉండదో, అట్టి బాహ్యాభ్యంతరవిషయత్యాగినే 'సర్వారంభపరిత్యాగి' అంటారు. అని వివరించాడు పండితుడు.

పండితుడు పై భావార్థాలను వివరించిన తరువాత రాజు వినమ్రుడై 'బ్రాహ్మణోత్తమా! మీరు శ్లోకార్థాన్ని చాలా చక్కగా వివరించారు. మీ కథనం సర్వవిధాలా యుక్తియుక్తమూ శాస్త్రసమ్మతముగానే ఉంది. శ్లోకానికి చక్కని అర్థం చెప్పినప్పటికీ మీకింకా దీని రహస్యం బోధపడలేదని నా అనుమానం' అన్నాడు. 'రహస్యం తెలియని వాడినైతే భావసహితంగా అర్థాన్నెలా చెప్పగలిగాననుకుంటున్నారు? నాకు 52 గీతాభాష్యాలు కంఠస్థం

వచ్చు. ఇంతకు మించిన విశేష రహస్యమేదైనా ఉంటే ... అదీ తమరెరిగినట్లైతే తమరే సెలవీయండి!' అన్నాడు కోపంగా పండితుడు.

రాజుగారు దానికి సమాధానమీయకుండా ఎంతో వినమ్రతతో నిండిన వాక్కులతో 'శాస్త్రసమ్మతంగా మీరు చేసిన సుందరమైన వ్యాఖ్యానం నాకెంతో సంతోషాన్ని కలిగించింది. దానికి మీకెంతో కృతజ్ఞుణ్ణి. కాబట్టి నేనిచ్చే ఈ చిరుకానుకను దయతో స్వీకరించండి' అన్నారు.

'రాజా! తమరు నాకు గీతారహస్యమే తెలియలేదన్నారు కదా! ఇక సంతోషం సంగతెక్కడిదిలెండి! తమకు వాస్తవంగా సంతోషం కలుగనప్పుడు నేనేమీ మీనుండి పుచ్చుకోలేను' అన్నాడు పండితుడు. రాజుగారెంతో అనునయ వినయాలు చేసినప్పటికీ అతడు కానుకలు తీసుకోకుండగనే ఇంటికి వెళ్లిపోయాడు. రాజు విశ్వాసపాత్రుడైన ఒక గూఢచారిని పిలిచి 'ఈ బ్రాహ్మణుడు మహా త్యాగి, సదాచారి, స్వాభిమాని అయిన విద్వాంసుడు. నీవు అతనివెనుకనే వెళ్లి అతడింటిలో ఎలా వ్యవహరిస్తాడో, ఎలా మాట్లాడుతాడో తెలుసుకొని నాకు వెంటనే చెప్పు' అని పంపించాడు. రాజాజ్ఞ పొందిన ఆగూఢచారి ఆతన్ని వెంబడించి వెళ్ళి ఆతని ప్రవర్తన, మాట్లాడేవిధానాన్ని గమనిస్తూనే వున్నాడు.

ఇంటికి తిరిగివచ్చిన పండితుడు భార్య అడుగగానే రాజసభలో జరిగిన విషయం ఆద్యంతమూ వినిపించాడు. వినమ్రురాలైన భార్య ప్రేమగా 'స్వామీ! రాజుగారన్న మాటలు ఉచితంగానే తోస్తున్నాయి. మీరు కోపగించుకోకుండా వుండాల్సింది' అంది. పండితుడు - (క్రోధావేశాన్ని అణుచుకుంటూ) ఓహో! నీవూ రాజుగార్నే సమర్థిస్తున్నావా?

భార్య - నాథా! న్యాయసమ్మతమైన దాన్ని సమర్థించాలని మీరే అంటుంటారు కదా!

పండితుడు - (ఇంకా ఉత్తేజితుడై తమాయించు కుంటూ) కానీ నాకు దాని రహస్యమే తెలియలేదట రాజుగారన్న ఈ మాటలు న్యాయమైనవేనా?

భార్య - క్షమించండి. రాజుగారి మాటలు సమంజసమైనవే! ఏశ్లోకాన్నైనా వ్యాఖ్యానించటం సహజమైనదే! కానీ దాని యదార్థగూఢార్థాన్ని (రహస్యాన్ని) తెలుసుకోవటం చాలా కష్టమైన పనేమరి!

పండితుడు - ఎలా?

భార్య - గ్రామఫోనుమీద పెట్టిన రికార్డు దానిలో వున్న పాటనే పాడుతుంది కానీ, దాని భావమూ గూఢార్థమూ తెలిసికోగలుగుతుందా? ఇదీ అంతే?

పండితుడు - అంటే నేను గ్రామఫోన్‌లాంటి వాడిననా నీ వుద్దేశ్యం?

భార్య - ఇతరులకు అందమైన ఉపదేశాలూ, ఆదేశాలు ఇచ్చే వారిలో ఆ గుణాలు కొరవడితే వాళ్ళకూ గ్రామఫోను రికార్డుకూ భేదమేముంటుంది? రాజుగారు కోరిన మీదట మీరా శ్లోకాన్ని వ్యాఖ్యానించారు. కానీ ఆ శ్లోకంలో వున్న గుణాలన్నీ మీలో మూర్తీభవించి వున్నాయా?

పండితుడు-ఎందుకు లేవు? అందులో ఏ గుణం నాలో లేదో చెప్పు?

భార్య - మీరు శాంతంగా నా మాటలు ఆలకించండి. దయచేసి ఆ శ్లోకంలోని ప్రతిపదానికీ మీరు చెప్పిన అర్థం మళ్ళీ ఒకసారి నాకు వినిపించండి. 'అనపేక్షః' అనగా భావం ఏమిటి?

పండితుడు - ఎవనికి ఏ విధమైన కోరిక, స్పృహ, కామన వుండదో ఎవడు ఆప్తకాముడో, ఎవనికి ఏ విషయంలోనూ లెక్క వుండదో అట్టి వానిని 'అనపేక్షు'డంటారు.

భార్య - మరి మీరు అలాంటి వారేనా?

పండితుడు - ఏం? ఎందుకు కాదు? నాకేవిధమైన కోరిక, స్పృహ, కామనలు లేవు. నీవు పోరితేనే నేను రాజు దగ్గరకు వెళ్ళింది. ఆయనెంత అనునయవినయాలతో ప్రార్థించినా నేనేమీ స్వీకరించనే లేదు!

భార్య - ఔను. నిజమే! నేను కోరితేనే కదా నా మీద దయతో మీరక్కడికి వెళ్ళింది? సరే! 'శుచి' అంటే మీ అభిప్రాయం?

పండితుడు - ఎవనిఅంతఃకరణం అత్యంతపవిత్రమో, ఎవని బాహ్యవ్యవహారము కూడా ఉద్వేగరహితమూ, పవిత్రమూ, న్యాయ యుక్తమూ అయివుంటుందో, ఎవని దర్శన, భాషణ, స్పర్శ, వార్తాలాపముల వలన జనులు పవిత్రులౌతారో ... అతడే 'శుచి'యైనవాడు.

భార్య - బాహ్యాభ్యంతరాలలో మీరింత శుచిగా (పవిత్రంగా) వున్నారా? మీ దర్శన, భాషణ, స్పర్శ, వార్తాలాపాలవలన మానవులు పవిత్రులైపోతారా? మీ అంతఃకరణంలో ఎలాంటి వికారమూ కలుగదా? మీ బాహ్యప్రవర్తన ఉద్వేగరహితమూ, న్యాయయుక్తమూ, పవిత్రమూ అయినదేనా? ఒకవేళ అదే నిజమైతే మీ మనసులో ఈ క్రోధమూ, ఉద్వేగమూ ఎందుకు కలిగాయి? మరి రాజుగారితో అహంకారపూరితమైన వాక్యాలెందుకు పలికారు?

పండితుడు - (కొంచెం ఇబ్బందిగా) ఔను మరి! ఈ గుణమే నాలో కొరవడింది.

భార్య - ఔను. 'దక్ష' శబ్దానికేమని భావం చెప్పారు?

పండితుడు - ఏ మహాకార్యనిమిత్తం ఈ మనుష్యశరీరం లభించిందో దానిని పొందటం ... అనగా భగవంతుని పొందటంలోనే మనుష్యుని యథార్థమైన దక్షత వున్నది. అట్టి తనకార్యాన్ని ఎవడు సఫలీకృతం చేసుకుంటాడో అతడే 'దక్షుడు' అనబడతాడు.

భార్య - అయితే మీరే మహాకార్యనిమిత్తమై ఈ లోకంలోకి వచ్చారో దాన్ని పూర్తిచేశారా? మీరు పరమపదాన్నిపొందగలిగారా? లేకుంటే రాజుగారన్న మాటలు ఉచితమైనవే మరి!

పండితుడు - నీ కథనం సత్యమే! నాలో ఈ గుణం కూడా లేదు!

భార్య - 'ఉదాసీన' పదానికి మీ అభిప్రాయం ఏమిటి?

పండితుడు - ఎవడు సాక్ష్యాలిచ్చే సమయంలోను, న్యాయము లేక పంచాయితీలు తీర్చే సమయంలోనూ, కుటుంబము, మిత్రులు, బంధువులు అనే దృష్టితోగాని, రాగద్వేషలోభభయాదులకు వశపడి పక్షపాతియైగాని

వ్యవహరించక సదా సర్వథా పక్షపాత రహితునిగా ఉంటాడో అట్టి వానినే 'ఉదాసీను'డంటారు.

భార్య - మరి మీరు పక్షపాతరహితులా? రాజుగారిసమక్షంలో మిమ్మల్ని మీరు సమర్థించుకోలేదా? రాజుగారు మీకు శ్లోకంలోని గూఢార్థం తెలియలేదు అన్నపుడు ఆ మాటని లెక్కపెట్టారా? లేకుంటే రాజుగారి కథనం ఉచితమైనదే కదా? చెప్పండి?

పండితుడు - (సరళమూ అతి పవిత్రమూ అయిన హృదయంతో తనలోపాలను వినమ్రభావంతో స్వీకరిస్తూ) నీవు చెప్పింది అక్షరాలా సత్యమే! ఈరోజు నీవు నాకళ్లు తెరిపించావు. పక్షపాతరహితుడవటం అనే గుణం నాలో లోపించింది. ఎప్పుడైనా వాగ్వివాదసమయంలో నాపక్షం దుర్బలమైనదని ఎరిగి కూడా దురాగ్రహంతో నా పక్షాన్నెప్పుడూ వదలేవాణ్ణికాదు! నన్నే సమర్థించుకునే నైజం నాది.

భార్య - మంచిది. 'గతవ్యథ'కు మీరు చెప్పే అర్థమేమిటి?

పండితుడు - ఎట్టి మహాదుఃఖమూ, దుఃఖహేతువూ ప్రాప్తించినప్పటికీ ఎవడు దుఃఖితుడు కాడో - అనగా ఎవని అంతఃకరణములో ఎప్పుడూ ఏరకమైన విషాదమూ, దుఃఖమూ, శోకమూ ఉండవో - అట్టివాడే 'గతవ్యథు'డౌతాడు.

భార్య - మీ చిత్తంలో ఎప్పుడూ వ్యథ అనేదే కలుగదా? ఒకవేళ కలుగకుంటే ... రాజుగారన్న మాటలకు, నేను సమర్థించిన దానికి మీలో ఇంత ఉద్వేగమూ, వ్యథ ఎందుకు కలగాలి?

పండితుడు - నీవు చెప్పేది అక్షరసత్యమే! ఈ భావన నాలో అసలు లేనేలేదు.! నా మనసుకు వ్యతిరేకంగా ఏదైనా జరిగినపుడు ప్రతి మాటకు కేవలం వ్యథయేకాదు, భయమూ, ఉద్వేగమూ, ఈర్ష్యా, శోకమూ మొదలైన వికారాలు నాలో కలగటం గమనించాను.

భార్య - సరే! 'సర్వారంభపరిత్యాగి' అంటే మీరేమి అర్థం చేసుకున్నారు?

పండితుడు - ఎవడు సమస్త బాహ్యాభ్యంతర కర్మలను విడిచి కేవలం ప్రారబ్ధంపైనే ఆధారపడి ఉంటాడో, ఎవడు తన స్వార్థసిద్ధికోసం ఏకొద్ది కర్మను కూడా చేయకుండా వుంటాడో, ఎవడు తనంత తాను లభించిన దానితోనే సంతుష్టుడై వుంటాడో, ప్రారబ్ధవశాన జరిగే క్రియలలో ఎవనికి కర్తృత్వాభిమానం ఉండదో, అట్టి బాహ్యాభ్యంతర త్యాగినే 'సర్వారంభపరిత్యాగి' అంటారు.

భార్య - ఇది బహు సుందరమైన వ్యాఖ్యానం! కానీ మీరొక్క విషయం సెలవీయండి. మీరు బాహ్యాభ్యంతరకర్మలను త్యాగం చేశారా? ఎప్పుడైనా మీ అంత:కరణంలో సాంసారికపరమైన సంకల్పం కలుగనే కలుగదా? ఒకవేళ అలా లేకుంటే మరి మీకింత అహంకారం ఎందుకు కలగాలి? బాహ్య కర్మలన్నీ మీరు చేస్తూనే ఉన్నారుకదా? సెలవీయండి స్వామీ!

పండితుడు - సత్యమే! ఇది నాలో లేని విషయమే! ఇప్పుడు నాలోని దోషాలన్నింటినీ తెలుసుకున్నాను. ఇప్పటివరకు కేవలం అర్థమే చెబుతూవచ్చాను. గూఢార్థమసలు తెలుసుకోనేలేదు. నేను సంపూర్ణంగా అనభిజ్ఞుణ్ణి! కొద్దిగా ఇప్పుడిప్పుడే అర్థమౌతోంది! ఇప్పుడు నీవు అనుమతిస్తే బాహ్యాభ్యంతరాలకర్మలనన్నిటినీ వదలి నిజమైన సన్యాసినౌదామనుకుంటు న్నాను' అని పలికి పండితుడు అన్నింటినీ త్యాగం చేసి ఇంటినుండి బయలుదేరాడు.

భార్య - 'స్వామీ! నేనూ మీతో వుంటూ మీ మార్గాన్నే నడుస్తాను' అని భార్య ప్రాధేయపడింది.

పండితుడు - నేనిక ఏ జంజాటాన్నీ వుంచుకోదలచలేదు. మరి స్త్రీనెలా దగ్గరుంచుకుంటాను?

భార్య - నన్ను జంజాటమనుకోకండి స్వామీ! మీ సాధనలో నేనేమీ మీకడ్డుపడను. ఈరోజు మిమ్మల్ని రాజుగారిదగ్గరకు పంపింది ధనంకోసం అనుకుంటున్నారా? ఎన్నటికీ కాదు! మీరు మీ జీవితలక్ష్యాన్ని పొందటానికై ధనాన్ని ఒక నిమిత్తమాత్రంగా వాడుకున్నాను. రాజు తత్త్వజ్ఞుడు, జీవన్ముక్తుడైన మహాపురుషుడు. మీరు ధర్మజ్ఞులు, సదాచార సంపన్నులు,

త్యాగి, సంతృప్తులూ మరియు విద్వాంసులూను. తత్త్వజ్ఞుడైన రాజుయొక్క సాంగత్య ప్రభావంవలన మీకు పరమాత్మప్రాప్తికూడా కలుగుతుంది. ఈ ఉద్దేశ్యంతోనే మిమ్మల్ని అక్కడకు పంపాను. నా కోరిక తీరింది. ఇప్పుడు మీరు అనుజ్ఞ ఇస్తే మీతో నేనూ వద్దామని కోరిక.

పండితుడు - (కృతజ్ఞతాపూర్వకంగా) ఇప్పుడీ విషయం అర్థమైంది నాకు. నిజంగా నీనుండి నాకెట్టి హానీ కలుగదు. నిజంగా నీవే నాకు అసలైన మహోపకారం చేసిన మంచి మనసున్న దానివి. తమ ప్రియమైన వారికి భగవత్ప్రాప్తిని కలిగించటంలో దోహదపడేవారే నిజమైన మంచి మనసుకలవారు (సహృదయులు). పద! అక్కడ కూడా నీవు నాకు పరమాత్మ ప్రాప్తికలగడంలో సాయపడుదువు గాని!' అన్నాడు.

అటు తరువాత వారిద్దరూ సర్వమూ త్యాగంచేసి ఇంటినుండి వెళ్ళిపోయారు. ఇక్కడ గూఢాచారి రాజుగారిదగ్గరకు వెళ్లి పండితుని ఇంట జరిగినదంతా పూసగుచ్చినట్లు తెలిపాడు. రాజు తన రాజ్యాన్ని, ధనాగారాన్ని, తనపుత్రునికి ముందే అప్పచెప్పాడు. గూఢాచారి మాటలను విని తానుకూడా రాజ్యాన్ని విడిచి వెళ్లిపోయాడు. మార్గమధ్యంలో రాజుగారికి బ్రాహ్మణదంపతులెదురయ్యారు. రాజు ఉల్లాసంగా 'బ్రాహ్మణోత్తమా! మీరు ఇప్పుడా గీతాశ్లోకానికున్న గూఢార్థాన్ని తెలుసుకున్నారు!' అన్నాడు.

'ఇంకా తెలుసుకోలేదు మహారాజా! తెలుసుకోవటానికే బయలుదేరా'నన్నాడు పండితుడు.

రాజు కూడా ఆయనవెంట నడిచాడు. ఆముగ్గురూ ఏకాంతంగా వున్న పవిత్రమైన ప్రదేశంలో నివసించసాగారు. రాజు, బ్రాహ్మణునిభార్య - వీరిద్దరూ తత్త్వజ్ఞానులూ, జీవన్ముక్తులూ ఐనవారే! వీరి సాంగత్యంలో పండితుడు కూడా పరమాత్మప్రాప్తిని పొందగలిగాడు.

(ఈ కథ గీతలోని 12వ అధ్యాయంలో వున్న 16వ శ్లోకానికి నివృత్తిపరమైన అర్థంలో చెప్పబడింది. ప్రవృత్తిపరమైన అర్థం దీనికి భిన్నంగా వుంటుంది)



# 4. భగవన్నామము అమూల్యము

గోస్వామి తులసీదాసు తన రామచరితమానస గ్రంథంలో భగవన్నామ మహిమను గురించి ప్రస్తావిస్తూ కలియుగానికి ఆధారం కేవలం భగవన్నామమనే వచించారు. గణిక, అజామిళులవంటి మహా పాపాత్ములుకూడా కేవలం నామప్రభావంతో సహజంగానే ముక్తిని పొందారు. హనుమంతులవారైతే ఈ భగవన్నామ ప్రభావంతోనే శ్రీరాముణ్ణి తన వశం చేసుకున్నారు. నామాన్ని కేవలం నాలికపై నుంచుకోవటంవలన మానవుని లోపలా బయటా కూడా ప్రకాశమయమైపోతుంది. నామ మహిమ ఎంత గొప్పదో స్వయంగా భగవంతుడు కూడా దానిని వర్ణించటంలో అసమర్థుడే! **"రామ్ న సకహి నామ్ గున్ గాయీ"** దీని మహిమ ఎంత గొప్పదంటే కాశీలో వున్న శివుడు సమస్త జీవులకూ ఈ నామమహిమతోనే ముక్తిని ప్రసాదిస్తూ వుంటాడు. ఇలానే శ్రీమద్భాగ వతమూ, మహాభారతమూ ఇత్యాది అన్య శాస్త్రాలు కూడా ఈ నామ మహిమను వర్ణిస్తూనే వున్నాయి. ఐనా దీని పరిణామాన్ని ప్రత్యక్షంగా చూచిన దాఖలాలు లేవెందుకనో!

ఈ రకమైన తర్కంతో ఎందరో మహానుభావులు ప్రశ్నిస్తూనే వున్నారు. పరిణామం ప్రత్యక్షంగా కనపడకపోవటానికి కారణం కేవలం భగవన్నామంపై శ్రద్ధాభక్తులు లేకపోవటమే! వాస్తవానికి భగవన్నామమహిమను గురించి శాస్త్రాలు చెప్పిన దాని కంటే దానిమహిమ ఎన్నో రెట్లు ఎక్కువ! నామ మహిమకు ఎలాంటి హద్దులూ లేవు. శాస్త్రాలు వర్ణించిన నామమహిమ కేవలం దానివలన లాభాన్ని పొందిన మహాత్ములయొక్క మనోభావాలు మాత్రమే! ఈశ్వరుడు, సత్సంగాలమహిమనుగురించి ఎంత చెప్పినా తక్కువే అవుతుంది! నిజానికి భగవన్నామతత్త్వమూ, రహస్యము, గుణము, ప్రభావము మొదలైనవి తెలియక పోవటానికి కారణం దానిమీద శ్రద్ధలేకపోవటమే! అంటే శ్రద్ధాలోపమే నన్నమాట!

శ్రద్ధాలోపంవలన, అక్కడక్కాడా శ్రద్ధకంటే గూడా విపరీతమైన అశ్రద్ధ కారణంగాను, మానవుడు యథార్థమైన లాభాన్నుంచి వంచితుడవుతున్నాడు. (పొందలేకపోతున్నాడు). నామానికైతే అమితమైన మహిమ వుంది. లోకంలోని ఏ వస్తువూ భగవన్నామానికి సాటిరాదు. ఇక్కడున్న జడ-నశ్వర పదార్థాలతో భగవన్నామాన్ని పోలుస్తూ కూర్చోవటం అంటే మన అజ్ఞానాన్ని వెల్లడి చేసుకోవటమే ఔతుంది.

### భగవన్నామ మహిమను చాటి చెప్పే ఒక దృష్టాంతమిది

ఒక ఉన్నత శ్రేణికి చెందిన భగవద్భక్తుడు, నామముపై గొప్ప నిష్ఠగల మహాత్ముడూ ఒకడుండేవాడు. ఆయన దగ్గరొక శిష్యుడుండేవాడు. ఇది ఒకనాటిమాట. ఆ మహాత్ముడు పనిమీద బయటి గ్రామానికి వెళ్ళాడు. అదే సమాయాన ఒక వ్యక్తి ఆయన కుటీరానికి వచ్చాడు. 'స్వామిజీ ఎక్కడున్నారు?' అని అడిగాడు. శిష్యుడు 'స్వామిజీ కార్యార్థం బయటి గ్రామానికి వెళ్ళారు. ఏదైనా వారితో పని ఉన్నట్లైతే చెప్పండి!' అన్నాడు. 'నా కొడుకు చాలా అనారోగ్యంతో వున్నాడు. వాడెలా బాగుపడతాడు? స్వామీజీ లేని సమయంలో మీరే ఏదైనా ఉపాయం చెప్పి పుణ్యం కట్టుకోండి బాబూ!' అన్నాడు ఆ ఆగంతకుడు.

'ఒక చక్కని సరళమైన ఉపాయం ఉంది. రామనామాన్ని మూడు సార్లు వ్రాసి, దాన్నికడిగి త్రాగించండి. అంతే! దీంతో రోగం తగ్గిపోతుంది' అన్నాడు శిష్యుడు.

ఆ ఆగంతకుడు తనఇంటికి వెళ్ళిపోయాడు. మరునాడు అతడు ప్రసన్న వదనంతో స్వామీజీ కుటీరానికి వచ్చాడు. అప్పుడు స్వామీజీ అక్కడే వున్నారు. ఆయన పాదాలకు సాష్టాంగపడి, వినమ్రుడై, చేతులు జోడించి 'స్వామీజీ! తమశిష్యుడు నిజంగా సిద్ధపురుషుడే సుమా! నిన్నటి రోజు నేనిక్కడికి వచ్చినపుడు తమరు కుటీరంలో లేరు స్వామీ! నా కుమారుని అనారోగ్యాన్ని గురించి ఈయనకు చెప్పి, ఏదైనా ఉపాయం చెప్పుమని ప్రార్థించాను. ఈయన ముమ్మారు రామనామాన్ని వ్రాసి, దాన్నికడిగి ఆ

శ్రద్ధాలోపంవలన, అక్కడక్కాడా శ్రద్ధకంటే గూడా విపరీతమైన అశ్రద్ధ కారణంగాను, మానవుడు యథార్థమైన లాభాన్నుంచి వంచితుడవుతున్నాడు. (పొందలేకపోతున్నాడు). నామానికైతే అమితమైన మహిమ వుంది. లోకంలోని ఏ వస్తువూ భగవన్నామానికి సాటిరాదు. ఇక్కడున్న జడ-నశ్వర పదార్థాలతో భగవన్నామాన్ని పోలుస్తూ కూర్చోవటం అంటే మన అజ్ఞానాన్ని వెల్లడి చేసుకోవటమే ఔతుంది.

## భగవన్నామ మహిమను చాటి చెప్పే ఒక దృష్టాంతమిది

ఒక ఉన్నత శ్రేణికి చెందిన భగవద్భక్తుడు, నామముపై గొప్ప నిష్ఠగల మహాత్ముడూ ఒకడుండేవాడు. ఆయన దగ్గరొక శిష్యుడుండేవాడు. ఇది ఒకనాటిమాట. ఆ మహాత్ముడు పనిమీద బయటి గ్రామానికి వెళ్ళాడు. అదే సమాయాన ఒక వ్యక్తి ఆయన కుటీరానికి వచ్చాడు. 'స్వామిజీ ఎక్కడున్నారు?' అని అడిగాడు. శిష్యుడు 'స్వామిజీ కార్యార్థం బయటి గ్రామానికి వెళ్ళారు. ఏదైనా వారితో పని ఉన్నట్లైతే చెప్పండి!' అన్నాడు. 'నా కొడుకు చాలా అనారోగ్యంతో వున్నాడు. వాడెలా బాగుపడతాడు? స్వామీజీ లేని సమయంలో మీరే ఏదైనా ఉపాయం చెప్పి పుణ్యం కట్టుకోండి బాబూ!' అన్నాడు ఆ ఆగంతకుడు.

'ఒక చక్కని సరళమైన ఉపాయం ఉంది. రామనామాన్ని మూడు సార్లు వ్రాసి, దాన్నికడిగి త్రాగించండి. అంతే! దీంతో రోగం తగ్గిపోతుంది' అన్నాడు శిష్యుడు.

ఆ ఆగంతకుడు తనఇంటికి వెళ్ళిపోయాడు. మరునాడు అతడు ప్రసన్న వదనంతో స్వామీజీ కుటీరానికి వచ్చాడు. అప్పుడు స్వామీజీ అక్కడే వున్నారు. ఆయన పాదాలకు సాష్టాంగపడి, వినమ్రుడై, చేతులు జోడించి 'స్వామీజీ! తమశిష్యుడు నిజంగా సిద్ధపురుషుడే సుమా! నిన్నటి రోజు నేనిక్కడికి వచ్చినపుడు తమరు కుటీరంలో లేరు స్వామీ! నా కుమారుని అనారోగ్యాన్ని గురించి ఈయనకు చెప్పి, ఏదైనా ఉపాయం చెప్పుమని ప్రార్థించాను. ఈయన ముమ్మారు రామనామాన్ని వ్రాసి, దాన్నికడిగి ఆ

నీటిని త్రాగింపుమన్నారు. సరిగ్గా అలాగే చేశాను. ఏమి ఆశ్చర్యం? ఈ ప్రయోగంతో నా కుమారుడు ఏ రోగమూలేనట్లు లేచి కూర్చున్నాడు స్వామీ!' అన్నాడు.

ఇది వినిన స్వామిజీ తనశిష్యునిపై అగ్గిగుగ్గిలంఅయ్యాడు. అతని హితం కోసం కోపంతో ఊగిపోతూ 'ఓరీ మూర్ఖుడా! ఈ చిన్నపాటి రోగం కోసం రామనామాన్ని ముమ్మారు ప్రయోగింపచేశావా? నీకు నామమహిమ ఏ కొంచెమూ తెలియదన్నమాట. అరే! ఒక్కసారి నామాన్ని ఉచ్చరిస్తేనే అనంతకోటిపాపాలు మరియు భవరోగతాపము నశించి మానవుడు అనాయాసంగా పరమపదాన్ని చేరుకుంటాడే. అట్టి విషయం తెలియని నీవు ఈ ఆశ్రమంలో ఉండటానికి యోగ్యుడవు కావు! కాబట్టి నీ ఇష్టం వచ్చిన చోటుకి పో...పో!' అన్నారు. ఇది విన్న శిష్యుడు కళ్ళనీళ్ళ పర్యంతం అయ్యాడు. గురుదేవుని క్షమింపుమని కాళ్ళమీద పడ్డాడు. మహాత్ముల హృదయాలు నవనీతాలే కదా! గురువుగారు కరిగిపోయారు. శిష్యుని అపరాధాన్ని క్షమించేశారు.

ఈ సంఘటన తరువాత స్వామిజీ తళతళా మెరుస్తున్న ఒక అందమైన రాతినెక్కడినుంచో బయటకు తీసి శిష్యునికిచ్చి 'నగరానికి పోయి దీని ధర తెలుసుకుని రా! జాగ్రత్త సుమా! దీన్ని ఎట్టి పరిస్థితిలోను అమ్మరాదు. వెల కట్టించాలంతే! ఎవరెంతధర కడతారో తెలిసికొని వ్రాసుకుని రా!' అన్నారు.

శిష్యుడా రాతిని తీసుకుని బజారుకు వెళ్ళాడు. మొట్టమొదట ఒక కూరగాయలమ్మే మనిషి కనపడింది. ఈ రాతిని ఆమెకు చూపించి 'దీని కెంతధర కడతావు' అని అడిగాడు. ఆమె ఆ మెరుస్తున్న రాతిని చూసి ఇది పిల్లలాడుకుంటానికి బాగుంటుందని అనుకుని 'దీనికి ఒకకిలో లేక కిలోన్నర ముల్లంగి దుంపలు కానీ, బంగాళ దుంపలు కానీ, లేకుంటే నీ కిష్టమైన ఏ కూరనైనా ఇవ్వగలనని' చెప్పింది. 'ఇది అమ్మకానికి కాదు' అని ముందుకు సాగాడు శిష్యుడు. కొంచెం ముందుకు వెళ్ళగా ఒక కోమటి కలిశాడు.

అతనికి ఆ రాయిని చూపించి 'సేఠ్‌జీ! దీనికెంత మూల్యం చెల్లించగలవు?' అని అడిగాడు. వ్యాపారి రాయిని చూశాడు. అది మెరుస్తూ చాలా అందంగా వుంది. చాలా బరువుగా కూడా వుంది. కాబట్టి దీనితో వెండి బంగారాలను తూచటానికి బాగా పనికివస్తుందనుకున్నాడు. 'నూరు రూపాయలిస్తాను' అన్నాడు వ్యాపారి. వద్దని, శిష్యుడింకా ముందుకి నడిచి ఒక కంసాలి దుకాణంలోకి ప్రవేశించాడు. కంసాలి దాన్ని చూసి అది తనకు బాగా పనికివచ్చే వస్తువని గ్రహించాడు. దీన్ని కోసి అనేక పుష్యరాగాలను తయారు చేయవచ్చునని అనుకున్నాడు. అందుచేత 'దీనికి (అధికంగా) వెయ్యిరూపాయల వరకు ఇవ్వగలనన్నాడు'.

'అమ్మకానికి కాదులే!' అని శిష్యుడింకా ఉత్సాహంగా ముందుకు పోయాడు. ఒక వజ్రాలవర్తకునిదుకాణందగ్గరికి వచ్చాడు. మొదట గురువుగారిదగ్గరనుండి బయలుదేరినపుడు ఏ నగలవర్తకుని దగ్గరకూ వెళ్ళే సాహసం చేయలేదు. కానీ ఇప్పుడు ఆ రాతివెల క్షణక్షణానికీ పెరిగిపోతూ వుండటంతో శిష్యునిసాహసంకూడా పెరిగిపోసాగింది. ఇప్పుడతని దృష్టి కూడా మారిపోయింది. ఇంతకు ముందు ఈ రాయి కేవలం ఒక మెరిసే మామూలు రాయిగానే అనుకున్నాడు. కానీ ఆ భావం ఇప్పుడు లేదు. వజ్రాలవ్యాపారికి చూపించి దానికిఖరీదు కట్టమన్నాడు. వజ్రాలవ్యాపారి దాన్ని పరిశీలించి అది వజ్రమని తెలుసుకొని దానికి వెలగా ఒక లక్షరూపాయలనిస్తానన్నాడు. కానీ దానిని అమ్మకూడదు కదా! కాబట్టి 'అమ్మను' అని సమాధానం చెప్పి ఒక పెద్ద వజ్రాల వ్యాపారి దగ్గరకు వెళ్ళాడు. వ్యాపారులంతా దాన్ని బాగా పరీక్షించిన మీదట ఆ రాయి ఖరీదు ఐదుకోట్లరూపాయలని నిశ్చయించారు. దాని తరువాత ఆ శిష్యుడు రాజుగారి దగ్గరకు వెళ్ళాడు. రాజుగారు శిష్యుని గౌరవించి కూర్చుండబెట్టి ముఖ్యులైన వజ్రాలవ్యాపారులందరినీ పిలిపించి ఆ రత్నానికి వెలకట్టుడన్నారు. వ్యాపారులందరూ చర్చించిన తర్వాత తమ ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ 'రాజా! ఇటువంటి రత్నాన్ని ఇంతవరకూ మేము చూడనేలేదు. కాబట్టి దీనికి ధరకట్టడం మా వల్ల అయ్యే పనికాదన్నారు. అయినా తమరు

తమ రాజ్యాన్నంతటినీ ధారపోసినా ఈ వజ్రంవిలువముందు అది తక్కువే నని మా అభిప్రాయం' అన్నారు.

'ఇంతటి (అత్యంత) విలువైన రత్నం నీకెలా లభ్యమైంది?' అని రాజుగారు శిష్యుణ్ణి అడిగారు. 'దీన్ని మా గురువర్యులు కేవలం వెలకట్టించడానికే నాకిచ్చి పంపారు కానీ అమ్మటానికి అనుజ్ఞ ఇవ్వలేదు' అని శిష్యుడు సమాధానమిచ్చాడు. రాజుగారు అత్యంతవినమ్రుడై 'దీని వెల నా రాజ్యానికంటే అధికమైంది. మీ గురువర్యులు దీనిని అమ్మదామను కొంటే దీనికి బదులుగా నా రాజ్యాన్ని సర్వస్వమూ సంతోషంగా ఇవ్వగలను. నీవు పూజ్యులైన స్వామీజీని ఈ విషయమై విచారించు' అన్నారు. స్వామీజీ ఉచ్చకోటకి చెందిన మహాత్ములని అందరూ ఎరుగుదురు. కాబట్టి అందరూ వారి శిష్యుణ్ణి ఆదరసత్కారాలతో అక్కడినుండి సాగనంపారు.

శిష్యుడు గురువుగారిని చేరి జరిగిన కథనంతనూ వారికి విన్నవించాడు. చివరకి ఉండబట్టలేక 'గురుదేవా! ఈ రత్నపుమూల్యం కోసం రాజుగారు తమరాజ్యసర్వస్వాన్నీ సమర్పించటానికి సిద్ధపడుతు న్నప్పుడు దీనిని అమ్మటమే సమంజసమని నా అల్పబుద్ధికి తోస్తోంది' అన్నాడు. 'దీని మూల్యానికి ఈ రాజ్యమొక లెఖ్ఖా! ఇంతవరకూ దీని కనురూపమైన మూల్యమే కట్టబడలేదు!' అన్నారు గురుదేవులు. 'రాజ్యాన్ని మించిన మూల్యం ఇంకేముంటుంది స్వామీ!' అన్నాడు ఆశ్చర్యచకితుడైన శిష్యుడు. 'చూడు! ఇక్కడేదైనా ఇనుపవస్తువు దొరుకుతుందేమో!' అన్నారు గురువులు. 'స్వామీ! ఆశ్రమానికి కొందరు యాత్రికులు వచ్చిచేరారు. వారి దగ్గర పెనము, పట్టుకారు, గరిటెలు లోహపు గిన్నెలు, మొదలైన వస్తువులు చాలానే ఉన్నాయి. తమఆజ్ఞ అయితే వాటిలో కొన్ని తీసుకొనివస్తాను' అన్నాడు శిష్యుడు. 'సరే! తీసికొని రా!' అన్నారు గురుదేవులు.

లోహపు వస్తువులు చాలానే తెచ్చాడు శిష్యుడు. ఆ వస్తువులకు ఆ రాయిని తాకించిన వెంటనే అవన్నీ శుద్ధమైన బంగారు వస్తువులుగా మారిపోయాయి. ఇది చూచిన శిష్యునికి చాలా ఆశ్చర్యం కలిగింది. 'ఇదేదో చాలా విలక్షణమైన వస్తువు! ఇదేమిటి గురుదేవా?' అని ఆశ్చర్యచకితుడౌతూ

ప్రశ్నించాడు శిష్యుడు. 'ఇది (స్పర్శమణి) పరుసవేది మణి. దీనిని తాకించినంతమాత్రాన లోహము బంగారంగా మారిపోతుంది. ఇప్పుడు నీవే చెప్పుము దీని మూల్యమెంత వుంటుందో?' అన్నారు గురుదేవులు. 'ప్రపంచంలో అధికాధికమైన ధర బంగారానిదే! అలాంటి బంగారం ఈ పరుసవేదితో తయారౌతోంది! మరి దీని మూల్యమెలా కట్టగలం?' అన్నాడు ఆశ్చర్యపోతూ శిష్యుడు.

'భగవన్నామం యొక్క మూల్యం (విలువ) దీనికంటే మించినది. అధికమైనది. పరుసవేది కేవలం జడపదార్థమేకదా! దాని వలన కేవలం జడపదార్థమే లభిస్తుంది కానీ సచ్చిదానందపరమాత్మమాత్రం కాదు. కావున లౌకికమైన పదార్థాలతో భగవన్నామమహిమను పోల్చటం ఎల్లప్పుడు అనుచితమే! ఆ విధంగా పోల్చేవారు పరుసవేదికి కిలో, కిలోన్నర ముల్లంగికీ ఆలుగడ్డలకీ కూరలుగా అమ్మే మూర్ఖులకంటే తక్కువ మూర్ఖులేమీ కారు మరి! పరుసవేది దగ్గరవున్నా దాని మహిమ తెలియనివాడు తుచ్ఛపదార్థాలనే కోరుకుని సదా సర్వథా దరిద్రుడే అయినట్లు రామనామ మహిమ ఎరుగనివాడుకూడా ప్రేమ, భక్తులను పొందలేని దరిద్రుడౌతాడు. నీవు భగవన్నామమహిమనూ, తత్త్వరహస్యాన్ని తెలియక ఒక సాధారణ రోగంకోసం రామనామాన్ని మూడుసార్లు ప్రయోగింపచేశావు. ఏనామ ప్రభావంవలన భవరోగమే నశించిపోతుందో అలాంటిదాన్ని మామూలు రోగం కోసం ఉపయోగించటం తెలివితక్కువతనమే! నీ తెలివి తక్కువ తనాన్ని దూరం చేయటానికే పరుసవేదినిచ్చి పంపాను. అర్థమయిందా?' అన్న గురుదేవులమాటలు విని భగవన్నామ మహిమను తెలుసుకుని, శిష్యుడు తన మూర్ఖత్వానికి క్షమింపుడని మరీ మరీ వేడుకోసాగాడు.

ఈ కథ వలన మనకు జ్ఞాతమయ్యేదేమంటే పరుసవేది ప్రభావం తెలియని వ్యక్తికది లభిస్తే అజ్ఞానంచేత వాడు దానిని రెండు మూడు రూపాయలకే అమ్ముకోగలడు. ఆ మహాత్ముడు ఆ పరుసవేదిని తగిన ధరకు అమ్ముకురమ్మని చెప్పివుంటే, శిష్యుడు మహా అయితే ఐదారుకిలోల కూరగాయలకో, ఒకటి రెండు రూపాయలకో తప్పకుండా

అమ్ముకొనివచ్చేవాడు. దాన్నే వాడు అధికధరకమ్మినానని సంతోషించేవాడు. అలాగే భగవన్నామ ప్రభావాన్ని ఎరుగని వాడు, దానిని స్త్రీ పుత్ర, ధనాదులకు బదులుగా అమ్మి పారేస్తాడు.

అనగా ఏ విషయాన్నైనా పూర్తిగా తెలుసుకొని దానిని ఉపయోగించే రీతిలో ప్రయోగించితే లాభకారి యౌతుందనే నీతిని గ్రహించాలి.

## 1. భగవన్నామ రహస్యం

భగవన్నామ ప్రభావంచేత పాపాలు పటాపంచలౌతాయనటంలో ఎట్టి సందేహం లేదు. కానీ లోకులు దీనియొక్క రహస్యాన్ని తెలిసికోని కారణంగా దీనిని దురుపయోగం చేస్తుంటారు. పాపాలను నాశనం చేసే అమోఘమైన శక్తి నామమహిమకున్నదని తెలిసి పాపం చేసిన తరువాత నామాన్ని జపించి దాన్ని కడుగుకుందామని అనుకుంటారు. ఇలాంటి ఆలోచనతోనే అధికంగా పాపపంకిలంలో చిక్కుకుపోతూ వుంటారు. వీరి ఈ ఆలోచన సరియైనదే అయితే నామ జపము పాప వినాశిని కాక పాపాల్ని వృద్ధిచేసేదే ఔతుంది. అలా అయితే లోకంలో అందరూ నామ జపాన్ని ఆశ్రయంగా పొంది ఎవరిష్టమొచ్చినట్లు వారు పాపాలు చేస్తూనేవుంటారు. దాంతో వర్తమానంలో కంటే భవిష్యత్తులో పాపాలసంఖ్య మితిమీరిపోతుంది. పోలీసుబట్టలు వేసుకుని దొంగతనం చేసే పోలీసువాడు ఇతర దొంగలకంటే అధికంగా శిక్షించబడటానికి పాత్రుడౌతాడు. వాని పాపాలు అధికమౌతుంటాయి. ఆ పాపం అనుభవించనిదే నాశనం కాదు. నామాన్ని అడ్డుపెట్టుకుని పాపం చేయటం అనేది నామం యొక్క పది అపరాధాలలో ఒకటి అదే నామాపరాధం.

**నామం యొక్క పది అపరాధాలు ఇవి:**

**సన్నిందాసతి నామవైభవకథా శ్రీశేశయోర్భేదధీః**
**అశ్రద్ధా శ్రుతిశాస్త్రదైశికగిరాం నామ్న్యర్థవాదభ్రమః ।**
**నామాస్తీతి నిషిద్ధవృత్తివిహితత్యాగౌ హి ధర్మాంతరైః**
**సామ్యం నామజపే శివస్య చ హరేర్నామాపరాధా దశ ॥**

1. సత్పురుష - ఈశ్వరుని భజన ధ్యానము చేసేవారిని నిందించుట

2. అశ్రద్ధాపరులకు నామము యొక్క మహిమను తెలియచేయటం

3. శివకేశవుల నామ రూపములలో భేదబుద్ధి కలిగియుండుట

4,5,6 వేదములు, శాస్త్రములు, గురువులద్వారా చెప్పబడిన నామ మాహాత్మ్యం మీద శ్రద్ధ లేకపోవటం (అవిశ్వాసం)

7. హరి నామమునందు అర్థవాదము యొక్క భ్రమ అనగా నామ మహిమ కేవలం స్తుతి మాత్రమే అనే భావము.

8,9. నామ బలం మీద విహిత కర్మత్యాగము, నిషిద్ధమైన దానిని ఆచరించుట.

10. ఇతరధర్మాలతో నామాన్ని పోల్చటం, అనగా శాస్త్రవిహిత కర్మలతో నామాన్ని పోల్చటం, ఇవన్నీ శివకేశవుల నామజపంలోని నామం యొక్క పది అపరాధాలు. ఈ పది అపరాధాలనుండి తమను తాము రక్షించుకోకుండా నామజపాన్ని చేసేవారు, నామజపం యొక్క రహస్యాన్ని తెలియనివారే!

వాక్కు ద్వారా నామ జపం చేయటం కంటే మానసిక జపం చేయటం వలన నూరురెట్లు అధికలాభం కలుగుతుంది. ఆ మానసిక జపంకూడా అత్యంత శ్రద్ధా ప్రేమలతో చేసినట్లైతే అది అనంత ఫలప్రదమౌతుంది. అదే గుప్తముగాను, నిష్కామభావంతోను చేసినట్లైతే శీఘ్రంగా పరమేశ్వరప్రాప్తిని కలిగించేదవుతుంది. కాబట్టి ఈ రహస్యాన్ని చక్కగా తెలుసుకొని భగవన్నామాన్ని ఆశ్రయించాలి.

## 2. భగవన్నామ తత్త్వం

నిజానికి నామానికి, నామధారునికీ భేదమేమాత్రం లేదు. అవి భిన్నమైవుండీకూడా సర్వథా అభిన్నాలే! గీతలో భగవంతుడు 'యజ్ఞానాం జపయజ్ఞోస్మి (10/25) 'అన్ని యజ్ఞములలో జపయజ్ఞమును నేనే!' అనగా ఇతరములైన సమస్త యజ్ఞాలూ నన్ను పొందే సాధనాలు మాత్రమే. కానీ జపయజ్ఞం (నామ-జపం) మాత్రం స్వయంగా నేనే! ఈ తత్త్వాన్ని

హృదయగతం చేసుకున్నవాడు, సరిగా తెలుసుకున్నవాడు, నామాన్ని ఎప్పటికీ మరిచిపోలేడు.

### 3. భగవన్నామము యొక్క గుణములు

నిత్యమూ, నిరంతరమూ భగవన్నామజపం చేసేవాడు సద్గుణ సముద్రుడై పోతాడు. సాగరంలో అనంతమైన జలరాశి ఉన్నట్లే అతనిలో అనంతమైన సద్గుణాలన్నీ వచ్చిచేరుతాయి. నామము బీజం వంటిదని దీనివలన తెలుతున్నది. బీజాన్ని నాటినతరువాత దానినుండి అంకురం మొలకెత్తుతుంది. అదే పుష్పిస్తుంది, పల్లవిస్తుంది. తరువాత విశాలవృక్షమౌతుంది. అదే విధంగా నామజపంచేసేవారిలో అనాయాసంగానే సద్గుణాలప్రాదుర్భావమౌతుంది.

దీనికై మనుష్యుడు భగవన్నామముయొక్క గుణాలను ప్రభావాన్నీ, తత్త్వాన్నీ మరియు రహస్యాన్నీ చక్కగా తెలుసుకోవాలి. ఇలా చక్కగా తెలిస్తేనే జపించేనామంలో అమితమైన శ్రద్ధకలుగుతుంది. అటువంటి శ్రద్ధాయుత జపం తత్కాలమే సంపూర్ణఫలాన్నిస్తుంది. కాబట్టి భగవన్నామమునందు అత్యంత శ్రద్ధ కలుగవలెనంటే సత్పురుషులసాంగత్యం చేయాలి. ఒకవేళ సత్‌సాంగత్యం లభించనట్లైతే భగవంతునిగూర్చినవి. భగవన్నామమూ, తత్త్వమూ, రహస్యమూ, ప్రభావమూ, శ్రద్ధ మరియు ప్రేమకు సంబంధించిన విషయాలను చర్చించే సత్‌శాస్త్రాల అనుశీలనం చేయాలి. ఇలా చేసినట్లైతే భగవన్నామమంటే శ్రద్ధ, ప్రేమ ఉత్పన్నమై చేసినజపము శాస్త్రాల్లో వర్ణించినట్లు ఫలించి, ఫలితం తత్‌క్షణమే దృగ్గోచరమౌతుంది.



# 5. భగవత్ప్రాప్తికి భావమే ప్రధాన సాధనము

ప్రపంచంలో క్రియకన్నా భావమే ప్రధానమైనది. భావప్రాధాన్యము వలన చిన్నచిన్న క్రియలు కూడా ముక్తిని ప్రసాదించగలుగుతాయి. భావ ప్రాధాన్యము లేని అత్యుత్తమక్రియలుకూడా నరకమునకే దారితీస్తాయి. ఎవరైనా ఇతరులఅనిష్టాన్ని కోరుతూ జపము, తపము, ధ్యానము, స్తుతి, ప్రార్థన, పూజ, పారాయణము, యజ్ఞము మొదలైన అనుష్ఠానములను ఆచరించినట్లైతే దానిఫలితంగా కర్తకు నరకమే ప్రాప్తిస్తుంది. పై అనుష్ఠానాలూ, క్రియలూ అత్యుత్తమమైనప్పటికినీ తామసంతో కూడిన భావనకారణంగా కర్తకు అథోగతినే కలిగిస్తాయి.

<u>జఘన్యగుణవృత్తిస్థా అధోగచ్ఛంతి తామసాః ।</u> **(గీత 14/18)**

'తమో గుణముయొక్క కార్యరూపమైన నిద్ర, ప్రమాదము మరియు అలసత్వంలో మునిగివున్న తామసపురుషుడు అథోగతిని అనగా కీటకములు, పశువులు మొదలైన నీచయోనులను మరియు నరకమును పొందుతాడు' అని భగవంతుడు గీతలో సెలవిచ్చాడు.

ఇట్టి ఉత్తమక్రియలను స్త్రీ, ధనము, పుత్ర ప్రాప్తికో లేక రోగనివృత్తికో ప్రయోగించినట్లైతే, అది రాజసభావప్రధానమైనందున మధ్యమగతిని పొందుతాడు. అనగా ఏఏభావాలను మనసులో వుంచుకుని ఈ క్రియలను చేస్తారో వాటికి అలాంటి ఫలితాలే కలుగుతాయన్నది సారాంశం. పైన చెప్పిన ఉత్తమక్రియలను కర్తవ్యంగా భావించి నిష్కామభావంతో భగవంతునికై చేసినట్లైతే దానిఫలితంగా అంతఃకరణ శుద్ధియై భగవత్ప్రాప్తి కలుగుతుంది! ఈ విధంగా క్రియఒక్కటేఅయినా భావాలు వేరుకావటం

వలన ఉత్తమ, మధ్యమ, అధమ ఫలాలనిచ్చేదవుతుంది. చేసేది నీచకర్మయైనా ఉత్తమ భావంతో చేస్తే అది ముక్తిని కూడా ప్రసాదించగలదు. పిల్లలకు తల్లిదండ్రులరూపంలోను, గురుజనులరూపంలోను శిక్షణ, పాలన చేయటం, వారి మలమూత్రాలను శుభ్రం చేయటం, డాక్టరు రూపంలో శస్త్రచికిత్స చేయటం, రోడ్లు మొదలైనవి శుభ్రపరచటం, వంటచేయటానికై కట్టెలబరువులను మోయటం, న్యాయంగా వస్తువుల క్రయవిక్రయాలు చేయటం, భృత్యునిగా సేవచేయటం, చివరకు మురికిపోవటానికి మలమూత్రాలను సైతం తీసిపారేసి శుభ్రంచేయటం మొదలైన నిమ్నస్థాయికి చెందిన పనులన్నింటినీ కర్తవ్యమనుకొని నిష్కామ ప్రేమ భావంతో చేసినట్లైతే ఫలితంగా అంత:కరణ శుద్ధియై పరమాత్మ ప్రాప్తి కూడా కలుగుతుంది. ఈ పనులనే సకామంగా చేసినట్లైతే అర్థసిద్ధీ (ధనం) కలుగుతుంది.

భిల్లజాతి శబరి దారినంతా చీపురుతో ఊడ్చి చెత్తాచెదారం, ముళ్ళూ మొదలైనవి తీసేసి శుభ్రంచేసేదట! అడవిలోని ఎండుపుల్లలను ఏరి కట్టలు కట్టి మున్యాశ్రమాల చెంత వుంచేదట! ఇది చూడటానికి చాలా నీచమైన పనియేకావచ్చు. కానీ ఆమె ఈ పనులన్నింటిని నిష్కామ ప్రేమభావంతో తన కర్తవ్యమనుకొని, చేయటంవలన ఆమె అంత:కరణం శుద్ధియై ఆమెకు భగవత్ప్రాప్తి కలిగిందట!

పద్మపురాణంలో ఒక కథ వున్నది. నరోత్తముడనే బ్రాహ్మణుడు తులాధారుడనే వైశ్యుని దగ్గరకు వెళ్ళినపుడు తులాధారుడు తన బేరగాళ్ళకు సరుకులనమ్మే పనిలో నిమగ్నమైవుంటాడు. అందుచేత 'ఇప్పుడు నాకు అవకాశంలేదు. ఈ కొనుగోలుదారులు రాత్రి ఒకటవ జాము గడిచేవరకు ఉంటారు. ఆతరువాతే నాకు నీతో మాటాడే అవకాశం లభిస్తుంది. అంతవరకూ ఉండగలిగితే సరే! లేకుంటే అద్రోహకుడనే సజ్జనుని దగ్గరకు వెళ్ళండి. మీవల్ల ఒక కొంగ చచ్చినది. మీధోవతి ఆకాశంలో ఆరకుండా వున్నది. వీటిరహస్యం మీకు తర్వాత తెలుస్తుంది లెండి' అన్నాడు. నరోత్తమునితో కూడా బ్రాహ్మణరూపంలో ఉన్న భగవంతుడు 'పదండి!

మనం అద్రోహకుని దగ్గరకు వెడదాం!' అని అక్కడి నుండి బయలుదేరి సజ్జనుడైన అద్రోహకుని దగ్గరకు వెళ్ళసాగారు. 'తులాధారునికి నావలన కొంగ చచ్చినదని ఎలా తెలిసినది?' అని నరోత్తముడు దారిలో బ్రాహ్మణుని అడిగాడు. 'క్రయవిక్రయాలు చేయటంలో అందరితో సమానంగాను సత్యంగాను తులాధారుడు వ్యవహరిస్తాడు. అందువల్లనే అతనికి మూడు కాలాల జ్ఞానం అబ్బింది' అన్నాడు బ్రాహ్మణుడు. అంతేకాదు. ఆ తులాధారుని ఇంటిలో బ్రాహ్మణుడుగా ఉంటున్న భగవంతుడు చివరకు విమానంలో ఎక్కి తులాధారునితో సహా పరమధామానికి వెళ్ళిపోయాడు.

ఇక్కడ ఆలోచించవలసిన విషయం ఒకటున్నది. తులాధార వైశ్యుడు చేసే క్రయవిక్రయాల క్రియ చూడటానికి చాల చిన్నదైనా అందులోని స్వార్థత్యాగము, నిజాయితీ, నమ్మకము మరియు సమానమైన వ్యవహారశైలి కారణంగా ఆ నిమ్న క్రియయే ఎంతో ఉన్నతమై అతనికి భగవంతుని యొక్క పరమపదాన్నే ప్రసాదించగల శక్తిని పొందిందని తెలియాలి.

దీనివలన భావమే ప్రధానమైనది కానీ క్రియలు ప్రధానమైనవి కావు అని, అందుచేత మనమేక్రియను చేసినా ఉత్తమోత్తమమైన భావంతో చేయాలని గమనించాలి.

నీచాతినీచమైన క్రియకూడా అత్యున్నతగతిని ప్రాప్తింపచేయ గలిగితే...అత్యున్నతమైన క్రియ మరియు అత్యున్నతమైన భావము...రెండూ కలిస్తే ఇక చెప్పేదేముంటుంది? ఈ భావాన్నే విశదీకరిస్తుందీక్రింది కథ.

భగవద్భక్తుడైన ఒక సాధకుడుండేవాడు. అతడొక రావి చెట్టుక్రింద వుంటూ భజనధ్యానాదులు, గీతాపారాయణము, సాధువులకు సేవ, తపము మరియు ఉపవాసాది కార్యక్రమాలు చేస్తూవుండేవాడు. ఒకనాడు అక్కడకు దేవర్షి నారదుడు వచ్చాడు. సాధకుడు వారికి సేవాశుశ్రూషలు సమర్పించాడు. ఆ తరువాత నారదుడు వెడుతున్న సమయంలో 'స్వామీ! తమరెక్కడికి

వెడుతున్నారు?' అని ప్రశ్నించాడు. 'నేను వైకుంఠంలో వున్న భగవంతుని దగ్గరకు వెడుతున్నానన్నాడు' నారదుడు. అది విన్న సాధకుడు నారదుని చరణాలకు తనశిరసును తాకించి, చేతులు జోడించి దీనవదనంతో కుతూహలంగా స్వామీ! నాకు భగవద్దర్శనం ఎప్పుడు అవుతుందో నాకోసం భగవంతుని అడిగిరాగలరా?' అని ప్రార్థించాడు. 'తప్పకుండా అడిగి నీకు చెపుతాను' అని నారదుడు అత్యంత ప్రేమతో భగవన్నామ సంకీర్తనం చేసుకుంటూ వెళ్ళి వైకుంఠధామం చేరుకొన్నాడు.

'నారదా! మీరెక్కడి నుండి వస్తున్నారిప్పుడు?' అని ప్రశ్నించాడు భగవంతుడు. 'ఒక చెట్టుక్రింద తమ భక్తుడొకడు తమ భజన ధ్యానాదులు మరియు తపస్సు చేస్తూ వాటిలో నిమగ్నుడైవున్నాడు. నేనిప్పుడక్కడి నుండే వస్తున్నాను. భగవన్! అతని సేవ-పూజ, భజన-ధ్యానాలు మరియు తపస్సు ప్రశంసించయోగ్యమైనవి! ప్రభూ! అతడు తనకెప్పుడు తమ దర్శనమౌతుందో తెలియగోరి నా ద్వారా మీకొక ప్రశ్నపంపాడు' అన్నాడు నారదుడు.

'నారదా! ఈ విషయం అడుగకు' అన్నాడు భగవంతుడు. నారదునిలో ఉత్సుకత పెరిగింది. 'ఎందుకని భగవన్!' అన్నాడు.

'నారదా! వాడు చేసే భజన-ధ్యానాలు, సేవా-శుశ్రూష మరియు తపస్సు ఇలాగే కొనసాగితే నా దర్శనం లభించటానికి చాలా ఆలస్యం అవుతుంది. ఇలాగే సాధన చేసినట్లైతే ఆ రావిచెట్టుకు ఎన్ని ఆకులున్నాయో అన్ని సంవత్సరాల తర్వాతే వాడికి నా దర్శనం లభిస్తుంది' అన్న భగవంతుని మాటలు విన్న నారదుడు ఖంగుతిన్నాడు. ఆశ్చర్యపోతూ 'భగవన్! అతడుచాలా తీవ్రంగా సేవా-శుశ్రూషలు, జపధ్యానాదులు, తపస్సు మొదలైనవి చేస్తున్నాడు కదా! మరి అతని యెడల ఈ ఆలస్యమెందుకు?' అని అడిగాడు. 'నారదా! నీవు దీనిరహస్యమునెరుగవు. నేను చెప్పేది విని వానితో చెప్పు' అన్నాడు భగవంతుడు. ఆ తరువాత నారదుడు

భగవంతునితో భక్తి, ప్రేమ, జ్ఞాన, వైరాగ్య సంబంధమైన విషయాల గురించి చర్చించాడు.

నారదుడు తిరిగి అదే రావి చెట్టుక్రింద కూర్చొని వున్న భక్తుని దగ్గరకు వచ్చాడు. నారదుని చూస్తూనే భక్తుడు అతని చరణాలమీద వాలిపోయాడు. ఎంతో ఆత్రుతతో అడిగాడు 'ప్రభూ! అక్కడ నా విషయం చర్చకు వచ్చినదా?' అన్నాడు. అతనివ్యాకులతతో నిండిన మాటలు వినిన నారదుడు ముగ్ధుడైపోయాడు. 'నీ విషయం ప్రస్తావనకు వచ్చినది. కానీ చెప్పటానికి కొంచెం సంకోచిస్తున్నాను' అన్నాడు నారదుడు. 'సంకోచమెందుకు స్వామీ! భగవంతుడు నన్ను తిరస్కరించినాడా? స్వామీ! ఈ జన్మలో భగవద్దర్శనం లభ్యం కాదన్నాడా? ఏదైనా సరే! మీరు సెలవీయండి. సంకోచించకండి. నేనేమీ బాధపడను!' అన్నాడు భక్తుడు.

భక్తునిబలవంతంమీద నారదుడు విషయమంతా పూసగుచ్చినట్లు చెప్పి 'చివరకు భగవంతుడు నీ సాధన ఇలానే జరుగుతూ వుంటే ఈ రావిచెట్టుకెన్ని ఆకులున్నాయో అన్ని సంవత్సరాల తర్వాతే నీకు తన దర్శనం లభిస్తుందన్నాడు' అని వివరించాడు. అది వింటూనే భక్తుడు ఆశ్చర్య చకితుడైపోయాడు. అత్యంతదైన్యంతోనిండిన గద్గదస్వరంతో ఇలా అన్నాడు. 'నావంటి అధమునికి భగవంతుని దర్శనం లభిస్తుందా? ఇది భగవంతుడే స్వయంగా తననోటితో సెలవిచ్చాడా? ఓహో! ఎప్పుడైనా కానీ చివరకు నాకు భగవద్దర్శనం తప్పకుండా లభిస్తుంది!' 'తప్పకుండా లభిస్తుంది. ఎందుకంటే భగవంతుడే స్వయంగా తననోటితో చెప్పిన మాటలివి! దర్శనం ఔతుంది కానీ చాలా ఆలస్యంగా ఔతుంది' అని నారదుడు అన్నమాటలు విని ఆ భక్తునిఆనందానికి హద్దేలేకుండాపోయినది. అతని భావంలో ఒక్కసారి మార్పు వచ్చినది. ఆనందపరవశుడైపోయి ప్రేమార్ద్రభావంతో భగవన్నామము, భగవద్గుణాల సంకీర్తనం చేస్తూ ఉన్మత్తునివలె గంతులువేయసాగాడు. ప్రేమ, ఆనందాలలో మునిగిపోయి

తన్ను తానే మరిచిపోయాడు. శరీరం యొక్క ఆభాసకూడా లేకుండా పోయినది! ఇక ఆలస్యమెందుకు? భగవంతుడు ఆ క్షణంలోనే ప్రత్యక్షమయ్యాడు!

భగవంతుని చూచిన నారదుడు అవాక్కయ్యాడు. 'భగవన్! ఈ విధంగా సాధన చేస్తూ పోతే ఆ చెట్టుకెన్ని ఆకులున్నాయో అన్ని సంవత్సరాల తరువాతే తమ దర్శనమౌతుందని సెలవిచ్చారే! ఆ సంవత్సరాల సంగతి అటుంచి, ఇదేమిటి? ఒక్క మూహూర్తకాలం కూడా గడవక ముందే తమరు ప్రత్యక్షమయ్యారు?' అని తెల్లబోయి ప్రశ్నించాడు నారదుడు. 'నారదా! ఆ విషయం వేరు - ఈ విషయం వేరు! దీని రహస్యం నీకు తెలియదన్నాను కదా!' అన్నాడు దేవుడు. 'ప్రభూ! ఆ రహస్యమేదో కాస్త సెలవీయండి నాకు!' అడిగాడు నారదుడు. 'నారదా! ఆ సమయాన ఇతనిసాధనలో క్రియాప్రాధాన్యమే తప్ప భావప్రాధాన్యము లేదు. కానీ ఈ సమయాన క్రియతోపాటు అతనిలోని భావం కూడా ప్రాధాన్యమును సంతరించుకొన్నది. సాధువులసేవ-శుశ్రూష చేయటం, వ్రతము, ఉపవాసము, తపస్సు, గీతాపారాయణము, సత్పురుష సాంగత్యము, స్వాధ్యాయమును మరియు భజన ధ్యానాదులతో సాధనచేస్తూ నా భక్తిని కలిగివుండటం అత్యుత్తమమైన క్రియలే! ఈ క్రియలన్నింటితోపాటు అనన్యప్రేమభావం లేకుంటే-అది కలిగే వరకూ విలంబం కావటం ఉచితమే కదా! భక్తుడు తన్ను తాను మరిచిపోయి అనన్యప్రేమ భావంలో ముగ్ధుడైపోయి కేవలం నా భజన సంకీర్తనంలోనే నిమగ్నమైపోయినపుడు నేనిక ఒక్కక్షణం కూడా విలంబనం చేయలేను. వెంటనే ప్రత్యక్షమౌతాను. ఇప్పుడు ఇతనిలోని అపూర్వమైన పవిత్రప్రేమతో నిండిన భావాన్ని చూడు నారదా! ఇంతకుముందు క్రియలు ఉత్తమమైనప్పటికీ వానిలో ఈ భావపరవశత్వం లేదు. అందుచేతనే 'ఇలాగే ఇతని సాధనసాగితే ఆ చెట్టుకున్న ఆకులన్ని సంవత్సరాలకు గానీ నాదర్శనం లభించదన్నాను' భగవంతుడు సెలవిచ్చిన ఈ రహస్యాన్ని విన్న నారదుడుకూడా ప్రేమపరవశుడైపోయి భావావేశంలో తన్ను తానే

మరిచిపోయి భగవంతుని నామాన్ని, గుణాలను కీర్తిస్తూ ఉద్దండనృత్యం చేయసాగాడు.

ఈ ఇద్దరి భక్తుల ప్రేమమయస్థితిని స్వయంగా చూచిన భగవంతుడు తానూ ప్రేమమగ్నుడైపోయాడు. భక్తులదీ భగవంతునిదీ కూడా ఒకే స్థితి అయినది. ఔను! భగవంతుని ఈ ప్రతిజ్ఞ వుండనే వున్నది కదా!

**యే యథా మాం ప్రపద్యంతే తాంస్తథైవ భజామ్యహమ్ ।**

**(గీత 4/11)**

'ఏభక్తుడు నన్నేరీతిగా భజిస్తాడో, నేనూ అదేరీతిని అతనిని భజిస్తాను'.

ఇలా కొంతసేపటి వరకు విచిత్రమైన ప్రేమమయ రాజ్యప్రగాఢస్థితిలో ఉన్న తరువాత ముగ్గురికీ బాహ్యస్మృతి కలిగినది. అప్పుడు వారు ముగ్గురూ ప్రేమ ముగ్ధులై పరస్పరం సంభాషించుకొన్నారు. తదనంతరం భగవంతుడు తనభక్తులను వెంట తీసికొని విమానంలో కూర్చొని పరమధామాన్ని చేరుకొన్నాడు. నారదుడు ప్రేమసాగరంలో మునిగి భగవద్గుణాలను గానం చేస్తూ తనగమ్యస్థానం వైపు ప్రస్థానమయ్యాడు.

సమస్త క్రియలలోను భగవద్భక్తి ఉత్తమమైనదనీ, ఆ భక్తితో పాటు నిష్కామమూ, అనన్యమూ అయిన ప్రేమభావం కలిస్తే...ఇక భగవద్దర్శనానికి ఒక్కక్షణం కూడా విలంబనముండదనీ ఈ ప్రసంగము యొక్క సారాంశంగా గ్రహించాలి. కాబట్టి పైన చెప్పిన విధంగా నిష్కామమైన అనన్య ప్రేమభావ పూర్వకమైన భజనధ్యానాది ఉత్తమ క్రియలను నిరంతరము ఆచరించాలని మనం తెలుసుకోవాలి.



# 6.*ప్రవీరుని'అలౌకిక భగవత్ప్రేమ

ప్రవీరుడు మాహిష్మతీ నగరాధిపతియైన శ్రీనీలధ్వజుని పుత్రుడు. ఇతని తల్లి జ్వాలాదేవి. ఈమె మృదుస్వభావముకలది. సాధ్వి మరియు ధర్మపరాయణురాలును. భగవద్భక్తితోపాటు ఆమె స్వాభిమాని, వీరాంగన, ధైర్యవంతురాలు కూడా. ఈమెయొక్క అత్యంత పవిత్రమైన జీవన ప్రభావం ఈమె పుత్రుడైన ప్రవీరునిపై గాఢంగా వున్నది. తత్ఫలితంగా ప్రవీరునిలో కూడా సరళత్వము, సౌజన్యము, సత్ప్రేమ, భగవద్భక్తి మొదలైన గుణాలు పుణికిపుచ్చుకొన్నట్టు వచ్చాయి. వీరత్వం అతని అంగాంగాలలో మెరుస్తూ కనిపిస్తుంది. కానీ అతడు నిరంతరం భగవచ్చింతనలోను, భక్తిపారవశ్యంలోను తన్మయుడై ఉండేవాడు.

ఆరోజుల్లో ఇంద్రప్రస్థంలో కౌరవులనోడించిన ధర్మరాజు రాజ్యం చేస్తుండేవాడు. ఆయన శ్రీకృష్ణభగవానుని సలహామేరకు అశ్వమేధయజ్ఞాన్ని చేయటానికి నిశ్చయించుకొన్నాడు. అశ్వం విడిచిపెట్టబడింది. దానిరక్షణకై ధనుర్ధరుడైన అర్జునుడు నియమింపబడ్డాడు. ఆయనవెంట విశాలమైన సైన్యం కూడా ఉన్నది. ఈ యాత్రకుముందు శ్రీకృష్ణభగవానుడు కూడా అర్జునునివెంట వెళ్ళటానికి ఇష్టపడ్డాడు. కానీ ఈ చిన్న కార్యం కోసం ఆయనకు కష్టం కలిగించటం భావ్యంగా తోచలేదు.'ఈ భూమండలాన్ని జయించటానికి నేనూ ఈసేన చాలునని' అర్జునుడు బయలుదేరాడు. అర్జునునిముఖంలో దాగియున్న అభిమానపు రేఖ తొంగిచూస్తున్నది.

---

* బెంగాల్‌లో ప్రసిద్ధమైన లీలాభినయాలలో (యాత్రలలో) ప్రవీరుని లీల ఆడబడుతుంది. ఇది చాలా సుందరము, మనోహరమూ అయినది. ఈ కథ దీని ఆధారంగానే వ్రాయబడినది. ఇది ఎంతవరకు నిజమో తెలియదు. ఇలాంటి ప్రవీరుని కథ ఒకటి 'జైమినీయాశ్వమేధం'లో కూడా కానవస్తున్నది. కాని అది మరొక విధముగా వున్నది.

---

'వీరవరుడైన అర్జునునితో తలపడే సాహసం ఎవరికైనా ఉంటే వారు ఈ అశ్వాన్ని పట్టుకొనవచ్చు. లేకుంటే యుధిష్ఠిర మహారాజు చేసే అశ్వమేధ యజ్ఞానికి కానుకలతో సహా నియమితసమయానికి ఉపస్థితులు కావచ్చు'నని అశ్వముఖమునకున్న బంగారురేకుపై వ్రాయబడివున్నది. అందరికన్నా ముందు ఆ అశ్వం ఊగుతూ నడుస్తోంది. వెనుకనే వీరుడైన అర్జునుడు శస్త్రములతో, సేనావాహినితో దానిని వెంబడిస్తున్నాడు.

గుఱ్ఱంవైపు దృష్టి సారించిన వాడెవడూ కానరాలేదు. మార్గంలో ఎదురైన రాజులూ, మహారాజులూ అందరూ స్వాగతాలు పలికి యుధిష్ఠిర మహారాజుకు తాము అధీనులమని ప్రకటించారు. ఇలా తిరుగుతూ ఆ గుఱ్ఱం మాహిష్మతీ నగరసమీపమునకు చేరుకొన్నది.

ప్రవీరునితండ్రి, మాహిష్మతీనరేశుడైన నీలధ్వజానికి అర్జునుని పేరు వినగానే అనుమానం వచ్చిన్నది. గుఱ్ఱాన్ని పట్టకుండా వుండటమే క్షేమం అనుకొన్నాడు. కానీ జ్వాలాదేవికిది నచ్చలేదు. ఆమె కలతచెందినది. తన పతిదేవుడు చేసిన పని పిరికితనంతో కూడుకొన్నదని భావించి క్షత్రియ ప్రతిష్ఠను కాపాడే విషయంలో అర్జునునితో యుద్ధానికి తలపడే ప్రయత్నాలన్నింటిని చేసింది. కానీ నీలధ్వజుడు తన నిశ్చయాన్ని మార్చుకొనలేదు.

పతినుండి నిరాశపొందిన జ్వాలాదేవి తనప్రాణానికి ప్రాణమైన పుత్రుడు ప్రవీరుని దగ్గరచేరి ప్రతిష్ఠకోసమైనా యుద్ధాన్ని చేయుమని ప్రోత్సహిస్తూ 'కుమారా! నేను నిన్ను నా ప్రాణాలకంటే ఎక్కువగా ప్రేమిస్తున్నాను. అంతేకాదు నీవు దేశాన్నీ, జాతినీ, స్వాభిమానాన్ని కూడా రక్షించాలని కోరుకొంటున్నాను. అర్జునుని విశాలమైన సేనావాహినితో కూడిన అశ్వమేధ అశ్వం నీ క్షత్రియత్వాన్నీ, నీ వీరత్వాన్నీ, నీ స్వాతంత్ర్యాన్నీ, నీ దేశాభిమానాన్నీ ప్రశ్నిస్తున్నది! ఆ అశ్వం ఇక్కడినుండి విజయోత్సాహంతో వెళ్ళకూడదని నా కోరిక! నీవులెమ్ము! త్వరగా లేవవయ్యా! ఆ అశ్వాన్ని పట్టుకొని అర్జునుడు వెనుదిరిగి వెళ్ళటానికి వివశుడయ్యేలా చేయుము. అతని

మదోన్మత్త చతురంగబలాలను నీ తీక్ష్ణమైన బాణాలతో భేదించి ఒక్కక్షణం కూడా ఇక్కడుండకుండా చేయుము అని అన్నది.

'అమ్మా! శ్రీకృష్ణుని సారథిగాగల వీరుడైన అర్జుననినే!...' ఆశ్చర్య చకితుడైన ప్రవీరునికి నోట మాటకూడా రాలేదు. ఇంతలో అతనితల్లి మహాకాళిలా హుంకరించి 'ఆఁ ...అర్జునుడే! నీవొక్క క్షణం ఆలోచిద్దామనుకొంటే చెప్పు. నేనే స్వయం గా అతనిసేనతో తలపడటానికి వెడతాను. నేను కొడుకునే కనలేదనుకొంటాను' అన్నది.

'నీ ఆజ్ఞను శిరసావహిస్తున్నానమ్మా! నీవు అంతఃపురంలోకి వెళ్ళు' అన్న ప్రవీరునిమాటలకు ఆమె చాలా సంతుష్టురాలై లోనికి వెళ్ళిపోయినది. 'నేను మీ గుఱ్ఱాన్ని ఆపుతున్నాను. యుద్ధానికి సిద్ధంకండి' అని అర్జునునికి సందేశ పత్రం పంపాడు, ప్రవీరుడు.

దూత సమాధానం తెచ్చాడు. వీరుడైన ప్రవీరుడు చదివాడు. 'ఓ వీరుడా! క్షత్రియోచితమైన పత్రాన్ని చదివి నాకు చాలా ఆనందం కలిగింది. సంతోషంగా నీకు ధన్యవాదాలు చెపుతున్నాను. కానీ నీవిప్పుడు చాలా చిన్నపిల్లవాడివి. ఇంకా నీవు జీవితానందాన్ని పొందనేలేదు. దాన్ని విడిచి అప్పుడే మృత్యుముఖంలోకి అడుగిడటానికి సాహసించటం అంత మంచిది కాదు!' అని వ్రాశాడు అర్జునుడు. దానికి జవాబుగా 'ఓ వీరాగ్రేసరుడా! పిరికివానిలా మాట్లాడటం మీకు తగదు. యుద్ధం చేయాలని అనిపించకపోతే మీరు ఇంద్రప్రస్థమునకు తిరిగిపొండి! అశ్వాన్ని మాత్రం నేను విడిచిపెట్టను!' అన్నాడు.

ఇంకేముంది? మరునాడు అరుణోదయమవుతూనే యుద్ధం మొదలైనది. భయంకరమైన పోరుసాగింది. భక్తుడు, వీరుడు అయిన ప్రవీరునివాడిబాణాలతో అర్జునుడు వ్యాకులపడిపోయాడు. అర్జునుడు ప్రద్యుమ్నునితో ప్రవీరునిసుకుమారత్వాన్ని లెక్కించక వాడిపై శరవర్షం కురిపింపుమన్నాడు. 'మీవలెనే ఈ ప్రవీరుడు కూడా నా తండ్రికి భక్తుడే!'.

అతనిభక్తి గుర్తుకురాగానే నాకు చేతులాడటం లేదు. శక్తిమంతమైన బాణాలను వేగంగా సంధించలేకపోతున్నాను, నేనీయుద్ధం చేయలేను' అన్నాడు ప్రద్యుమ్నుడు వెంటనే. తర్వాత మహాబలుడైన భీముడు ముందుకొచ్చాడు. కానీ భగవచ్ఛరణాశ్రితుడు, భగవచ్ఛక్తివలన బలవంతుడు అయిన ప్రవీరుని తీక్ష్ణమైన బాణాలముందు అతడేమీ చేయలేక పోయాడు. ఈ స్థితిని చూచిన అర్జునుడు క్రోధావేశంతో ఆగ్నేయాస్త్రాన్ని ప్రయోగించాడు. కానీ ఆ భీషణమైన అగ్నిజ్వాలలు ప్రవీరుని యొక్క బాణాల వర్షధారలతో చల్లబడిపోయాయి. ఇదే విధంగా ప్రవీరుని మస్తకాన్ని ఛిన్నాభిన్నం చేయాలని అర్జునుడు ప్రయోగించిన భయంకరములు విషపూరితములుఐన బాణాలన్నీ వ్యర్థములని నిరూపితమయ్యాయి. రాజకుమారుడైన ప్రవీరుడు అర్జునుని, అతనిసైన్యాన్ని వికలం చేసి పరాజితుని చేశాడు.

వీరత్వంతో వెలిగిపోయిన అర్జునుని ముఖమండలంపైన విషాదపు నీలినీడలు వ్యాపించాయి. అదే సమయాన ప్రవీరుడు వచ్చి 'వీరాగ్రేసరా! అర్జునా! అశ్వమేధయజ్ఞ అశ్వాన్ని ఈ బలాన్ని చూచుకొనే వదిలారా? నేనొక విషయాన్ని స్పష్టం చేస్తున్నాను. మీకు ప్రాణాలమీద ఆశలేకుంటే రేపు తిరిగి సమరభూమికి రండి! లేదా సుఖంగా ఇంటికి దయచేసి నేనేరోజున ఈ అశ్వంతో అశ్వమేధయజ్ఞాన్ని చేస్తానో ఆనాడు కానుకలతో దయచేయండి! శ్రీకృష్ణభగవానుడు లేకుంటే మీరు నాపై ఎప్పుడూ విజయాన్ని సాధించలేరు. నన్ను గెలవాలనే ఆకాంక్ష మీ మనసులో వుంటే శ్రీకృష్ణుని పిలిపించండి, వారిని దర్శించి నేనూ ధన్యుడనవుతాను!' అని అంటూ కొద్ది క్షణాలు భగవద్ధ్యానంలో తన్మయుడైపోయాడు.

ప్రవీరుని పలుకులు అర్జునుని హృదయానికి శూలములవలె గుచ్చుకొన్నాయి. భగవంతునియెదుట తాను అభిమానంగా అన్న మాటలు ఆయనకిపుడు గుర్తుకువచ్చి తనతప్పును అనుభవపూర్వకంగా తెలుసుకొన్నాడు. వెంటనే వ్యాకులచిత్తంతో "హే హరీ! హే గోవిందా! హే

వాసుదేవా!! హే నారాయణా!!! నా అనుచితమైన అహంకారానికి క్షమించు! నీవు సర్వజ్ఞుడవు! సర్వశక్తిమంతుడవు! సర్వేశ్వరుడవు! నీవు వెంటనే వచ్చి నన్ను కాపాడు స్వామీ!' అని ప్రార్థించాడు. అర్జునుని ప్రార్థనవిన్న వెంటనే భక్తభయభంజనుడైన భగవంతుడు ఇక్కడెక్కడో దాగివున్నట్లు వెంటనే అక్కడ ప్రత్యక్షమయ్యాడు!

భగవంతుని చూస్తూనే అర్జునుడాయన చరణాలమీద పడిపోయాడు. ప్రభువు తనదృష్టిని మళ్ళించి చూస్తే అటు ప్రవీరుడు కూడా ప్రభువుయొక్క పావనచరణాలపై సాష్టాంగదండప్రణామం చేస్తూ కనిపించాడు. భగవంతుడు ఇద్దరినీ కలిశాడు. ప్రవీరుడు గద్గదకంఠుడైపోయాడు. హర్షాతిరేకంతో 'ప్రభూ! తమ దర్శనభాగ్యం చేత నేనీనాడు ధన్యుణ్ణయ్యాను' అన్నాడు. తిరిగి అర్జునునితో 'పార్థా! మీకు నేనెంతో ఋణపడివున్నాను! మీ దయవలనే నేడు నాకు ఈ శ్యామసుందరుని త్రైలోక్యపావనమైన ముగ్ధమనోహర రూప దర్శనభాగ్యం కలిగినది! ఇక మనం మన శిబిరాలలోకి వెళ్ళిపోదాం పదండి! రేపటి నుండి భగవంతుని సన్నిధిలోనే మన యుద్ధం జరుగుతుంది' అన్నాడు. వారిద్దరూ వారివారి శిబిరాలకి వెళ్ళిపోయారు.

ప్రవీరుని చూస్తూనే జ్వాలాదేవి అతణ్ణి తన హృదయానికి హత్తుకుని 'నాయనా! నీకు విజయం కలగాలని కోరుతూ భగవతి భాగీరథీదేవిని పూజించాలనుకుంటున్నాను' అన్నది. ప్రవీరుని యొక్క హృదయేశ్వరి, ప్రాణసమానయుఐన అతనిపత్ని యుగు మదనమంజరి కూడా అత్యంతానందంతో నేనూ నా భక్తిచేత శ్రీకృష్ణభగవానుని ప్రసన్నంచేసుకొని మీ విజయానికై ఆతని ప్రార్థిస్తాను' అన్నది. ప్రవీరుడు కూడా భగవంతుని ధ్యానంలో లీనుడయ్యాడు.

సగం రాత్రి గడిచింది. ఇక్కడ ప్రవీరునిపత్ని మదనమంజరి సుషుప్తావస్థలోనున్న అర్జునుని సైన్యంలో ప్రవేశించింది. ఆమె చేతిలో ఒక పొడవైన ఖడ్గం ఉన్నది. కాపలాదారుని స్థానంలో శంకరభగవానుడు

త్రిశూలధారియై నిలబడివున్నాడు. ఆయన మదనమంజరి ఎవరో తెలిసికొని అర్ధరాత్రిపూట ఖడ్గంతో శిబిరంలోకి వచ్చిన కారణాన్ని అడిగాడు.

మదనమంజరి నిస్సంకోచంగా తాను ప్రవీరునిపత్నినని, తన పతిప్రాణాలను రక్షించుకోవటానికై శ్రీకృష్ణభగవానుని దగ్గరకు బయలుదేరానని చెప్పినది.

శంకరభగవానుడు 'ఇది అసంభవం! భగవానుడు నిద్రిస్తున్నాడు. నీవు తిరిగి వెళ్ళిపో' అన్నాడు.

'అలాగైతే ఇదిగో నా శిరస్సు ఇప్పుడే తమచరణాలపైన దొర్లిపోతుంది' అంటూ మదనమంజరి ఖడ్గాన్ని పైకెత్తింది. శంకరభగవానుడు తానెవరో ఎరుకపరుస్తూ 'నేను నీ యెడ అత్యంత ప్రసన్నుడను అయ్యాను. ఇక కైలాసానికి వెడుతున్నాను. నేనిక్కడి నుండి వెళ్ళిన తర్వాత నా బాధ్యతేమీ వుండదు' అన్నాడు.

మదనమంజరి శ్రీకృష్ణుని శిబిరద్వారాన్ని చేరినప్పుడు ద్వారపాలకుడామెను వారించి ఆమెరాకకు కారణాన్నడిగాడు. మదనమంజరి వినమ్రంగా తనప్రాణప్రదమైన భర్తప్రాణాలభిక్షను యాచించటానికి నీలధ్వజ మహారాజుయొక్క కోడలు శ్రీకృష్ణభగవానుని చరణాల సమీపానికి చేరాలని కోరుకుంటోంది' అని అతనికి ప్రత్యుత్తర మిచ్చినది.

'ఈ సమయంలో ప్రభువులు శయనించి వున్నారు. ఇప్పుడు వెళ్ళిపో' అన్నాడు ద్వారపాలకుడు.

మదనమంజరి చేతనున్న ఖడ్గాన్ని పైకెత్తి 'మీరు నన్ను భగవానుని దగ్గరకు వెళ్ళనీయకుంటే నా శిరస్సును ఖండించి మీ పాదాలకు సమర్పిస్తాను' అంది.

ద్వారపాలుడు మదనమంజరి చేతిని పట్టుకొన్నాడు. కానీ ఆమె చూచిందేమిటి? అతడెవరోకాదు త్రిలోకనాథుడు, మదనమోహనుడు, శ్యామసుందరుడు అయిన ఆ శ్రీకృష్ణ భగవానుడే! తన ప్రాణాలను సైతం

పణంగా పెట్టి ఎవరికోసం వచ్చినదో అతడే! ఆమె ప్రభుచరణాలమీద వాలిపోయినది. కొంతసేపయిన తరువాత 'ప్రభూ! తమరు అంతర్యామిలే అయినా నేను చెప్పకుండా వుండలేను. ప్రాత:కాలముకాగానే ధనుర్ధరుడైన అర్జునునితో నా పతిదేవుడు యుద్ధానికి తలపడతాడు. ధనుర్ధరుడైన అర్జునునికి మీ అండ వుండటం వలన ఆయన ఏమైనా చేయగల సమర్థుడు. కాబట్టి నా జీవనధనమైన నా భర్తప్రాణాలను యాచిస్తున్నాను' అనివేడుకొన్నది.

తన కౌమోదకి అనే గదను, సహస్రారమైన సుదర్శనచక్రాన్ని ఆమెచేతికిచ్చి, భక్తవత్సలుడు, కరుణామయుడు అయిన శ్రీకృష్ణభగవానుడు ఇవి తన దగ్గరున్నంత వరకూ ప్రవీరునెవరూ సంహరించలేరు' అని సెలవిచ్చాడు. మదనమంజరి భగవానునిపాదాలకు నమస్కరించి అతివేగంగా పతిని చేరుకొని ఆ రెండు ఆయుధాలను అతనికిచ్చి శ్రీకృష్ణుడు చెప్పిన విషయాన్ని చెప్పినది.

అక్కడ ధర్మపరాయణురాలైన జాహ్నవీదేవి శ్రీగంగాదేవిని సంతుష్టపఱచి శివుని తన త్రిశూలంతో ప్రవీరుని పక్షాన యుద్ధంచేయుమని కోరవలసిందిగా ఆమెను ప్రార్థించినది. శ్రీగంగాదేవి ప్రార్థనను విన్న ఆశుతోషుడు వెంటనే 'అర్జునుని వెంట స్వయంగా శ్రీకృష్ణుడే వున్నపుడు అతని కెదురుపడి యుద్ధభూమిలోనికి దిగటం నాకసంభవం!' (నావల్ల కాదు) అన్నాడు.

ప్రాత:కాలముకాగానే అర్జునుడు తన సఖుడైన శ్రీకృష్ణుని చేరుకొన్నాడు. శ్రీకృష్ణుడు ఉదాసీనుడై చింతిత ముద్రలో అవనతముఖుడై కూర్చొనివున్నాడు. అర్జునుని చూస్తూనే 'మిత్రమా! అర్జునా! ప్రవీరునిభార్యయొక్క భక్తికి అత్యంత సంతుష్టుడనై నా రెండు ఆయుధాలూ ఆమెకిచ్చివేశాను. అవి ప్రవీరునివద్ద ఉన్నంత వరకూ అతణ్ణి నీవేమీ చేయలేవు. ఇక నీవెంట నేనుంటే నీకు శుభానికి బదులు అన్నింటా విఘ్నాలే కలుగుతాయి!' అన్నాడు.

శ్రీకృష్ణునిమాటలు వింటూనే భీముడు క్రుద్ధుడయ్యాడు. మీరు కాస్త

ఆలోచించి వరదానం చెయ్యవలసినది! మీరు మమ్మల్ని రక్షించుటకు వచ్చారా? లేక మాపై కష్టాలభారాన్ని మోపుటకు వచ్చారా?' అన్నాడు. కానీ అర్జునుడు భీముని అనునయిస్తూ అత్యంతవిశ్వాసంతో వినమ్రుడై శ్రీకృష్ణునితో 'ఏమంటున్నారు ప్రభూ! మీరు చేసే ప్రతి క్రియలోనూ ఏదో శుభందాగే వుంటుందని నాకు దృఢమైన నమ్మకం. ఈ ఆయుధ దానంలోకూడా ఏదో నా హితమే ఉన్నది! నేను పూర్తిగా నిశ్చింతగావున్నాను. మీరే నాకు సర్వస్వమూ కదా! మీరే ఈ యజ్ఞానుష్ఠాన ప్రేరకులు. ఇది నిర్విఘ్నంగా పూర్తవుతుందని వాగ్దానం చేశారు కదా! మీరేది ఉత్తమమనుకొంటే అదే కానీయండి!' అన్నాడు.

శ్రీకృష్ణుడు నిశ్శబ్దంగా వుండిపోయాడు. తనపై ఆధారపడిన అర్జునుని గురించి చింతిస్తున్నాడు. ఆయన మాటాడలేకపోతున్నాడు. తిరిగి అర్జునుడు 'ప్రభూ! ప్రాత:కాలమౌతున్నది. యుద్ధం రాబోతున్న ఇప్పుడు మీ ఆజ్ఞ ఏమిటి?' అన్నాడు.

పద శంకరుని దగ్గరకు వెళదాం. ఆయనేదైనా ఉపాయమాలోచించి చెప్పగలడేమో!' అన్నాడు శ్రీకృష్ణుడు. ఇద్దరూ శంకరుని దగ్గరకు వెళ్లారు. అప్పుడు శ్రీకృష్ణుడు 'భగవన్! ప్రవీరునిపత్నియొక్క భక్తి శ్రద్ధలకు ముగ్ధుడనయి నేను నాకౌమోదకీ గదను, సుదర్శనచక్రాన్ని కూడా ఆమెకు ఇచ్చి వేశాను. అవి ప్రవీరుని చెంత ఉన్నంతవరకూ అతని నెవరూ చంపలేరు. అప్పుడు అర్జునుడు విజయాన్నెలా పొందగలడు? దీనికేదైనా ఉపాయం సూచింపుమని మిమ్ములను అర్థించటానికి వచ్చాము' అన్నాడు.

'సర్వజ్ఞులైవుండి మీరా వరాన్ని ఎలా ఇచ్చారు?' అన్నాడు శంకరుడు. 'రాత్రి ఆమెభక్తికి ముగ్ధులై మీరు కైలాసమునకు వెళ్ళిన రీతిగనే నేనూ ఆమె భక్తికి వివశుడనై వరమీయాల్సివచ్చినది' అన్నాడు శ్రీకృష్ణుడు ప్రత్యుత్తరంగా.

'నేనూ అసమంజసంలో పడిపోయాను. అక్కడ ప్రవీరుని తల్లి జ్వాలాదేవి చేసిన పూజలకు సంతుష్టురాలైన గంగాదేవి ప్రవీరుని పక్షాన త్రిశూలంతో యుద్ధంచేయుమని నన్ను కోరుతున్నది. ఇక్కడ మీరిలా

అంటున్నారు. అందుచేత ఎవరి పక్షాన కూడ నేను యుద్ధభూమిలోనికి రాకూడదని నిశ్చయించుకొన్నాను' అని శంకర భగవానుడు మందస్వరంతో అన్నాడు.

నిరాశాపూరిత స్వరంతో భగవానుడు అర్జునునితో 'అర్జునా! నాకు చేతనయినదింతవరకే! ఈయనకూడా స్పష్టంగా జవాబు చెప్పేశాడు ఇంకేమి చేయగలం?' అన్నాడు. 'ప్రభూ! నాకేమీ తెలియదు. నాకు తెలిసిందల్లా మీరేది చేసినా అందులో నాహితం వున్నదనే! సరే! యుద్ధసమయం ఔతున్నది మరి!' అన్నాడు అర్జునుడు.

ఒక్కక్షణం ఆలోచించి భగవానుడు అర్జునుని తీసుకొని ఉమాదేవి దగ్గరకు వెళ్ళాడు. అక్కడ శ్రీకృష్ణుడు యుధిష్ఠిరుడు తలపెట్టిన అశ్వమేధయాగము, అందులో భాగంగా అశ్వాన్ని ప్రవీరుడు బంధించి నిరోధించటమూ, తాను తన ఆయుధద్వయాన్నిచ్చి వరం ప్రసాదించటమూ మొదలైన విషయాలను వివరించి, చివరికి అర్జునునికి విజయం చేకూర్చుమని ప్రార్థిస్తూ 'మోహినీరూపంలో యుద్ధభూమికి వచ్చి ప్రవీరునినుండి ఆయుధాలను మీరు తీసుకొన్నట్లైతే మేమిద్దరం నిశ్చింతగా వుండగలము' అని మరీమరీ కోరాడు. భగవతి ఉమాదేవి 'తథాస్తు!' అన్నది. శ్రీకృష్ణుడు కోరుకొన్నది కూడా ఇదే! శ్రీకృష్ణుడు అర్జునునితో కలిసి వెళ్ళిపోయాడు.

యుద్ధ భూమిలోనికి ప్రవేశించిన అర్జునుడు తన విశాలమైన సైన్యంతో యుద్ధానికి సన్నద్ధుడై ఉన్న ప్రవీరుని చూశాడు. ఇక యుద్ధం ప్రారంభం కాబోతున్న సమయంలో ప్రవీరునికళ్ళఎదుట ఆకాశంలో ఒక నవ యౌవనవతి, అపూర్వలావణ్యం కలిగిన సుందరిని చూశాడు. ప్రపంచంలో ఇంతటి సౌందర్యం కూడా ఉంటుందన్న విషయం అతని ఊహకు కూడా అందలేదు. భగవంతుని అఘటన ఘటనా చాతుర్యమైన మాయ ప్రవీరుని బుద్ధిలో మోహాన్ని రేకెత్తించింది. దానితో ప్రవీరుడు విషయ కామాసక్తుడైన వానిగా ప్రవర్తిస్తూ ఆదేవిని ప్రణయ యాచన చేయసాగాడు. ఇదే మాయ యొక్క మహిమ!

అతిలోకసుందరి 'యుద్ధభూమిలో ప్రేమ వ్యవహారం కేవలం ప్రలాపమే ఔతుంది. నీవు నిజంగా ప్రేమ కావాలనుకొంటే నీ చేతనున్న ఆయుధాలను విసిరి పారవేయుము!' అన్నది. మాయామోహితుడైన ప్రవీరుడు ఆ సమయంలో మూఢుడైపోయాడు. అతడు శ్రీకృష్ణుడిచ్చిన ఆయుధాల రెండింటినీ విసరివేశాడు. భగవతి ఆ రెంటినీ తీసుకొని వెంటనే అంతర్థాన మైపోయినది! మాయ తెర తొలగిపోయినది.

ప్రవీరునకు జ్ఞానోదయమైనది. అతడు మనస్సులో 'నేనెంత అనర్థానికి పాలుపడ్డాను' అని పశ్చాత్తాప పడసాగాడు.

అతడు ఆలోచించి చివరికిది భగవంతుడే చేసి ఉంటాడు అనుకొన్నాడు. ప్రేమతో కూడిన రోషంతో ప్రవీరుడు 'ప్రభూ! ఆ అస్త్రాలను మాయతో తీసుకోవాలనుకొన్నప్పుడు వానిని నాకిచ్చే నాటకం ఎందుకు ఆడావు?' అని భగవంతుని అడిగాడు. 'ప్రవీరా! ఆ అస్త్రాలను నేను తీసుకొనలేదు! నేను తీసుకోవాలనుకొంటే వానిని నీకెందుకిస్తాను?' అన్నాడు భగవంతుడు. వెంటనే ప్రవీరుడు 'ప్రభూ! ఇలాగైతే మీరు అర్జునునికి ఏ సహాయమూ చేయకూడదు!' నేనూ మిమ్మల్ని నా ప్రాణాలకంటే అధికంగా నమ్ముకొన్నాను. మీ యందు నా భక్తి తక్కువేమీ కాదు' అన్నాడు.

ప్రవీరుని మాటలు వింటూనే అర్జునుడు 'ప్రభూ! యుద్ధంలో నాకు సాయపడుమని మిమ్మల్ని పిలిచాను. ప్రవీరునిలో శక్తి లేనట్లైతే అశ్వాన్ని వదలమనండి!' అన్నాడు. 'అశ్వాన్ని పట్టింది వదిలిపెట్టటానికి కాదు!' అన్నాడు రోషంతో ప్రవీరుడు. ఇంకేమున్నది? ఇరు పక్షాలనుండి భయంకరమైన శరవర్షం ప్రారంభమైనది. ఆకాశం తీక్ష్ణబాణాలతో కప్పబడినది. కానీ అర్జునుడేమీ చేయలేక పోతున్నాడు. పరాజితుడవుతున్నాడు ప్రవీరుని చేతిలో!

'అర్జునా! ప్రవీరుని యొక్క వీరత్వాన్ని చూస్తున్నావుకదా! నేను నీకు సహాయపడుతున్నా అతడు నిన్ను పరాజితుని చేయబోవుచున్నాడు!' అన్నాడు

భగవానుడు. బాణవర్షాన్ని ఆపకుండా ప్రయోగిస్తూనే అర్జునుడు 'ప్రభూ! అందుకే మిమ్మల్ని పిలిచినది! ఇప్పుడు మీ దయతో వెంటనే అతనిని ఓడించగలను' అన్నాడు.

అర్జునుడు తన వాడి బాణాలు వేస్తూనే ఉన్నాడు. ప్రవీరుడు వానిని మధ్యలోనే ముక్కలు ముక్కలు చేసివేస్తున్నాడు. క్రుద్ధుడై ప్రయోగించిన అర్జునుని బాణాలను ప్రవీరుడు వెంటనే నష్టపరుస్తున్నాడు. కానీ చివరకు ఆ రోజున అర్జునుడు ప్రవీరుని పరాజితుని చేశాడు.

రోషపడిన ప్రవీరుడు 'అర్జునా! ఇది నీ విజయం కాదు. ఇది ప్రభువు యొక్క విజయమని నేనంటాను. స్వామి యొక్క సహాయం లేకుండా నీవు నన్ను పరాజితుని చేయగలిగితే నిన్ను వీరునిగా గుర్తిస్తాను?' అన్నాడు. 'నేను భగవంతుని పిలిచినతర్వాత ఆయన్నెందుకు వదులుతాను? నీకు యుద్ధం చెయ్యాలని లేకుంటే వెళ్ళిపో!' అన్నాడు అర్జునుడు.

అర్జునుని మాటలను విన్న భక్తుడైన ప్రవీరుడు 'స్వామీ! మీరందరి వారూను. కానీ యుద్ధంలో ఈ పక్షపాతమెందుకు చూపుతున్నారు?' అని అడిగిన క్షణమే విశ్వమోహిని చిందించిన చిరునవ్వును ప్రభువులో గమనించాడు. ఇంకేమున్నది? ఆయన్ని సంతుష్టునిగా గమనించిన ప్రవీరుడు అర్జునుని రథం మీది నుండి లాగి తన రథం మీద కూర్చుండబెట్టాడు. భగవానుడు కళ్ళాలు పట్టుకొన్నాడు. ప్రవీరుడు అత్యంత గర్వంతో 'అర్జునా! ఇప్పుడు మనసారా యుద్ధం చేయుము! ఇప్పుడు నీవు ప్రాణాలను దక్కించుకొని పారిపోవాలి లేదా శాశ్వతంగా ఈ రణభూమిలో నిద్రపోవాలి!' అన్నాడు.

ప్రవీరుని కేమీ సమాధానమీయకుండా అర్జునుడు 'భగవన్! మీరు లేకుండా నేను జీవించలేను. మీరు నా రథాన్ని అధిష్ఠించండి, మిమ్మల్ని నేను పిలిచానుకదా!' అనగానే శ్రీకృష్ణ భగవానుడు అర్జునునిరథాన్నెక్కి కళ్ళాలు చేతులోకి తీసుకొన్నాడు.

'ప్రభూ! కనీసం ఒక్క యుద్ధంలోనైనా నాకు మీరు సారథిగా

ఉంటారనుకొన్నాను' అన్నాడు భగవంతునితో ఉదాసీనుడైన ప్రవీరుడు. 'ఇవాళ నీపౌరుషమెంతో చూస్తాలే!' అన్నాడు అర్జునునితో.

అర్జునుడు చాలా జాగ్రత్తగా తన తీక్షమైన శరపరంపరను వదులుతూనే ఉన్నాడు. కానీ ప్రవీరుడేమీ సాధారణ వీరుడు కాడు కదా! వానిముందు అర్జునుడు కంగారు పడుతూనే ఉన్నాడు. ఈ మధ్యలో శ్రీకృష్ణుడు 'నా సాయం ఉన్నా నీవు విజయాన్ని పొందలేక పోతున్నావు' అనగా విన్న అర్జునుడు భయంకరమైన ఆగ్నేయాస్త్రాన్ని సంధిస్తూ 'స్వామీ! ఇంకకొంచెం సేపు ధైర్యంగా ఉండండి. ఇతనినిప్పుడే పరాజితుని చేస్తాను' అన్నాడు. అర్జునుడు అన్నాడేకానీ అతడు విఫలుడే అయ్యాడు. ఐనా ఇతర దివ్యాస్త్రాలననేకం ప్రయోగించి ప్రవీరుని ఓడించాడు. అప్పుడు ప్రవీరుడు అర్జునుని నిందిస్తూ 'ఇతరుల శక్తితో యుద్ధంచేసే వానిని శూరుడనరు. భగవంతుని సాయం లేకుండా నన్ను జయించే సామర్థ్యం నీలో లేశమాత్రమూ లేదు?' అన్నాడు.

'ప్రభూ! మీరు మా ఇద్దరికీ కావలసిన వారు. కాబట్టి మీరు అర్జునుని రథాన్ని విడిచిపెట్టి నిష్పక్షపాతంగా మా ఇద్దరి యుద్ధ కౌశలమును వీక్షించండి. వాస్తవానికి వీరయోధుడెవరో తమకే తెలుస్తుంది. అప్పుడే కదా అసలైన యుద్ధపు రుచియేమిటో అర్జునునికి తెలిసేది?' అన్నాడు ప్రవీరుడు శ్రీకృష్ణునితో.

భగవంతుడు నవ్వసాగాడు. భక్త వీరుడైన ప్రవీరుడు భగవంతుడు తనమాటలకు సంతుష్టుడైనట్లు గ్రహించి మళ్ళీ శ్రీకృష్ణుని అర్జునునిరథం నుంచి లాక్కొచ్చి అక్కడే దగ్గరలో ఉన్న తాళ వృక్షానికి కట్టిపడేశాడు. 'అర్జునా! ఇప్పుడు నీ వీరత్వాన్ని చూపించు. ఇప్పుడు నీకు యుద్ధంచేస్తే వచ్చే ఫలమేమిటో దాని రుచి చూపిస్తాను?' అన్నాడు అర్జునునితో. కానీ అర్జునుడు దైన్యం నిండిన నేత్రాలతో భగవంతుని చూస్తూ 'ప్రభూ! మిమ్మల్ని ఇందుకేనా పిలిచినది? అనాడు కౌరవ సభలో మహా బలశాలురైన వీరులు కూడా మిమ్మల్ని బంధించలేక పోయారే? ఇదేమిటి? ఇప్పుడు ఎలా బంధింపబడ్డారు స్వామీ! నాకు చాలా భయంగా ఉంది. దేవా! మీరు త్వరగా

వచ్చేయండి. నా రథసారథ్యం చేయండి ప్రభూ!' అన్నాడు. ఒక్కసారి నామాన్ని తలుచుకొంటే ఎవరి భవబంధనాలు తెగిపోతాయో అట్టి అచింత్య శక్తిమంతుడైన భగవంతుడు ఇప్పుడు భక్తుని యొక్క ప్రేమరజ్జువులో బంధింపబడ్డాడు. మరోవైపు కూడా అలాంటి భక్తుడే ఉన్నాడు. అతని దీనమైన వాక్కులు భగవంతుని ఇటువైపు లాగుతూనే ఉన్నాయి. శ్రీకృష్ణుడు అర్జునుని దీనమైన వాక్కులువిని బంధాలు త్రెంచుకొని అతని రథాన్నెక్కి తోలటం ప్రారంభించాడు. భగవంతునిదానాడు చాలా విచిత్రమైన స్థితి. ఆయన తనను ప్రేమించే భక్తులపెనుగులాటలో ప్రేమమగ్నుడై ఆశ్చర్యమైన వింత ఆటలాడుతున్నాడు.

ప్రవీరుడు ఉండబట్టలేక పోయాడు. 'ప్రభూ! కొద్ది క్షణాలు తటస్థంగా ఉండి మీ ఇద్దరి భక్తుల యుద్ధాన్నీ, వీరత్వాన్నీ వీక్షించవచ్చు కదా! చాలా ఆశ్చర్యంగా ఉన్నది. అది సరే! మీరు కోరినట్లే కానీయండి!' అన్నాడు భగవంతునితో. ఇటు అర్జునుని సంబోధిస్తూ 'వీరత్వం అనే వస్తువు మీలో లేనేలేదు. ఇతరులసాయంతో వీరులను రణభూమిలో పరాజితులను చేసే ప్రయత్నం చాలా అసహ్యమైనది!' అంటూ ఇంకా రోషావేశంతో ఎన్నో తీక్ష్ణమైన బాణాలను మరియు దివ్యాయుధాలవర్షాన్ని కురిపించాడు. అర్జునుడు వికలమనస్కుడై పోయాడు. అతని సైన్యమంతా గాయపడి ఛిన్నాభిన్నమైపోయినది. ఇక్కడా భగవంతునిమాయ పనిచేస్తూనే ఉన్నది.

అది చూచిన శ్రీకృష్ణుడు ఆశ్చర్యాన్ని ప్రకటిస్తూ 'ఒక్క ప్రవీరుని ఎదుటే నీ స్థితి ఇలా ఉంటే, ఇతరయోధులనెలా ఎదుర్కొనగలవు?' అని అడిగాడు. అర్జునుడు వెంటనే పారిపోతున్న తన సైన్యాన్ని చూచి వారికి క్షత్రియులకు కలిగే వీరగతిని గురించి, వారిమర్యాదల గురించి వివరిస్తూ యుద్ధం చేయుడని ప్రోత్సహించాడు. విశాలమైన అతని సేనావాహిని తిరిగి పూర్తి ధైర్యాన్ని పొంది ప్రవీరుని సైన్యంతో తలపడినది. అర్జునుడు కూడా తన బాణాలవర్షాన్ని అపూర్వరీతిలో కురిపించసాగాడు. ఇరుపక్షాలూ తమ తమవిజయాలకై తమశక్తినంతా ప్రయోగిస్తున్నారు. ఇలా జరుగుతున్న దానిలో చివరికి ప్రవీరుడు పరాజితుడయ్యాడు. అర్జునుడు విజయుడయ్యాడు.

ఐనా వీరుడైన ప్రవీరునికి కించిత్తు కూడా దుఃఖం కలుగలేదు. 'అర్జునా! నీవు నిజమైన వీరత్వాన్ని స్వీకరించు! శ్రీకృష్ణుని సాయంలేకుండా నీవు యుద్ధం చేస్తే నీకు నీ ప్రాణాలు రక్షించుకోవటమే చాలా కష్టమౌతుంది'. అని అర్జునునిపై విరుచుకొనిపడ్డాడు. 'స్వామీ! నేనూ మీ భక్తుడనే కదా! మా ఇద్దరిలోనూ వ్యత్యాసాన్నెందుకు చూపిస్తున్నారో తెలియటం లేదు! స్వామీ! మీ పై నాకెంతో ఆశ ఉండేది!' అన్నాడు కృష్ణునితో.

భగవంతుడు పకపకా నవ్వాడు. ప్రవీరుడు దాన్ని తనకనుకూలంగా అనుకొని అతణ్ణి వెంటనే ఈడ్చుకొచ్చి అదే తాళ వృక్షానికి మళ్ళీ కట్టేస్తూ 'ప్రభూ! ఇప్పుడైనా ఎవరి పక్షమూ వహించకుండా నిష్పక్షపాతంగా యుద్ధం చూస్తానని ప్రతిజ్ఞ చెయ్యండి!' అన్నాడు. ప్రభువు నవ్వుతూ మౌనంగా తన అంగీకారాన్ని తెలిపాడు.

ఇంకేమున్నది? ప్రవీరుడు ఒక్క ఉదుటన దూకి తనరథాన్నెక్కి విల్లు ఎక్కుపెట్టి శరసంధానం చేస్తూ 'పార్థా! ఇక ప్రాణాలను రక్షించుకోవటానికి పారిపోవటమో లేక శాశ్వతంగా ఇక్కడే నిద్రించటానికో సిద్ధంకండి!' అని హెచ్చరించాడు. ప్రభువు ప్రతిజ్ఞా బద్ధుడయ్యాడు. తన వివశత్వంలోనే సమస్త ఆనందమూ లభిస్తున్నట్లు, బంధించబడివున్నా నవ్వుతూనే ఉన్నాడు శ్రీకృష్ణుడు.

అర్జునుడు ప్రభువునే చూస్తూ ఉన్నాడు. 'ఇదేమి లీల ప్రభూ! ఇప్పుడు నాప్రాణాలమీదికి వచ్చినది. ఇక నేనధీరుణ్ణే! కౌరవయుద్ధంలో నన్ను రక్షించటానికి ఆయుధాన్ని పట్టనని శపథం చేశారు. కానీ భక్తునికోసమే ప్రతిజ్ఞాభంగం చేశారు. ఇప్పుడు ఆ ప్రాణప్రదమైన అర్జునుడే మరణించాలనుకొంటున్నాడు. కాబట్టి మీరు మీ ప్రతిజ్ఞా భంగం చేయండి. వెంటనే వచ్చి నన్ను రక్షించండి!' అని వేడుకొన్న వెంటనే శ్రీకృష్ణుడు అర్జునుని రథంమీద ప్రత్యక్షమయ్యాడు. ఆయన అలానే నవ్వుతున్నాడు.

వ్యాకులమనస్కుడైన ప్రవీరుడు 'స్వామీ! మీరేమి చేస్తున్నారు? మీరు చేసిన ప్రతిజ్ఞనే భంగం చేశారా?' అనడిగాడు. భగవంతుడు తానేమీ ప్రతిజ్ఞ చేయలేదన్నాడు.

భక్తుడైన ప్రవీరుడు రోషావేశంతో 'ప్రభూ! మీరే అసత్యమాడితే యీ లోకం ఏమౌతుంది? మౌనంగా యుద్ధాన్ని తిలకిస్తానని ప్రతిజ్ఞచేసి మళ్ళీ అర్జునుని రథాన్నెక్కి కూర్చున్నారేమిటి?' అని అడిగాడు.

'ప్రతిజ్ఞ ఎవరు చేశారో వారి నడగవయ్యా!' అన్నాడు భగవానుడు. ప్రవీరుడు తాళవృక్షంవైపు చూస్తే భగవంతుడక్కడే కట్టబడిఉన్నాడు. అతడొకమారు తాళవృక్షాన్ని, మరొకమారు అర్జునరథాన్నీ మార్చి మార్చి చూశాడు. ఇప్పుడు భగవంతుడొక్కడే అయినా రెండు రూపాలలో కనిపిస్తున్నాడు. అప్పుడు ప్రవీరుడు అర్జునునితో 'అర్జునా! నీవు ఎంతో ధన్యుడవయ్యా! నీతల్లిదండ్రులుకూడా ధన్యులే! వారి కారణంగానే భగవంతుడు రెండు రూపాల్ని ధరింపవలసి వచ్చినది!' అన్నాడు.

తాళవృక్షానికి కట్టబడిన శ్రీకృష్ణునివైపు మళ్ళీ చూశాడు. అతని హృదయంలో దాగివున్న ప్రేమసముద్రం పెల్లుబికి పొర్ల సాగింది. అతడు తన్ను తాను మరచిపోయాడు. భగవంతుని నిత్యనూతనమైనట్టిదియు, సురముని మన మోహినీ రూపమైనట్టిదియు అయిన భగవంతుని లావణ్యము ప్రవీరునిమీద విలక్షణమైన మాయాజాలంలా పనిచేసింది. దాంతో ప్రవీరుడు తన బాహ్యాజ్ఞానాన్నే కోల్పోయాడు. అతడొక అలౌకికమైన రూప సుధాసాగరంలో మునిగిపోయాడు.

అదే సమయంలో భగవంతుడు అర్జునునితో 'పార్థా! నీవతి శీఘ్రంగా ప్రవీరునిశిరసును నరికివెయ్యి!' అన్నాడు. 'ప్రభూ! ప్రవీరుడు యుద్ధాన్ని వదలి మీ ధ్యానంలో లీనమైఉన్నాడు. అలాంటి స్థితిలో చంపటం ధర్మ విరుద్ధం కదా!' అన్నాడు అర్జునుడు. వెంటనే 'నా భక్తుడైన, యీ ప్రవీరుని యుద్ధంలో సంహరించే శక్తి ఎవరికున్నది? నా భక్తుడు నన్ను ధ్యానిస్తున్న సమయంలోనే నా పరమధామాన్ని చేరుకోవాలని నా కోరిక! ఇది నా ఆజ్ఞ! ఇతనిని సంహరించు! నీకే పాపమూ అంటదు!' అన్నాడు భగవంతుడు.

అర్జునుడు అత్యంత తీక్ష్ణమైన ఒక అర్ధచంద్రాకార దివ్యశరాన్ని విడిచి పెట్టాడు. దాంతో ప్రవీరునితల తెగి భగవంతునిపాదాలమీద పడినది. దాని

నుండి ఒక నిర్మలమైన జ్యోతి వెలువడి భగవంతుని యొక్క దివ్యమంగళ విగ్రహంలో లీనమైపోయినది! ప్రవీరుడు మరణించగానే మిగిలిన అతని సేన పారిపోయినది.

మాహిష్మతీ నగరమంతటా దుఃఖం అలుముకొన్నది.

ప్రవీరుని మృత్యుసమాచారాన్ని విన్న అతనితండ్రి విలపించ సాగాడు. పుత్రశోకంతో దుఃఖిస్తున్నా, పుత్రునివీరగతికి, భక్తునిఅత్యుత్తమగతికి గర్వించిన అతని తల్లి 'నాయనా! అర్జునుని బాణంవలన వీర మరణాన్ని పొంది నీవు ప్రభువు యొక్క పరమధామానికి చేరుకొన్నావు. నన్ను వీరమాతను చేశావు' నా జన్మ ధన్యమైనది !' అని తన్ను తాను సంబాళించుకొన్నది.

ఇంతలో భగవంతుడక్కడికి చేరుకొన్నాడు. ఆయన విలపిస్తున్న జ్వాలాదేవిని ఓదారుస్తూ 'మీరు బాధపడకండి! మీరు కోరినట్లైతే ప్రవీరుని తిరిగి జీవింపచేయగలను!' అన్నాడు. 'ప్రభూ! మీ సమక్షంలో మృత్యువును పొందినవాడు తిరిగి జన్మించాలని ఎవడూ కోరుకొనడు! అయితే నాదొక కోరిక. మా దంపతులిద్దరకు కూడా మా పుత్రునిగతినే ప్రసాదింపుమని వేడుకొంటున్నాను' అన్నది.

భగవంతుడు 'తథాస్తు! ఇక నీలధ్వజ మహారాజా! అర్జునునికి సాదరంగా వీడ్కోలు పలికి, యుధిష్ఠిర మహారాజు చేసే అశ్వమేధ యజ్ఞానికి కానుకలతో సహా దయచేయండి! అక్కడే తిరిగి నా దర్శనముకాగలదు!' అని ప్రభువు అంతర్థానమయ్యాడు.

భగవంతుని ఆదేశానుసారము నీలధ్వజుడు అర్జునునికి సాదర సత్కారాలతో వీడ్కోలు పలికి, భగవద్భజనలో సంలగ్నమై పోయాడు. పతివ్రతయైన మదనమంజరి తనపతితో సహగమనం చేసి భగవంతుని పరమధామానికి చేరుకొన్నది.



# 7. సంసారవాటిక

**కురంగ మాతంగ పతంగభృంగ। మీనా హతాః పంచభిరేవ పంచ।**

**ఏకః ప్రమాదీ స కథం న హన్యతే। యః సేవతే పంచభిరేవ పంచ ॥**

'లేడి, ఏనుగు, మిడుత, తుమ్మెద, చేప - ఈ ఐదు జీవులును శబ్ద, స్పర్శ, రూప, రస, గంధాలనే పంచ విషయములలో ఒక్కొక్క దానికి చిక్కి, ఐదు విషయాలవలన ఒక్కటొక్కటిగా చంపబడుతున్నాయి. మరి ప్రమాదియైన ఈ మానవుడు ఒంటరిగా తన పంచేంద్రియములతో పంచ విషయాలను సేవిస్తూవున్నా ఎందుకు చంపబడడు?'

కనుక మానవుడు విషయాలనుండి తన మనస్సును, ఇంద్రియాలను నిగ్రహించుకొని వానిని పరమాత్మవైపు లగ్నం చేయటమే ఉచితమైనది. దీనాకొక దృష్టాంతముంది - ఒకానొక చక్రవర్తి ఉండేవాడు. అతడు 'రేపటి రోజున ఎవడు తన దర్శనాన్ని చేసుకోగలడో వానికి యువరాజ పదవిని కట్టబెడతాను. నేను నివసించే తోటలోని భవనం రేపటి రోజున అందరికోసమూ తెరిచే ఉంటుంది. ఎవరికీ ఎలాంటి అడ్డంకీ ఉండదు లోపలకు రావటానికి. తోటలో విహరించటానికి ప్రతివారికీ రెండు గంటలు మాత్రమే సమయం ఇవ్వబడుతుంది. ఎవ్వరూ రెండు గంటలకు మించి అక్కడ ఉండకూడదు. అక్కడున్న మార్గాలు చాలా సుగమమైనవి సులభమైనవి కాబట్టి నన్ను చేరుకోవటానికి కేవలం అర నిముషం చాలు. నియమిత సమయంలో నన్నెవరైతే చూడగలరో వారికి యువరాజ పదవి ఇవ్వబడగలదు. రెండు గంటల తర్వాత తోటలో విహరించే వారు బయటకు నెట్టబడతారు' అని చాటించాడు.

ఈ విషయం రాజ్యమంతటా ప్రచారమైనది. ఇంకేమున్నది? ప్రాతః కాలం అవగానే అందరూ హడావుడిగా తోటలో ప్రవేశించసాగారు. తోట ప్రవేశద్వారం దగ్గరే ప్రబంధకుని నివాసం. అతడు తోటలో ప్రవేశించేవారికొక టెక్కెట్టునిచ్చి దాని నకలుని తన దగ్గరే ఉంచుకొన్నాడు. ఇలా టిక్కెట్లు తీసుకొని చాలామంది తోటలోనికి ప్రవేశించారు. తోటలో ప్రవేశించిన కొందరు చమేలీ, మొగలి, గులాబీ పూవుల వాసన చూస్తూ శీతల, మంద సుగంధిల పవనాల్లో విహరించసాగారు. వీరికంటే ముందు వెళ్ళిన వారు ఎండిన పళ్ళను, మధుర ఫలాలను కోసి తినసాగారు. వీరికంటే ముందుగా ప్రవేశించినవారు సర్కస్, బయోస్కోప్, సినేమా, వస్తుప్రదర్శనశాల ఆటలూ తమాషాలు మొదలైన వాటిని, రత్నాల రాసులను, రకరకాల వెండి బంగారు నాణేలను - ఇంకా ఇదివరకు ఎప్పుడూ చూడని వస్తువులెన్నో చూస్తూ గడుపుతున్నారు. వీరికంటే ముందు తోటలో ప్రవేశించిన వారు ఇంకకొంచెం ముందుకు వెళ్ళి - పుష్పశయ్యల మీద శయనించిన స్త్రీలతో సరస సల్లాపాలాడసాగారు. ఇంకకొందరు ఎందరో వీరికంటె కూడా ముందుండి టివి, రేడియో మొదలైన వాటి నుంచి మధుర గీతాలను వింటున్నారు. ఇలా తోట అందించిన ఆనందం - విశ్రాంతి, భోగాలలో చిక్కుకొని మనలాంటి వారికి రాజదర్శనం ఎక్కడిది? అనుకొనసాగారు. అందులో ఒకడు విరాగియైనవాడు, తన మనసును, ఇంద్రియాలను తనఅదుపులో పెట్టగలిగినవాడు వీటన్నింటిని తిరస్కరించి మహారాజువద్దకు చేరాడు. అతనికే మహారాజు యువరాజ పదవిని కట్టబెట్టాడు.

ప్రబంధకుని ఆజ్ఞ మేరకు ఎందరో సిపాయిలు ఆ తోటలో కాపలా కాస్తూ తిరుగుతుండేవారు. సమయం అయిపోయిన తర్వాత వారి టిక్కెట్టు తీసుకొని వారిని బయటకు పంపేవారు. కానీ పుష్ప సుగంధాలనాఘ్రా ణిస్తున్న వారు ఇంకా కొంతసేపు అక్కడ ఉండనివ్వండని వేడుకున్నా, సమయం

అయిపోయినది కాబట్టి సిపాయిలు వారిని బయటకు నెట్టేవారు. సమయం మించిన తరువాత ఒక్క నిమిషం కూడా అక్కడ ఉండటానికి వీలులేదు. మధుర ఫలాదులరుచిని మరిగిన వారింకా రెండు నిమిషాలు ఉండనీయండి, కోసిన పళ్ళను మూటగట్టుకొంటాం అని ప్రాధేయపడితే - ఇక్కడినుండి ఏ వస్తువునూ తీసికొని వెళ్ళరాదని వారిని బయటకు నెట్టి పారేశారు. ఆటలూ తమాషాలూ సినిమాలూ చూసేవారు అక్కడినుండి కదలటానికి ఇష్టపడలేదు. ఐనా వారందరినీ ఒక్క నిమిషం కూడా ఇక్కడుండ కూడదని బలవంతంగా బయటకు పంపేశారు. ఎందరో వెండి బంగారు నాణాలూ, రత్నాలను మూటకట్టుకొన్నారు. అవేమిటో తెలుసుకొన్న సిపాయిలు వారిని కర్రలతో కొట్టి 'మూర్ఖులారా! మీరు వీటిని కేవలం చూడవచ్చు, అంతేకానీ వీటిలో, ఏ ఒక్కదానినీ తీసుకొని పోవటానికి వీలులేదు' అని మూటలు లాగేసుకొన్నారు.

మూటలు పోయినందుకు వాళ్ళకు చాలా బాధ కలిగింది. కానీ వదిలేయటం తప్ప వారికి వేరే ఉపాయం లేదుకదా! పుష్పశయ్యలపైన ఉన్న స్త్రీలతో సరస సల్లాపాలు ఆడుతున్న వారైతే అసలు అక్కడినుండి బయటకు పోమనే అన్నారు. కానీ అవధి దాటిన మీదట సిపాయిలు వారినీ కర్రలతో కొట్టి బయటకు నెట్టేశారు. టి.వి, రేడియోలు వినేవారికైతే ఎంత సమయమైందో కూడా తెలియనే లేదు. వాళ్ళ టిక్కెట్ల నంబర్లు చూసిన సిపాయిలు 'మీ సమయం అయిపోయినదన్నారు 'ఈ పాటను పూర్తిగా విననీయండి' అని ప్రాధేయపడినా సమయం అయిపోయిన తర్వాత ఒక్క క్షణం కూడా ఇక్కడ ఉండరాదని కర్రలతో కొట్టి బలవంతంగా బయటకు నెట్టేశారు.

ఇదొక కల్పిత దృష్టాంతం. దీన్ని దృష్టాంత రూపంలో ఇలా తెలుసుకోవాలి. చక్రవర్తియైన రాజే పరమేశ్వరుడు! అతని తోటయే ఈ ప్రపంచము. రాజు వేయించిన చాటింపు శ్రుతి - స్మృతి మొదలైన శాస్త్రాలు. రావటం - పోవటమనేది సృష్టి తోటలో ఉండే సమయం రెండు గంటలూ

మనిషి యొక్క ఆయుః ప్రమాణం. రాజ దర్శనానికెటువంటి అభ్యంతరం లేక పోవటం - మనుష్యునికి ఈశ్వరప్రాప్తికోసం ఎట్టి అవరోధమూ లేదనటం - అనగా మానవుడు సర్వ స్వతంత్రునిగా ఈశ్వరప్రాప్తిని పొందవచ్చునను భావమే చాటింపు. యువరాజపదవియే పరమనిఃశ్రేయస ప్రాప్తి! సుగమము మరియు సులభమైన మార్గాలలో నడచి అర నిమిషంలో మార్గాన్వేంచుకోవటమే, భక్తి మొదలైన ఉన్నత శ్రేణికి చెందిన సుగమమైన సాధన ద్వారా ఆరు మాసాలలో పరమాత్మ ప్రాప్తికి మార్గాన్వేంచుకోవటమే!

ప్రబంధకుడే యమధర్మరాజు. టిక్కెట్టు నియ్యటమే ఆయువున్విటం. టిక్కెట్టు యొక్క నకలు ప్రతిని తన దగ్గర ఉంచుకోవటమే ఆయువును లెక్కించటం! తోటలోనికి ప్రవేశించటం మరియు బయటకు పోవటం అనేవి - మనుష్యుని జనన మరణాలే! తోటలో ప్రవేశించి పుష్పాది సుగంధాలను పీలుస్తూ తిరుగాడటం అంటే - ఘ్రాణేంద్రియానికి వశీభూతుడైన మానవుడు పుష్పమాలలు ధరించటం, అత్తర్లు, సెంట్లు, పౌడర్లు మొదలైన సుగంధాలలో తన సమయాన్ని వృథా చేయటమే! తోటలో మేవా, మధుర ఫలాలు మొదలైనవి తినటమే మనుష్యుడు రసనేంద్రియానికి లోబడి మధుర పదార్థాలను భుజిస్తూ తన సమయాన్ని ఖర్చు చేసుకోవటమే! ఆట పాటలూ - తమాషాలను చూస్తూ గడపటమే చక్షురింద్రియానికి వశీభూతుడైన మనిషి నాశనమయ్యేవి, క్షణభంగురాలు, ఆశ్చర్యకరమైన పదార్థాలను చూస్తూ తన అమూల్య సమయాన్ని వృథా చేసుకోవటమే! తోటలోని స్త్రీలతో పూలపాన్పుల పైన పరుండి సరససల్లాపాలాడటము మొదలైనవి - మానవుడు తన త్వగింద్రియానికి లోబడి స్పర్శాది మొదలైన చేష్టలద్వారా స్పర్శాది సుఖాలచే నశ్వరము, క్షణభంగురము అయిన వస్తువులను ఉపభోగించి తద్ద్వారా తన అమూల్యమైన జీవనాన్ని ఆపదలలో పడవేయటమే! టి.వి, రేడియో మొదలైన వానిని వింటూ కాలక్షేపం చేయటమే-ఇక్కడ మనిషి శ్రోత్రేంద్రియానికివశుడై వాటిని వింటూ తన అమూల్యమైన జీవనకాలాన్ని వృథా చేసుకోవటం!

రాజదర్శనమేమౌతుందిలే అని నిరాశ చెందటమే - ఇక్కడ పరమాత్మ ప్రాప్తికై కావలసిన శ్రద్ధాలోపం కారణంగా సాధనా విషయమైన అకర్మణ్యత్వాన్ని సూచిస్తుంది. తోటలో తిన్నగా రాజదర్శనానికై వెళ్ళిన ఇంద్రియ సంయమియైన విరక్తపురుషుడే - ఇక్కడ పరమ సాక్షాత్కార రూప సిద్ధిని పొందటానికి యోగ్యత కలిగిన ఉత్తమ సాధకునిగా గుర్తించాలి. తోటలో రాజదర్శనం చేసుకోవటమే భగవత్సాక్షాత్కారాన్ని పొందటం మరియు యువరాజపదవిని పొందటమంటే - అది పరమపదప్రాప్తియే కదా! తోటలోని ప్రబంధకుడేర్పరచిన తిరుగాడే సిపాయిలందరూ యమ దూతలే! టిక్కెట్టులోని సమయం పూర్తవటమే - మనిషియొక్క ఆయువు తీరిపోవటం! తోటలోని మనుష్యుల్ని బయటకు నెట్టివేయుటమే - మనుష్యుల్ని యమ ధర్మరాజుకు అప్పగించటమన్న మాట! తోటలోని పళ్ళనూ, ధనాదులను మూటకట్టుకోవటమే - ఇక్కడ మరణించేటప్పుడు మనుష్యునిలోని అజ్ఞానం వల్ల వస్తు సంగ్రహం చేసి - అంతా మూటగట్టుకు పోదాం అని భావించటమే! కోరిక లేకపోయినా సిపాయిలు వారిని కర్రలతో కొట్టి బలవంతంగా బయటకు నెట్టి తీసుకోని పోవటమే - ఇక్కడ యమదూతలు చావాలనే కోరికలేని మనుష్యులను బలవంతంగా యమద్వారానికి తీసుకొని పోవటం! తోటలోని ఏ వస్తువునూ కూడా తీసుకొని పోలేక పోవటమే మనుష్యుడు మరణించినప్పుడు తనతో కూడా ఏ ప్రాపంచిక వస్తువునూ (మృష్టాన్నాదులు, స్త్రీ పుత్ర, ధనాదులు) తనతో తీసుకొని పోలేడని తెలియజెప్పటం. ఇంతకు ప్రాపంచిక వస్తువు ఏదీ కించిత్ మాత్రమైనా మనుష్యుని వెంటపోలేదు. పోదు కూడా! కావున ఈ నశ్వరము, క్షణ భంగురమూ అయిన వస్తువుల నుండి మరియు విషయములనుండి మనస్సును, ఇంద్రియాలను వాటివైపు పోనీక వైరాగ్యపూర్వకంగా పరమాత్మవైపు లగ్నం చేయాలని మనుష్యుడు గ్రహించాలి.



# 8. భగవంతుని అపార కృపాకటాక్షం

'రోజంతా గీతా పారాయణం చేస్తూ, గీతలో చెప్పినట్లు జీవితమును మలుచుకోవాలనే ప్రయత్నం చేస్తే సరిపోదు. కాస్త పొట్ట పూజను గురించి కూడా ఆలోచించండి!' అన్నాడు తమ్ముడు అన్నగారితో. అన్నగారెప్పుడూ గీతాధ్యయనంలోనే గడిపేస్తుంటాడు. పూర్తిగా గీతాపారాయణం చేయటం కంటే ఏదో ఒక అధ్యాయానికి అర్థం తెలుసుకొని, భావయుక్తంగా పారాయణ చేయటం ఉత్తమమట! కానీ గీతలో చెప్పినట్లుగా తన జీవితాన్నే మలుచుకోవటం అత్యుత్తమమట! గీతలో ఉన్న కొన్ని విశేషమైన శ్లోకాలలోని ఏ ఒక్క శ్లోకామునైనా తన జీవితమునకు అన్వయించుకొని జీవించినట్లైతే ఆ మానవుని జీవితం ధన్యమైనట్లే! ఈ నలుగురు సోదరులలోనూ పెద్దవాడు గీత అంటే ఎంతో శ్రద్ధాభక్తులు కలవాడు. అతడు గీతలోని 12వ అధ్యాయంలో ఉన్న 17వ శ్లోకమును తన జీవితానికన్వయించుకొని అలా మలచుకొనుటకు ప్రయత్నిస్తున్నాడు. తమ్ముడన్న మాటలు వినపడినా అతడేమీ మాట్లాడలేదు.

'డబ్బు సంపాదించటానికి మీరూ మాలాగా శ్రమింపవలసినదే!' అన్నాడు రెండో తమ్ముడు.

'మేం సంపాదిస్తూ మిమ్మల్ని ఎంతకాలం పోషించగలం?' మూడో తమ్ముడూ అందుకున్నాడు.

'మీరు వేరుపడిపోవటం అన్నిటికంటే మంచిదనిపిస్తోంది' మొదటి తమ్ముడు ఆవేశంగా అన్నాడు.

నిజంగానే మీతో ఉంటూ ఇల్లు గడపటం చాలా కష్టంగా ఉంది' రెండో తమ్ముడు కర్కశంగానే అన్నాడు.

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**
**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః స మే ప్రియః ॥**

అన్నగారు చాలా గంభీరంగా పై శ్లోకాన్ని వినిపించి 'తమ్ముళ్లూ! ఇది గీతలోని ఒక శ్లోకం. భగవానుడు అర్జునునికి చెప్పినది. 'ఇష్టవస్తు ప్రాప్తికి పొంగిపోని వాడును, దేనియందున ద్వేషభావము లేని వాడును, దేనికిని శోకింపనివాడును, దేనినీ ఆశింపనివాడును, శుభాశుభ కర్మలను త్యజించినవాడును, ఐన భక్తుడు నాకు ప్రియుడు', అని అర్థం చెపుతూ ఉండగా మధ్యలోనే కల్పించుకొని 'మీ ఉపదేశాన్ని మీ దగ్గరే ఉంచుకోండి! ఈ రోజే మీరు వేరుగా వెళ్ళిపోండి' అన్నాడు మూడో తమ్ముడు చాలా కోపంగా.

మీరు నన్ను వేరు చేసినందువల్ల నాకు హర్షమూ కలుగదు. శోకమూ కలుగదు. అని గీతాధ్యయనపరుడైన అన్నగారు శాంతంగా జవాబిచ్చారు. 'నాకు ద్వేషమేమాత్రం లేదు. వేరు పడాలనే ఆకాంక్షాలేదు. హర్షము, శోకము, ఇచ్ఛ మరియు ద్వేషం లేని పురుషుడు మాత్రమే భగవంతునకు ప్రేమ పాత్రుడౌతాడు. మీరేది ఉచితమనుకొంటే అలానే కానియ్యండి!' అన్నాడు అన్నగారు.

'వేరు పెట్టకుంటే యీయనకు బుద్ధిరాదు. అందమైన ఉపదేశాలిస్తూ ఆనందంగా గడిపేద్దామని యీయన ఉద్దేశ్యం!' అఖరివాడూ మొదటి తమ్ముడు తమ నిశ్చయాన్ని చెప్పారు.

'చాలా రోజులే పోషించాం. కానీ యిక మనవల్ల కాదు' రెండో తమ్ముడూ మిగతా వాళ్ళిద్దర్నీ సమర్థించాడు.

'అందరం కలిసి ఉంటే వీళ్ళందరికీ వంటలు చేసి పెట్టాలి కదా నేను!' కర్కశంగా అన్న గీతాభక్తునిభార్యమాటలు లోపలినుండి వినిపించినాయి. 'ఆ ముగ్గుర్నీ వేరు పడనీయండి! భయపడాల్సిన పనిలేదు!' అన్నది ఆమె.

'అనుకూలమైన పరిస్థితులలోనూ ఎవనికి హర్షం కలగదో - అతడే భగవానునికి పరమ ప్రియమైనవాడు' అంటూ గీతాభక్తుడు తన భార్యకు నచ్చజెపుతూ, 'నీవిలా అనకూడదు. పరిస్థితి ప్రతికూలమైపోతుంది. నీకింత మందికి సేవ చేసే సౌభాగ్యాన్ని స్వామి నీకు ప్రసాదించాడు. కాబట్టి నీవు

ఆయనకు సదా కృతజ్ఞురాలుగా ఉండి సేవ చేయాలి తప్ప ఆ అవకాశాన్ని జారవిడుచుకో కూడదు' అన్నాడు.

'ఇవిగో యీ నగలూ, బట్టలూ, గిన్నెలూ, ఈ కొద్ది నగదు, ఉండటానికి యీ చిన్న ఇల్లు మీ వాటాకి వచ్చినాయి! అంటూ తమ్ముళ్ళంతా అన్నగారి ఎదుట కొన్ని సామాన్లు ఉంచారు. తమ్ముళ్ళంతా చాలా కోపంగా ఉన్నారు. వదినగారి మాటలు అగ్నిలో ఆజ్యం పోసినట్లైనాయి.

'అంతా వాడిదయ' శాంతంగా అన్నాడు అన్నగారు. ఆయన ముఖంలో ఏమాత్రమూ మార్పులేదు. ఇదివరకువలె శాంతంగాను, ప్రసన్నంగాను ఉంది. ఆయన ముఖాన విషాదచ్ఛాయలు రేఖమాత్రంగానైనా కనిపించలేదు.

'ఇంకా మిన్నక కూర్చుంటే రోజెలా గడుస్తుందండీ!' గీతాభక్తుని భార్య విసుగుకొన్నది. 'న కాంక్షతి' అన్న సమాధానం వచ్చింది. 'నాకు ధనం కావాలనే ఆకాంక్ష లేనే లేదు. ఆకాంక్ష రహితుడైనవాడే స్వామికి అత్యంత ప్రియుడు' అన్నాడు.

'డబ్బంతా అయిపోయిన తర్వాత ఎలా గడుస్తుందనుకుంటున్నారు?' తిరిగి ప్రశ్నించింది భార్య. 'న శోచతి' అనే ఆచి తూచిన సమాధానం వచ్చింది. 'శోక రహితుడైన పురుషుడే ప్రభువుకు ప్రియ పాత్రుడు! కాబట్టి యీ జీవన నిర్వహణానికై నేను శోకించను.' అన్న మాటలు విన్న గీతాభక్తుని భార్య మౌనం వహించినది.

'ఇక నా దగ్గర డబ్బేమీ లేదు. ఏం చేయమంటారు?' అని అడిగింది భార్య చింతిస్తూ ఒక రోజు.

'న కాంక్షతి' పాత సమాధానం వచ్చినది.

'ఒంటిమీదున్న ఒక్క నగ కూడా మిగులలేదు!' మరొక రోజున బాధపడుతూ అన్నది భార్య. 'ఉన్నవన్నీ పొట్ట నింపుకొనటానికే ఖర్చయి పోయాయి. ఇప్పుడైనా ఏం చెయ్యాలో ఆలోచించండి!'

'న శోచతి' మళ్ళీ అవే నాల్గక్షరాల సమాధానం విన వచ్చింది. అది

విన్న ఆమె నిరాశచెంది, మనస్సులోనే బాధపడుతూ ఉండిపోయినది.

'ఇక నా దగ్గర ఏమీ మిగులలేదు!' రోదిస్తూ చెప్పటం మొదలు పెట్టినది భార్య. 'మన ఇల్లును అమ్మేశాం ఉన్నది అద్దె ఇల్లు. గిన్నెల్ని కూడా అప్పుతెచ్చి వంట చేస్తున్నాను. కట్టుకొనటానికిద్దరికీ రెండేసి బట్టలు మాత్రమే ఉన్నాయి. ఇవి తప్ప మన దగ్గర డబ్బూ - దస్కం, నగలూ నట్రా, గిన్నెలూ - చెంబులూ ఏమీ మిగులలేదు. ఇంక రోజెలా గడుస్తుంది? ఇకనైనా ఏదో ఒక పని చెయ్యండి!' అని ఎంతో ఆశగా ఏదైనా చేస్తాడేమోనని బలవంత పెట్టినది.

'న కాంక్షతి' అదే పాత సమాధానం వచ్చినది మళ్ళీ! 'నాకే కోరికా లేదు' అన్నాడు.

'మరి ఎలా గడుస్తుందనుకొంటున్నారు?' కన్నీళ్ళు తుడుచుకుంటూ ధైర్యాన్ని కోల్పోయిన ఆమె అడిగినది.

'న శోచతి' - 'నేను శోకించను. ఇట్టి వాడే స్వామికి ప్రియుడు' అని గీతాభ్యాసి మౌనం వహించాడు.

'చాలా విచిత్రమైన బుర్రే!' అనుకొని 'అన్నీ అయిపోయిన తర్వాతనైనా మీరేదో ఒకటి చేస్తారని ఆశపడ్డాను. కానీ, 'న కాంక్షతి', 'న శోచతి' అనుకుంటూ వీనితోనే భగవంతుడు సంతుష్టుడౌతాడన్న మీ మాటలు వినీ వినీ నే నలిసి పోయాను? అని విసుగుకొన్నది భార్య.

'నేను సత్యాన్నే చెపుతున్నా బ్రాహ్మణీ!' అన్నాడు గీతాభ్యాసి. 'ఈ రోజు ప్రాతః కాలాన ఒక వింత జరిగింది. శౌచాదులనుండి నివృత్తుడనై నేను నది ఒడ్డుకు వెళ్ళే సరికి నదిలోని పై నీరు ఇంకిపోయి నీరు లోపలే అడుగున ప్రవహిస్తూ ఉండటం చూశాను. నీటికోసం ఒడ్డున ఒక చెలమను తవ్వాను. ఆ చెలమలో నుంచి మణి మాణిక్యాలూ, స్వర్ణ ముద్రికలతో నిండిన ఒక బుట్ట బయట పడింది. అప్పుడు నాకు 'అనుకూలమైనవి ప్రాప్తించినపుడు హర్షితుడు కానివాడు నాకు ప్రియమైన భక్తుడు' అన్న భగవంతుని వాక్యాలు స్ఫురణకు వచ్చాయి సుమా! అందుకే ఈ రత్న రాసులను చూచి కూడా నాకేమాత్రం హర్షం కలగలేదు! భగవంతుడు 'న

ద్వేష్టి' అని కూడా అన్నాడుకదా! అందుచేత దానిని నేను ద్వేషించలేదు కూడా! వాటిని బయటకు తీసి ఎక్కడా పారవేయలేదు కూడా! వాటిని పొందాలనే 'ఆకాంక్ష' కూడా నాకు కలుగలేదు. వాటిని ఎలా ఉన్నదలాగే కప్పిపెట్టి తిరిగి వచ్చేశాను. ఆ అనంతమైన ధనరాశిని త్యాగం చేయటంలో కూడా నాకు కించిత్ మాత్రమూ 'శోకం' కలగలేదు. ఇలా భగవంతుని దయవలన నాకు హర్షంకానీ, ద్వేషం కానీ, పశ్చాత్తాపం కానీ, ఆకాంక్షకానీ కలగలేదు. ఆ ధనరాశిని నేను తీసుకొని రాలేదు. కానీ ఎవరైనా తెచ్చి నాకిస్తే దాన్ని ఉంచుకోవాలనే కోరిక కూడా నాకులేదు. 'శుభా శుభ పరిత్యాగాన్ని చేసే వాడు తనకు అత్యంత ప్రియుడని' భగవంతుడన్నాడు కదా! అందుకే నాకేభావమూ కలగలేదు' అన్నాడు.

అది విన్న భార్య గొంతు చించుకుంటూ 'మీకు లేకపోతేనేం? నాకైతే ఆకాంక్ష ఉంది లెండి!' అరిచినది. 'నీకూ ఆకాంక్ష ఉండకూడదు' అన్నాడు పండితుడు.

'అరె! ఇది నల్లత్రాచురా బాబూ!' అన్నాడు ఉలిక్కిపడుతూ ఒక దొంగ. 'ఈ గీతాభ్యాసి పరమ ధూర్తుడులా ఉన్నాడు' మెల్లిగా అన్నాడు రెండవ దొంగ. 'మనం అతనింట్లో దూరామని తెలిసి, అతి తెలివిగా బుట్టలో మణులూ - మాణిక్యాలూ ఉన్నాయని మాయ మాటలు చెప్పి, మనల్ని యీ నల్ల త్రాచుకు బలి ఇయ్యచూస్తున్నాడు. మనలను మోసగించాడు'.

'వీడి భార్యకూడా తక్కువదేమి కాదు' మూడవవాడు అందుకున్నాడు. 'ఇద్దరూ కలిసి మనల్ని నిజంగానే చంపాలని నాటకం ఆడారు'.

'ఇదే యుక్తిని వాళ్ళమీదే ప్రయోగిస్తే సరి' సలహా ఇచ్చాడు నాల్గోవాడు. 'ఈ త్రాచు పాముతో సహా యీ బుట్టని వాడింటిలోనే పడేద్దాం. అప్పుడు గాని వాడికి 'న శోచతి', 'న కాంక్షతి' అనే మాటలు పూర్తిగా అనుభవంలోకి రావు' అన్నాడు.

ఆనాటి రాత్రి భార్యా భర్తలు యీ మణి మాణిక్యాల బుట్టని గురించి మాట్లాడుకోవటం అదే సమయంలో ఇంట్లో దూరిన దొంగలు విన్నారు. వెంటనే నదీ తీరమునకు వెళ్ళి ఆ బుట్టని విప్పబోతే అందులో నుంచి

నల్లత్రాచు బుసలు కొడుతూ లేచింది - అది చూసి భయపడిన దొంగలు పైవిధంగా అనుకున్నారు.

నాల్గోవాడు చెప్పిన దాన్నందరూ సమర్థించారు.

బుట్టను మూసేసి ఆ నలుగురూ దాన్ని భుజాలమీద మోస్తూ రొప్పుకుంటూ గీతాభ్యాసి ఇంటికి చేరుకున్నారు. ఇంటి పై కప్పుకు రంధ్రం చేసి ముగ్గురూ పక్కకి తప్పుకున్నారు నాలుగోవాడు బుట్టని ఆ రంధ్రం పైన బోర్లించి పారిపోయాడు.

'అరె! ఇటు చూడండి స్వర్ణ ముద్రికలు కుప్పగా పడుతున్నాయి!' గీతాభ్యాసి యొక్క భార్య మణి మాణిక్యాలూ, స్వర్ణ ముద్రికలు పై నుండి పడుతున్న చప్పుడుకు లేచి ఆశ్చర్యపడినది. నల్లత్రాచు ఆ మణి మాణిక్యాల క్రింద పడి చచ్చిపోయినది. బ్రాహ్మణి హర్షాతిరేకమునకు హద్దులే లేవు. ఆమె ఉక్కిరిబిక్కిరి ఔతూ 'భగవంతుడు పై కప్పు పగలగొట్టి రత్న రాశులను పంపాడండోయ్!' అంటూ ఆనందంతో గంతులేయసాగింది'

'హర్షాతిరేకాలు ఏ మాత్రమూ కలగకూడదు' పండితుడు వెంటనే ఆమెను వారించాడు. 'ప్రియమైన వస్తువులను పొంది కూడా హర్షాన్ని పొందని వాడే భగవంతునికి ప్రియమైన భక్తుడు? అన్నాడు.

'మమ్మల్ని క్షమించండి!' అంటూ ముగ్గురన్నదమ్ములూ ఒకరోజున సిగ్గుతో తలలుదించుకొని నిలబడ్డారు.

'నేనెవరినీ ద్వేషించను. మీరు నా తమ్ములే కదా! నన్ను లజ్జితుని చేయకండి!' గీతాభ్యాసి చాలా వినమ్రంగా సమాధానమిచ్చాడు.

'అన్నగారూ!' రుద్ధమైన కంఠాలతో ముగ్గురూ ఒక్కసారే అన్నారు. వారి అన్నగారిలా అంటారని కలలో కూడా ఊహించలేదు. 'అన్నా! మీ నుండి వేరుపడి మేము నానా కష్టాలూ పడ్డాం! మా ఇల్లు విడిచి లక్ష్మి ఏనాడో వెళ్ళిపోయింది! ఒక ముద్ద అన్నంకోసం అలమటించి పోయాం. సమాజంలో అవమానాలపాలయ్యాం. నిందలపాలయిన జీవితాల్ని గడిపేస్తున్నాం!' అన్నాడు మొదటివాడు. 'మా జీవితాలే మాకు భారమయ్యాయి అన్నా!' రెండవ తమ్ముడన్నాడు. 'సిగ్గుతో చచ్చిపోయి మీ ముందుకు

రాకూడదనుకున్నాం. కానీ ఈ ఆపదలే మమ్మల్నిక్కడికి తెచ్చాయి!' అందరికంటే చిన్నవాడన్నాడు.

'మీరు మా తోడబుట్టిన వారు!' మళ్ళీ మొదటి తమ్ముడన్నాడు. 'మీరు పుణ్యాత్ములన్నా! బీదవారికి రోజూ చేతులనిండా దానం చేస్తున్నారు. మేము మీ తమ్ముళ్ళమే కదా! క్షమించలేరా?' రెండో తమ్ముడు గొణిగినట్టుగా అన్నాడు.

'ఈ రత్నాలూ, స్వర్ణ ముద్రికలూ మీరూ తీసికొని పొండయ్యా!' అన్నది ముగ్గురు మరుదులూ దీనులై అన్న మాటలు విన్న వదినగారు. ఆమె వారి దీన స్థితికి ద్రవించి పోయింది. కొన్ని రత్నాలూ - స్వర్ణ ముద్రలూ వారికిస్తూ 'భగవంతుడు ఇంటి పై కప్పును పగలగొట్టి మరీ ఇచ్చాడీ ధనాన్ని. ఇంకా ఇస్తాడులే!' అన్నది.

'భగవంతుడు మళ్ళీ ఇస్తాడులే అనే ఆకాంక్ష నీకుండరాదు!' అని తన భార్యను సంబోధిస్తూ అన్నాడు పండితుడు. 'ఆకాంక్షారహితుడైన పురుషుడే భగవంతునకు ప్రియమైన వాడౌతాడు!' అన్నాడు.

'నా అపరాధమును మన్నింపుమని వేడుకొంటున్నాన'ని తన తప్పును ఒప్పుకొన్నది భార్య.

'అన్నా! మమ్మల్ని మీతోనే ఉండనీయండి' అన్నాడొక తమ్ముడు ప్రార్థిస్తూ.

'ఔనన్నా! మీరు మాపై దయ జూపాలి!' రెండవ తమ్ముడూ అన్నాడు.

'మీ పుణ్యంతో మేమూ ఋణముక్తులమవుతాం! మా దుఃఖమూ పోతుందన్నా!' మూడవ తమ్ముడు కూడా ప్రాధేయపడ్డాడు.

**యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాంక్షతి ।**

**శుభాశుభపరిత్యాగీ భక్తిమాన్ యః సమే ప్రియః ॥**

తనకు ప్రాణప్రదమైన అదే పాతశ్లోకాన్ని గీతాభ్యాని పునరుద్ఘాటించాడు. మీరంతా నన్ను తిరిగి మీలో కలుపుకోవాలనుకొంటే నాకెట్టి అభ్యంతరమూలేదు. హర్షమూ లేదు. తిరిగి మళ్ళీ నన్ను మీ నుండి

# 9. పరమానంద సేద్యం

'ఇంతదూరమెలా వచ్చావన్నా?' స్వాగతం పలికిన తరువాత పంజాబుమిత్రుడు అడిగాడు. రాజపుతానా నుంచి పంజాబు రావటానికేదో బలమైన కారణమే ఉండి ఉంటుందని ఊహించాడు.

'మాకక్కడ కరువు ఏర్పడింది. ప్రజలు గుప్పెడు మెతుకులకోసం అల్లాడిపోతున్నారు. ఎంతోమంది ఆకలికి తట్టుకోలేక ప్రాణాల్నే వదిలేస్తున్నారు. అందుచేత భయపడిపోయి నాకుటుంబంతో సహా మీ దగ్గరకొచ్చాను'. అన్నాడు రాజపుతానా నుంచి వచ్చిన వైశ్యుడు, ఉన్న నిజాన్ని చెప్పేశాడు. తన మిత్రుని దగ్గర ఉన్న ధాన్యరాసులను చూసి లోలోనే చాలా సంతోషపడ్డాడు.

'మీరిక్కడికి వచ్చి చాలా మంచి పనిచేశారు. ఇది మీ ఇల్లే అనుకోండి. ఆనందంగా ఉండండి' అన్నాడు మిత్రుడు.

'మీకిక్కడ అన్న రాసులు పుష్కలంగా ఉన్నాయి. మా దేశంలోనైతే ఎవరో భాగ్యవంతులఇళ్ళలోనే అన్నం లభ్యమౌతుంది. అక్కడ ఒక్కొక్క మెతుకు కోసం కాకులూ - గద్దలు లాగా ఎగబడుతున్నారు. మీ దగ్గర కొన్నివేల మణుగుల పంటను చూశాక నా ప్రాణం కుదటపడింది' అన్నాడు వైశ్యుడు తన మనసులోని మాటను వెల్లడిస్తూ.

'భగవత్కృపవలన ఇక్కడ అన్నానికి లోటులేదు. ఇక్కడి కెవరు వచ్చినా అన్నానికేలోటూ ఉండదనటంలో ఆశ్చర్యం ఏ మాత్రం లేదు. అందునా మీరు నా మిత్రులుకదా! ఇదంతా మీదే అనుకోండి! ఇక్కడికి వచ్చి చాలా మంచిపనిచేశారు' అన్నాడు మిత్రుడు. ఇతడు చతురుడు మరియు అనుభవజ్ఞుడైన రైతు.

వేరు చేద్దామనుకొన్నా నాకు శోకం కలుగదు. అలా అని నేను మిమ్మల్ని ద్వేషించను కూడా. ఎందుకంటే హర్షమూ, ద్వేషమూ, శోకమూ, ఆకాంక్ష మరియు శుభాశుభ పరిత్యాగము చేసే మానవుడే భగవంతుని యొక్క అసలైన భక్తునిగా పరిగణింపబడతాడు.

'మా ఇంట మీరు పాదం మోపగానే తాకట్టు పెట్టబడిన ఇంటి సామానులన్నీ విడిపించబడ్డాయి. మేము ఋణవిముక్తుల మయ్యాం. ఇప్పుడు మా జీవితాలు ఆనందంగా సాగిపోతున్నాయి!' అన్నాడు అందరికంటే చిన్నవాడు. నలుగురు అన్నదమ్ములూ కలుసుకొన్న తరువాత ఒకరోజున.

'లక్ష్మీ దేవికి మా మీద దయ కలిగిందిన్నాళ్ళకు' రెండవ వాడన్నాడు. 'యో న హృష్యతి న ద్వేష్టి....' అనే శ్లోకాన్ని పఠిస్తూ పండితుని భార్య ఆనందంగా 'లేవండింక! భోజనాలు చేద్దురుగాని!' అన్నది.

భోజనం చెయ్యటాని కుద్యుక్తుడౌతున్న మూడవ వాడు 'ఇక నుంచీ అన్నగారు, వదినగార్ల మాదిరిగానే మనమంతా రోజూ నియమంగా గీతాపారాయణ చేయటం మొదలుపెడదాం!' అన్నాడు.

'అంతేకాదు గీతానుసారంగా మన జీవితాలను మలుచుకునేందుకు ప్రయత్నిద్దాం!' అన్నాడు అందరికన్నా చిన్నవాడు.

'ఇక మన ఇల్లే భగవన్మందిర మౌతుంది కదా!' అన్నాడు రెండవవాడు.

'భగవంతుడు 'తథాస్తు' అని దీవిస్తాడులే!' అని గీతాభ్యాసి చిరునవ్వులు చిందించాడు.

(నివృత్తి పరమైన స్వభావాన్ననుసరించి ఈ కథ వ్రాయబడింది. ఈ శ్లోకానికి ప్రవృత్తిపరంగాను అర్థం చెప్పవచ్చును. ఈ విధంగా కర్మశీలుడైన ప్రతి భక్తునికీ ఈ శ్లోకము ఆదర్శమైనదే!)

❖❖❖

ఇవన్నీ మావేననుకోండి! ఇందులో సందేహమేమాత్రమూ లేదు. కానీ ఇంత అన్న రాశి మీకెలా వచ్చిందో తెలుసుకోవాలనుంది' అని వైశ్యుడు ఆశ్చర్యపడుతూ అడిగాడు.

'ఇక్కడ వ్యవసాయం సవ్యంగా సాగిపోతూ ఉంటున్నది. దాని ప్రభావమే ఇదంతా!' అని మిత్రుడు వైశ్యుని సమాధాన పరుద్దామనుకున్నాడు. 'మీరూ వ్యవసాయం చేస్తే మీ దగ్గర కూడా అన్న రాసులు పుష్కలంగా ఏర్పడతాయి!'

'చాలా చక్కని మాట చెప్పారు. ఈ వ్యవసాయపు పనుల్లో నేనూ కలిసిపోతాను. కానీ దీనిలో నాకు ఏమాత్రమూ అనుభవం లేదు. నాదగ్గర ఒక వెయ్యి రూపాయలున్నాయి. వీటితో వ్యవసాయం చెయ్యగలమా?' అన్నాడు వైశ్యుడు.

'వెయ్యి రూపాయలు ఏ మాత్రమూ తక్కువ పెట్టుబడి కాదు. దీనితో వ్యవసాయం పనులు చక్కగా ప్రారంభించ వచ్చు. నా సహాయం పూర్తిగా మీకుంటుంది కదా!' అన్నాడు రైతు సహానుభూతిని చూపిస్తూ వైశ్య మిత్రునితో.

'దీనితో నాకు ఏ మాత్రమూ పరిచయం లేదు. మీరేది మంచి దనుకుంటే దానినే చేద్దాం!' అని తన దగ్గరున్న డబ్బునంతా రైతు చేతుల్లో పోసేశాడు వైశ్యుడు.



'చూడండి! యీ గోధుమలన్నీ మట్టిలో కలిసిపోయాయి. ఒక్కొక్క గోధుమ గింజా విడిపోయి నష్టమైపోయింది' ఎంతో నిరాశతో అన్నాడు వైశ్యుడు. తన పంజాబీ మిత్రుని పనిలో దేనికీ ఇతడు అడ్డుపడలేదు. మిత్రుడు వైశ్యుని పెట్టుబడితో గోధుమ విత్తనాలు ఏర్పాటు చేశాడు. పొలాన్ని నాగలి చేత దున్నించాడు. విత్తులు వేయించాడు. కానీ అనుభవంలేని వైశ్యుడు ఇదంతా చూసి చాలా దుఃఖ పడటం మొదలు పెట్టాడు. రెండు మూడు రోజులైనా కాకముందే అతడు పొలానికి వెళ్ళి నేలను తవ్వి గోధుమ విత్తులను చూడసాగాడు. చాలా అంకురించినట్లు కనిపించాయి. దాంతో తన డబ్బంతా పాడై పోయిందని దుఃఖిస్తూ తనమిత్రునితో పై మాటలు అన్నాడు వైశ్యుడు.

'మీ పొలంలోని గింజలు మొలకెత్తుతున్నాయి. మీరేమీ భయపడనక్కరలేదు. విత్తులు చాలా మంచివి. మీకా విషయం తెలియదులెండి!' రైతు తన వైశ్య మిత్రునికి భరోసా ఇస్తూ అన్నాడు.

'సాధనమూ, శ్రమా రెండూ ఖర్చైనా ఏమీ లాభం కనిపించటం లేదు. నాకు చాలా బాధగా ఉన్నది' అన్నాడు తన మనసులోని బాధని స్పష్టం చేస్తూ.

'మొదట్లో అలానే ఉంటుంది. మీరు నిశ్చింతగా ఉండండి. మీ పొలం చాలా చక్కగా పండుతుంది!' రైతు మిత్రుడు ఎంతో సంతోషంగా సమాధానం చెప్పాడు.

వైశ్యుడు మాట్లాడలేదు. ఇది తప్ప అతడేం చేయగలడు?

'నా పొలంలో ఎక్కడ చూసినా గడ్డే - గడ్డి కనిపిస్తున్నది. నాకు చాలా నష్టం వాటిల్లినది. నా డబ్బంతా వృథాయై పోయినది!' వైశ్యుడు కొద్ది రోజుల తర్వాత మిత్రునితో మళ్ళీ అన్నాడు.

జానెడు పొడవుగా మొలిచిన గోధుమ మొక్కల్ని ఉత్త గడ్డే అనుకొని భ్రమపడ్డాడు వైశ్యుడు.

కంగారుపడిన రైతు మిత్రుడు స్వయంగా పొలానికి వెళ్ళి అక్కడి పంటను చూచి చాలా సంతోషపడ్డాడు.

'అరె! చుట్టు ప్రక్కల ఉన్న పొలాలకంటే మీ పొలమే చాలా బాగున్నది' అన్నాడు హతాశుడైన వైశ్య మిత్రుని భ్రమను తొలగిస్తూ 'ఇంక గోధుమ పంట రాశులు మీ ఇంటి ముంగిట కొచ్చేశాయనుకోండి. కానీ మొక్కలు ఎండిపోకుండా చూడాలి. ఈ సుకుమారమైన గోధుమ మొక్కలకు ప్రాణం నీరు మాత్రమే! దాన్ని ఏర్పాటు చేయండి. నీరు పట్టించటానికి ఒక నూతిని త్రవ్వించండి! పొలానికి చుట్టూ ముళ్ళకంచె వేయించండి. లేకుంటే పశువులు వీటిని మేసేస్తాయి. ఇక పొలాన్ని చాలా జాగ్రత్తగా చూసుకోవాలి సుమా!' అన్నాడు.

'అక్షరాలా మీ మాటల్ని పాటిస్తాను' అన్న వైశ్యుడు అలాగే చేశాడు. నూతిని తవ్వించి నీటిని పొలానికి బాగా పెట్టించాడు. మధ్యలో మేఘాలు కూడా అప్పుడప్పుడూ వర్షించాయి. మొక్కలు పెరగసాగాయి.

'మొక్కల మధ్యలో మొలచిన గడ్డిని కలుపుతీయండి. అవి గోధుమ పంటకు పెరగటానికి హాని కలిగిస్తాయి'. అని ఒకరోజున రైతు పొలానికి వచ్చి వైశ్యునకు ప్రేమగా చెప్పాడు.

'ఒక్క గడ్డి మొక్క కూడా లేకుండా చేస్తాను' అన్నాడు వైశ్యుడు ఉత్సాహంగా.

'గోధుమ గింజలైతే వచ్చాయి కానీ అవన్నీ పచ్చిగానే ఉన్నాయి!' అన్నాడు చెమట తుడుచుకుంటూ వైశ్యుడు రైతు మిత్రునితో. వైశ్యుడు పొలం నుంచి పరిగెత్తుకుంటూ వచ్చి వగరుస్తున్నాడు. రైతు మిత్రుని సలహా మేరకు పొలంలో ఒక్క గడ్డి మొక్కను కూడా ఉండకుండా చేశాడు. అతని శ్రమ సాటిలేనిది. గోధుమ మొక్కలకు ఫలాలు వచ్చాయి, కానీ ఎన్ని రోజులైనా అవింకా పచ్చిగానే ఉన్నాయి. అది చూసి బాధపడ్డాడు వైశ్యుడు. వ్యవసాయ జ్ఞానం లేకపోవటాన వైశ్యుడు అనవసరంగా కంగారు పడసాగాడు. డబ్బుతో పాటు, పడిన శ్రమంతా వ్యర్థమైపోయిందనే అనుకున్నాడు. రెండు మూడు గోధుమ కంకుల్ని కూడా తెచ్చి రైతుమిత్రునికి చూపించాడు.

'మీ గోధుమ గింజలు చాలా పుష్టిగా ఉన్నాయి. ఇక ఇవి పంటకొచ్చాయి. ఇక ఆలస్యం ఏమీలేదు. భయ పడకండి. ఏమీ ఆలోచించకండి. మీ ఇంటిలో ఇంక గోధుమలూ, పొట్టూ గుట్టలు గుట్టలుగా వచ్చేస్తాయి!' సంతోషంగా రైతు మిత్రుడు వైశ్యునితో అన్నాడు. 'ఇలాంటి సమయంలో ఎన్నో పక్షులు పంట పొలాల్లో చేరి మధురమైన కూజితాలు చేస్తూ చేనులో ఉన్న పంట గింజల్ని తినేస్తూ ఉంటాయి. కాబట్టి పంట పొలాన్ని చాలా జాగ్రత్తగా రక్షించుకోవాలి. పక్షులనుండి రక్షణ కల్పించక పోతే పంట నాశనమైపోతుంది' అన్నాడు.

'నేను మీకు చాలా కృతజ్ఞుణ్ణి. నా ఆనందానికి హద్దుల్లే లేకుండా పోయినాయి. నా దగ్గర కూడా విశాలమైన గోధుమల రాశి ఏర్పడిపోయినది'. అని ఆనందంతో నిండిన మాటలతో రైతు మిత్రునికి కృతజ్ఞతలు తెలుపుకున్నాడు వైశ్యుడు.

'ఇదంతా భగవత్కృప. మీ శ్రమ ఫలితమూను. మీరు పక్షుల మధుర కూజితాలను లెక్కపెట్టకుండా వాటిని తోలటంలోనే నిమగ్నులై పోయారు. మీరెంతో జాగ్రత్తగా వ్యవసాయం చేశారు' అని రైతు మిత్రుడు వైశ్య మిత్రునికే గొప్పతనాన్ని ఇచ్చాడు.

వైశ్యుడు నతమస్తకుడైపోయాడు. అతనిముఖంలో ఆనందం తాండవిస్తున్నది.

ఈ కథ ఒక దృష్టాంతరూపంగా చెప్పబడినది. దీనిని పరమార్థ విషయంగా ఇలా అన్వయించుకోవాలి. సత్యమైన సుఖమును పొందటానికై సాధన చేసే జిజ్ఞాసువును ఇక్కడ కరువుబారినపడిన వైశ్యునిగా తెలుసుకోవాలి. సాధకుని సంసారిక కష్టాల జ్వాలలనుండి ఉత్పన్నమైన సత్య సుఖమును పొందాలనే అభిలాషనే కరువుబాధితునిఆకలిమంటల కారణంగా అన్నం యొక్క ఆవశ్యకతను తెలుసుకోవటమని భావించాలి. పంజాబులో నివసించే వైశ్యునిరైతుమిత్రునే మహాత్మునిగా తెలుసుకోవాలి. రాజపుతానానుండి వైశ్యుడు బయలు దేరి పంజాబులోని తనరైతుమిత్రుని చేరుకోవటమే సాధకుడు తనఇంటినుండి బయలు దేరి మహాత్ముని కలుసుకోవటానికి ఆశ్రమాన్ని చేరటమని తెలుసుకోవాలి. మిత్రునితో తన గోడునంతా చెప్పుకోవటమే మహాత్మునకు సాధకుడు నివేదించిన తనదుఃఖమని తెలియాలి. వైశ్యుడు తన దగ్గరున్న ధనమును మిత్రునకు ఇయ్యటమే సాధకుడు తనశేషజీవితమును మహాత్ముని చరణాలవద్ద సంపూర్ణ శరణాగతిని చేయటం అని తెలుసుకోవాలి. మిత్రుడు చెప్పినట్లు ధనమును వెచ్చించటం అంటే మహాత్మునిఆజ్ఞానుసారం సమయాన్ని సదుపయోగ పరచటమే!

రైతు మిత్రుడు పొలము, విత్తులు మొదలైనవానిని సమకూర్చటమే - సమయాన్ని సదుపయోగం చేయటంలో సాధకునకు మహాత్ముడిచ్చిన శిక్షణ అనుకోవాలి. పంటకోసం తనసుఖమును త్యాగం చేయటమే - సాధకుడు పరమానంద ప్రాప్తికోసం వర్తమాన సంసారిక సుఖమును త్యాగం

చేయటము. పొలంలో విత్తు నాటటం అంటే మహాత్ముని ద్వారా సాధకుని హృదయ క్షేత్రంలో బీజ మంత్రాన్ని ధారణచేయటమే అని తెలుసుకోవాలి. పొలంలోని విత్తనాలు విచ్చుకొని అంకురించినపుడు తెలివి తక్కువ కారణంగా కలిగిన దుఃఖమూ, నిరాశా నిస్పృహల అనుభవాలు - సాధన కాలంలో సంభవించే నిరాశ మరియు తజ్జనితమైన దుఃఖమే అని తెలుసుకోవాలి. వైశ్యుడు తన భ్రాంతి కారణంగా గోధుమ మొక్కలను గడ్డిగా భావించటం అంటే-సాధన కాలంలో సాధన ఉన్నతమైన గతిని పొందుతున్నప్పటికీ సాధన చేయటంలో అధిక శ్రమ కల్గిన కారణంగా భ్రమచేత అది సాధన కాదని వ్యర్థంగా బాధపడటం. మనస్సు, ఇంద్రియాల సంయమనమే కంచె అని అర్థం చేసుకోవాలి. ఆధ్యాత్మిక విషయాలను లోకంలోని స్వార్థపరులైన మనుష్యులసంపర్కంలో ఖర్చు కానీయ కుండా ఉండటమే - పశుపక్ష్యాదులనుండి పంటను రక్షించుకోవటం! భగవంతుని గుణ - ప్రభావ సహితమైన రూపమును స్మరించటం, సత్సంగ - స్వాధ్యాయమును - నూతిని తవ్వి పొలమునంతటినీ ఆ నీటితో తడుపుతూ ఉండటమని భావించాలి. అనుకోకుండా సత్సంగం ప్రాప్తించటం, ధ్యానమును అభ్యాసం చేయటం వంటివి - భగవత్కృపవలన సహజంగా వర్షం కురియటమే అని గ్రహించాలి. మనస్సునుండి దుర్గుణాలను, దురాచారాలనూ తప్పించటమే - ఇక్కడ గోధుమ మొక్కల మధ్య మొలచిన వ్యర్థమైన గడ్డిగాదాన్ని కలుపు తీసి పారేయటం. పరమాత్మునియందు స్థిరమైన ధ్యానం కల్గటం - అంటే ఇక్కడ గోధుమలు ఫలించటం - సాధకుని స్వార్థపరులైన మానవులు స్తుతించటం, కీర్తించటం వంటివి - ఇక్కడ గోధుమ పంటను తినటానికి వచ్చే పక్షుల మధుర స్వరాలని గ్రహించాలి! సాధన పరిపక్వమవటానికి స్తుతి - కీర్తి, స్తుతి - కీర్తులను అవహేళన చేయటానికి - ఇక్కడ పంట పొలాన్ని రక్షించటాని కోసం పక్షులను పారద్రోలటమని గ్రహించాలి. మరియు అసలు ఏ దుఃఖమూ లేకుండా పరమానంద స్వరూపుడైన ఆ పరమాత్ముని ప్రాప్తి కల్గటం - అంటే - ఇక్కడ గోధుమలు పండిన తరువాత అవన్నీ రాసులుగా ప్రోగుపడటమే అని అర్థం చేసుకోవాలి.



# 10. సమానత్వమే అమృతము - అసమానత్వము విషతుల్యము

రాజపుతానాలోని ఒక గ్రామంలో ఒక పేద వైశ్యుడుండేవాడు. దైవం అనుకూలించక అక్కడ ఒకప్పుడు భయంకరమైన కరవు వచ్చినది. అన్నం దొరకక అక్కడి ప్రజలు అల్లాడిపోతూ మరణించసాగారు. పేద వైశ్యునికీ ఇదే కష్టం వచ్చిపడినది. ఎలాగో కొన్నాళ్ళు గడిపేశాడు. ఇక ఇల్లు గడవటం చాలా కష్టంగా ఉన్నది. ఏ ఉపాయమూ తోచలేదు. కొంతకాలం ఇల్లు గడవటానికి ఏదో ఏర్పాటు చేసి వైశ్యుడు బయలుదేరాడు. అతని చిన్ననాటి స్నేహితుడొకడున్నాడు. అతడు అస్సాములో వ్యాపారం చేసేవాడు. బాగా ఉన్నవాడు. అతని వ్యాపారం బాగానే సాగుతూ ఉండేది. 'ఆపదలో ఆదుకునే వాడు మిత్రుడే కదా!' అని అతనికి తనమిత్రుడు గుర్తుకు వచ్చాడు. ఎలాగో తన మిత్రుని దగ్గరకు అస్సాం చేరాడు. అతడు వ్యాపారం చేస్తున్న చోటుకు వెళ్ళి మిత్రుని కలుసుకొన్నాడు. మిత్రుడు చక్కగా ఆదరిస్తాడనీ, తన కష్టకాలం హాయిగా వెళ్ళిపోతుందనీ అనుకొన్నాడు. మిత్రుడు అతనిని ఆహ్వానించాడు. కానీ అతని ముఖ కవళికలలో ఆనందానికి బదులు ఏదో చిరాకు, పెద్ద భారాన్ని మోస్తున్న బాధ కనిపించాయి. పేద వైశ్యుడు బాధపడుతూ తనకథను సంక్షిప్తంగా వినిపించాడు. అతనిఆశ్రయాన్ని అర్థించాడు. 'అన్నా! ఇంటిలో మీ వదినా పిల్లలూ అన్నం లేక మలమల మాడిపోతున్నారు. వాళ్ళకేదైనా ఇవాళే పంపాలి. దాంతోపాటు నాకిక్కడేదైనా పనిచూపిస్తే నేను గడుపుకుంటూ ప్రతినెలా ఎంతో కొంత వాళ్ళకు పంపగలుగుతాను' అని అర్థించాడు.

ధనవంతుడైన మిత్రుడు అంతా విని ఒక దీర్ఘ నిశ్వాసను తీసుకొని 'అన్నా! నీవు చెప్పిందంతా నిజమే! ఈ సమయంలో నిన్నాదుకోవటం కూడా

ధర్మమే! కానీ నీకు సాయపడటానికి నాదగ్గర అంత ధనమూ లేదు. నీకిద్దామంటే నాదగ్గర ఎలాంటి పనీలేదు. నా పెట్టుబడి మీద వచ్చే వడ్డీ, ఇళ్ళ అద్దెలూ, వ్యాపారం మీద వచ్చే ఆదాయం - అంతా కలిపితే ఎంత ఒక నలభై - యాభై వేలు వస్తాయి! ఇక ధరలు ఎలా మండిపోతున్నాయో మీకు తెలియనిదేముంది! అదీ కాక మన గౌరవానికి తగ్గట్టు ఖర్చు పెట్ట వలసినదే కదా! ఇక కుటుంబం, నౌకర్లూ గుమాస్తాలూ ఉండనే ఉన్నారు. చాలా కష్టంగానే పని నడుస్తున్నది! ఈ పరిస్థితుల్లో నేను మిమ్మల్నీ, మీ కుటుంబాన్ని పోషించే శక్తి నాకున్నదా? మీరే చెప్పండి! ఇలా చెప్పటానికి నాకు చాలా సిగ్గుగా ఉన్నా చెప్పక తప్పటం లేదు. నేను మీకెలాంటి సాయమూ చేయలేక పోతున్నాను. మీరు మరేదైనా మార్గాన్ని ఆలోచించండి' అన్నాడు.

పేదవైశ్యుడు ఖిన్నుడయ్యాడు. 'అన్నా! నేనిక్కడ ఎవరినీ ఎరుగను. మిమ్మల్నే నమ్ముకునే ఇక్కడికి వచ్చాను. ఐనా నాదెంత ఖర్చు' యాభై రూపాయలు రాజపుతానాకి పంపటానికైతే చాలు ఇంకో యాభై అరవై రూపాయలు నెల జీతానికి కూలి పని దొరికినా పర్వాలేదు. కొంత నేనుంచుకొని మిగతాది భార్యాపిల్లలకు పంపుకోగలను. యాభై వేల రూపాయల ఆదాయం ఉన్న మీకు నాకిచ్చే యాభై రూపాయల జీతం పెద్ద ఎక్కువేమీ కాదనుకుంటాను. నేను పనిచేసే జీతం తీసుకుంటాను కానీ ఊరకే కాదు!' అని అంటున్న వైశ్యుని కళ్ళల్లో నీళ్ళు నిండాయి. నిరాశను కలిగించిన తనమిత్రుని మాటలు అతనికెంతో బాధను కలిగించాయి. అతనిముఖాన్ని గమనించినా ధనవంతునిమనసు కరుగలేదు. కపట వినయాన్ని నటిస్తూ 'అన్నా! మీరన్నది నిజమే! కానీ నేను నిస్సహాయుడను! మీరింకొక మార్గం చూచుకొనవలసినదే! ఐతే... మీకు పని దొరికే వరకూ రెండు మూడు రోజులిక్కడ ఉండవచ్చు. మాయింటిలోనే భోజనం చేయవచ్చు. ఇప్పుడు స్నానాదులు ముగించుకోండి. భోజనం చేయుదురుగాని' అని ధనవంతుడు తనపనిలో నిమగ్నుడై పోయాడు. పేదవాడు ఏదో ఆలోచించుకొంటూ స్నానాదులు ముగించటంలో నిమగ్నుడయ్యాడు.

ధనిక మిత్రుడు పరమలోభియే కాక కఠినస్వభావం కలవాడు. అతని

భార్య అతనికేమీ తీసిపోయింది కాదు. అతనికంటే ఎక్కువే! ఆమెకు పొరుగు వాని పొడగిట్టదు. భర్త మర్యాద కోసం కొన్ని విషయాలు సహిస్తూనే ఉంటాడు. కానీ భార్య భర్తను తెగ తిట్టిపోస్తూ ఉంటుంది. ఇంటికి వచ్చిన బాల్య స్నేహితునకు మర్యాద కోసమైనా భోజనం పెట్టాలికదా! లోపలికి వెళ్ళి భార్యతో 'రాజపుతానా నుంచి నాబాల్యమిత్రుడొకడు వచ్చాడు. ఆయన భోజనం చేస్తాడు. మంచి మృష్టాన్నాలతో మర్యాదపూర్వకంగా భోజనం ఏర్పాటు చేయుము. అతడు నాకు మిత్రుడు. మనకు ఇవాళ అతిథి కూడా!' అన్నాడు. అతిథి సత్కారాన్ని గురించి వంశపారంపర్యంగా విని ఉన్నాడు.

భార్య అరవకుండా ఉండటం కోసమే యీ ప్రస్తావన తెచ్చాడు. కానీ ఆమె మీద దీనిప్రభావం ఏం పడుతుంది? భార్య కర్కశంగా 'నీ అతిథీ, మిత్రుడూ - చెర్లోపడ! ఈ పొయ్యి ఊది ఊది నాకళ్ళు మండి పోతున్నవి. ఇవాళొక మిత్రుడు, రేపొక అతిథి, ఎల్లుండొక వ్యాపారి - ఇలా రోజూ ఏదో ఒకటి ఒకదాని తర్వాత ఒక ఆపద వస్తూనే ఉంటుంది. ఈ ఇంటిని నడుపుతూ నానా అవస్థా పడుతున్నాను. ఇక నావల్ల కాదు. ఇంకేదన్నా ఉపాయం ఆలోచించుకోండి!' అన్నది. భర్త 'అరె! కొంచెం మెల్లిగా అను. ఆయన బయటనే ఉన్నాడు. వింటే అతడు బాధపడతాడు.' అన్నాడు మెల్లిగా. అవిడ పెద్దగా అరుస్తూ 'ఐతే ఇంకా మంచిది. తొందరగా పీడ విరగడౌతుంది!' అన్నది. భర్త ఆమెను పొగుడుతూ 'చూడు! నా దగ్గరేమీ పనిలేదని ముందే చెప్పేశాను. మరొకటి చూసుకోమన్నాను. రెండు మూడు రోజుల్లో అతడు వెళ్ళి పోతాడు. ఈ రెన్నాళ్ళూ మనగౌరవానికి భంగం రాకుండా అతన్ని చూసుకోవాలి మరి! అన్నాడు. భార్య ఒప్పుకొని వంట చేసినది కానీ మనస్సులో కష్టంగానే ఉన్నది. అస్తు!

భోజనం సిద్ధమైన తరువాత పేద అతిథితో ధనిక మిత్రుడు లోపలికి వచ్చాడు. భార్య అతనితో 'ముందు అతిథి మిత్రునకు భోజనం చేయించటం ధర్మంకదా! తర్వాతే మీరు భుజించుదురుగాని' అన్నది. భర్త ఆమె మాటలకు విలువనిచ్చి అతిథిని భోజనం చేయుమన్నాడు. భోజనంలో పంచభక్ష్య పరమాన్నాలున్నాయి. అనేక రకాలైన కూరలూ ఉన్నాయి. కానీ భోజనం పెట్టే వారి ముఖాల్లో కళాకాంతులుమాత్రం లేవు. విషాదంగాను, పొడి

పొడిగాను కనిపించాయి. వారేదో ఆపదలో ఉన్నట్లూ, ఇష్టం లేకున్నాయీ పని చేస్తున్నట్లూ తోచింది. పేదవాడు భోజనం చేశాడు కానీ వారి ముఖాల్ని చూచి సంతోషం మాత్రం కలగలేదు. సుఖమనేది ప్రేమలో దాగి ఉంటుంది. భోజనం తరువాత లఘుశంక తీర్చు కోవటానికి బయటకు వెళ్ళాడు వైశ్యుడు. అక్కడ గృహిణి తనభర్తకు వడ్డించినది. అందులో అతిథికి వడ్డించని మరెన్నో మధుర పదార్థాలు ఉన్నాయి. ఇవన్నీ అతిథికి కనపడకుండా దాచబడ్డాయి. పాపం వైశ్యుడు చేతులు కడుగు కోవటానికి లోపలికి వచ్చి చూడకూడదు అనుకొన్నా ధనికుని అన్నపు పళ్ళెం కంట బడినది. బాదం హల్వా, ఒక గిన్నెలో పాయసం, మరో దాంట్లో పెరుగు, చక్కని మృదువైన వెన్న వేసిన రొట్టెలు కనిపించాయి. ఇంకా రుచికరమైన కూరలూ, ఊరగాయలూ వడ్డించబడినాయి. ఈ అసమానత్వం కారణంగానే తనను అతనితో భోజనానికి కూర్చోనియ్యలేదని వైశ్యునికి అర్థమైనది. ఈ వైషమ్యంతో కలిగిన సంతాపం ఇంకా అతనిలో ఎక్కువైనది. ఐనా చేతులు కడుగుకొని వెళ్ళిపోయాడు.

ఆనాటి రాత్రి 'అతిథికి పడక ఏర్పాటు ఎక్కడ చేద్దాం?' అన్నాడు భార్యతో ధనికమిత్రుడు. 'నా నెత్తిమీద. ఇదీ అడుగవలసిన ప్రశ్నేనా? ఎక్కడవీలుంటే అక్కడే వేయించండి. ఇంట్లోనికయితే రానియ్యకండి' అన్నది విసుగుకొంటూ భార్య. 'సరే! బయటే పరుపు మీద పడుకుంటాడులే కానీ, దోమల బెడద చాలా ఉన్నదికదా! పాపం నిద్ర పోలేడు. అందుకని ఈ రెండు రోజులూ దోమతెరనిస్తే బాగుంటుందేమో!' అన్నాడు భర్త. 'నా దగ్గర ఒకే ఒక్క దోమతెరవున్నది. అది మీరే ఉంచుకుంటారో లేక వాడి ముఖాన కొడతారో!' అన్నది భార్య కటువుగా. భార్యస్వభావం తెలిసిన వాడు కాబట్టి ఇంక ఏమీ మాట్లాడకుండా బయటికి వెళ్ళి పోయాడు ధనికుడు.

'అన్నా! ఇక్కడ పరుపూ, దిండూ అన్నీ ఉన్నాయి. మీరిక్కడ పడుకోండి. ఇక్కడ సౌకర్యంగానే ఉంటుంది' అన్నాడు ధనికుడు మిత్రునితో. వైశ్య మిత్రుడేం చేస్తాడు. 'అలాగేనన్నాడు పాపం! ధనికుడు లోనికి వెళ్ళి పోయాడు. వైశ్యుడు అక్కడే పండుకొన్నాడు. వేసవి కాలం అది. దోమలు ఉండనే ఉన్నాయి! పరుపులో, దిండ్లలో ఉన్న నల్లులు స్వైర విహారం

చేయసాగాయి. గుంపులు గుంపులుగా వచ్చి అతనిని కుట్టటం మొదలు పెట్టాయి. నల్లులను ఏరి పారవేయటం, దోమలను తరిమి కొట్టటంలోనే వైశ్యునికి రాత్రి అంతా గడిచిపోయినది! పాపం ఒక్క క్షణం కూడా నిద్రపోలేక పోయాడుతడు.

రెండవ రోజున ఇంటినుండి బయలుదేరి బజారు వైపుకు వెళ్ళాడు. బజారులోని ఒక కూడలిని చేరుకోగానే వాళ్ళ వూరి వాడొకడు కనిపించాడు. వాడూ ఇతనిని చూశాడు. వాడు చాలా పేదవాడైనా మంచి మనసున్నవాడు. చూస్తూనే పరిగెత్తుకొని వచ్చాడు. దగ్గరకు వచ్చి మహదానందంతో ప్రశ్నల మీద ప్రశ్నలు కురిపించాడు. 'అన్నా! ఇక్కడికెప్పుడు వచ్చారు? నాకు కబురైనా పంపలేదు. ఇక్కడికి రావటానికి మీ కెంతో శ్రమ కలిగి ఉంటుంది. నాకు కబురంపితే స్టేషనుకు వచ్చి మిమ్మల్ని తీసికొని వచ్చే వాడను కదా! ఇక్కడికి వచ్చి కూడా నాకు కబురు చెయ్యలేదేమి? చెప్పండి ఇప్పుడు మీరెక్కడున్నారు? పదండి మన ఇంటికి, నేను సామాన్లు తీసికొని వస్తాను. మిమ్మల్ని కలుసుకోవటమే నా అదృష్టం విదేశాలలో మనవాళ్ళెక్కడ కనిపిస్తారు చెప్పండి!' అని చాలా సంతోష పడిపోయాడు.

అతని నుండి అభిమానంతో నిండిన మాటలు విన్న పేదవాని హృదయం ద్రవించిపోయింది. నదిలో మునిగిపోతున్న వానికి ఒక ఆధారం దొరికినంత ధైర్యం కలిగింది. అతనికి తనరాకను గూర్చి కారణం చెప్పాడు. 'సామానులేమీ పెద్దగా లేవు. నాకు ఒక పంచె, తువ్వాలు, ఒక జంపకానా, ఒక చెంబు మాత్రమే ఉన్నాయి. అవి సేఠ్ జీ ఇంటిలో ఉన్నాయి' అన్నాడు. ఆ పేదస్నేహితుడు 'ఆయన చాలా గొప్పవాడు. మీరు నన్ను మీ వాడని అనుకుంటే మా ఇంటికే వచ్చేయండి. మా ఇంటిలో హాయిగా ఉండవచ్చు. మా ఇంటిపేదభోజనమే మీరు ఆనందంగా తిని ఉండవచ్చు. నేను చిన్న చిన్న వస్తువులు కొని అమ్ముతూ ఉంటాను. రోజూ రెండు రూపాయలు సంపాదిస్తాను. ఒంటరి వాడను. మీరూ నాతోఉంటే మనం ఇద్దరమౌతాం. రెట్టింపు పని అయిందనుకోండి ఆదాయం కూడా రెట్టింపుకంటే ఎక్కువే ఔతుంది. శ్రమ మరియు నీతితో చేసే పని మరి. ఎంత కష్టపడితే అంత లాభిస్తుంది. నెలకో యాభై రూపాయలు ఏ ఇబ్బందీ లేకుండా పంపవచ్చు.

ఇంక కొంచెం ఎక్కువ పంపాలనుకొంటే ప్రయత్నించవచ్చు కూడా! మీరేమీ భయపడవలసిన అవసరం లేదు. దేవుడు పేదవాళ్ళను కాపాడుతాడు కదా! 50 రూపాయలు ప్రస్తుతం నా దగ్గర దాచినవి ఉన్నాయి. వాటిని ఇవాళే ఇంటికి పంపిద్దాం!' అంటూ వైశ్యుని తనఇంటికి తీసికొని వెళ్ళాడు. రేకులతో కప్పబడిన చిన్న మట్టి ఇల్లు అయినా చాలా శుభ్రంగా ఉన్నది. అందులోనే బయట చిన్న దుకాణం. వెడుతూనే 50 రూపాయలు తీసి వెంటనే ఇంటికి మనియార్డరు పంపించాడు. అది చూచిన కరువుబాధితునకు ఎంతో సంతోషమూ కలిగినది. బ్రతుకగలననే ధైర్యమూ కలిగినది. అతని స్థితి ఎలాంటిదో చెప్పజాలనిది. ఇంకేమున్నది? పేద వ్యాపారి సేఠ్‌జీ ఇంటికి వెళ్ళి మిత్రుని సామానులను తెచ్చేశాడు.

ఇంటికి వచ్చి 'మన దేశము నుండి ఒక సజ్జనుడు వచ్చాడు. పరిచితుడే ఆయనకు కూడా భోజనం సిద్ధం చేయుము' అన్నాడు భార్యతో. అతని భార్య సంతోషంతో 'మన ఊరి వారు రావటం మన అదృష్టం! భగవంతుడు మనకొక మంచి అవకాశాన్నిచ్చినందుకు మనంధన్యులమే!' అని అందరికీ భోజనం ఏర్పాటు చేసినది. అప్పుడు బియ్యం ధర చాలా చౌకగా ఉండేది. లావు బియ్యపు అన్నం, మామూలు ఆకుకూర, జొన్న - సెనగ పిండ్లు కలిపి చేసిన రొట్టెలు, మజ్జిగ సిద్ధం చేసినది. గృహిణి ఇద్దరికీ సమానంగా భోజనాలు వడ్డించినది. ఏమాత్రమూ భేద భావంలేకుండా పదార్థాలన్నీ వేసినది. అంతే కాకుండా అతిథికి కొసరి కొసరి వడ్డించినది. వైశ్యునికినాడు భోజనం చేయటంలో ఎంతో తృప్తి కలిగినది. ఎంతో సంతోషం కలిగినది.

అభిమానంతో పెట్టిన రొట్టె ముక్క ఇచ్చే ఆనందం, అది లేకుండా పెట్టే పరమాన్నంలో ఎలా ఉంటుంది? భోజనాలు చేసి మిత్రులిద్దరూ దుకాణంలో పని చూచుకొనసాగారు.

రాత్రికి అతిథికోసం మూడు రూపాయలకు కొన్న ఒక పాత నులక మంచాన్ని సాదరంగా వేశాడు. దానిమీద గోనె పట్టాలు పరచాడు. దోమల బెడద నుండి కాపాడు కోవటానికి అతని భార్య తాను కప్పుకొనే నాజూకైన సన్నని దుప్పటిని మంచానికి నాలుగువైపులా గడకర్రలు కట్టి వాటికి చుట్టి

కట్టినది. వైశ్య మిత్రుడు క్రితం రాత్రి నిద్రపోనే లేదు కదా! మంచం మీద పండుకొనగానే అతనికి నిద్ర ముంచుకొని వచ్చేసినది. రాత్రంతా గాఢంగా సుఖంగా నిద్రపోయాడు. చాలా రోజుల అతని అలసట తీరిపోయినది.

మూడు నాలుగు రోజుల తర్వాత ఒక రోజున దారిలో వైశ్యుడు ధనికమిత్రుణ్ణి కలవటం జరిగినది. ధనికుడు మర్యాదగా వైశ్యునితో 'ఎక్కడుంటున్నారు? ఎక్కడైనా పని ఏర్పాటైందా? అన్నపానాదులకేమీ లోటులేదు కదా?' అని అడిగాడు. 'ఓ! చాలా చక్కని ఏర్పాట్లే జరిగాయి. మనదేశం వాడే ఒక దుకాణదారుడున్నాడిక్కడ. అతనింటిలోనే ఉంటున్నాను. భార్యా భర్తలిద్దరూ చాలా మంచివాళ్ళు. అతనిదుకాణంలో సగభాగం నాకిచ్చాడు. 50 రూపాయలైతే వెంటనే ఆ రోజు మా ఇంటికి మనియార్డరు చేశాడు. ఇక ముందు కూడా ఎలాంటి ఇబ్బందీ లేదనే భరోసా ఇచ్చాడు. అతని ఇంట్లో అంతా కలిసే ఉంటున్నాం. కనీసం 50 రూపాయల చొప్పున ప్రతినెలా భార్యా పిల్లల కోసం పంపించగలం. అన్నపానాదులకూ చక్కని ఏర్పాటే అయింది. వారింట అమృతుల్యమైన భోజనం చేసిన నాకెంతో తృప్తిగాను, సంతోషంగాను ఉన్నది. వారిప్రవర్తనలోని సమతా భావం నన్నెప్పటికీ ఋణగ్రస్తుని చేస్తున్నది. నేను వారిసౌజన్యాన్ని జీవితంలో ఎన్నటికీ మరిచిపోలేను'. అన్నాడు బీదవైశ్యుడు. అతని మాటలు విన్న సేఠ్‌జీగర్వానికి కాస్త దెబ్బతగిలినట్లనిపించినది. ఐనా అవన్నీ నిజాలేకదా! అతనికి తన ప్రవర్తన గురించి బాగానే తెలుసుకదా! ఇంకేం అనగలడు? అయినా అతనికో విషయం తట్టింది. వాళ్ళింట్లో రుచికరమైన భోజనం ఉంటుందని చక్కగా అలంకరించబడిన భవనము, పరుపులూ - దిండ్లు మొక్కలూ మొదలైనవి ఉన్నాయన్న గర్వం చాలా ఉంది. ఆ పేదవాడింట్లో ఇవన్నీ ఎక్కడుంటాయి? అనుకొని తనమాటే పైనుండాలని ఆలోచించి ఆ పేదవాణ్ణి నిందించే ఉద్దేశ్యంతో 'అక్కడ మీకేం భోజనం లభించి ఉంటుందో నేనూహించగలను. లావు బియ్యపు అన్నమూ, ఎండిపోయిన రొట్టె ముక్కా వండిన ఆకుకూర, పండుకొంటానికి నేలో లేక ఒక కుక్కి మంచమో లభించి ఉంటుంది. ఇంతకంటే ఆ దరిద్రుడి ఇంట్లో ఏముంటాయి? ఇక్కడున్న చక్కని ఏర్పాట్లన్నీ వదలిపెట్టి అక్కడికి వెళ్ళారు. ఇప్పుడు విచారిస్తున్నారేమో!'

అన్నాడు. 'అయ్యా! మీరు మీఇంటిలో చాలా ధనవంతులు. అక్కడ పరుపులూ దిళ్ళూ మొక్కలూ అన్నీ ఉన్నాయి. అందమైన భవనం ఉంది. ఇవన్నీ నాకు విషతుల్యాలే అయ్యాయి! మంచి రుచికరమైన భోజనం మీకుంటే నాకేమిటట? మీ ఇంట నాకు తిండిసుఖము లేదు, పడకసుఖము లేదు. అక్కడ రాత్రంతా నల్లులను దోమలను చంపుకొంటూ నానా అవస్థ పడ్డాను. రాత్రంతా జాగారమే. నాకైతే ఇక్కడ కుక్కి నులకమంచమూ, గోనెపట్టాల పరుపూ, పాత దుప్పటి దోమతెర - ఇవే చాలా సుఖాన్నిచ్చాయి! హాయిగా ఆదమరచి రాత్రంతా నిద్రపోతాను! ఇక భోజనం సంగతంటారా! ఓహ్! ఆలావు బియ్యపు అన్నమూ, ఎండిన రొట్టెలూ, ఆకుకూర - ఇవి ఇచ్చే తృప్తి మరెక్కడా దొరకలేదు! మీ ఇంటిభోజనం అయితే విషతుల్యమే! ఈ ఇంటి భోజనం మాత్రం అమృతతుల్యం! మీకు నేను భారంగా కనిపించాను. నా రాకనే మీరు ఆపదగా భావించారు. మీమనసుల్లో అసమానత్వం, విషమత్వం మాత్రమే నిండి ఉన్నది. మహాత్ములు చెప్పినట్లు 'విషమత్వమే విషము, సమానత్వమే అమృతమూ' అనే మాటలు నిజంగా యథార్థాలని తెలిసినది. కాబట్టి మీ ఇంటి మృష్టాన్నం కూడా అసమానత్వం కారణంగా విషతుల్యమైపోయినది! ఇక్కడ మామూలు భోజనం సమానత్వ కారణంగా అమృత తుల్యమైనది! అంతే కాదు. వారిద్దరి ప్రవర్తనా అమృత తుల్యంగా ఉంది. మీదగ్గర లక్షలకొలది ధనం ఉన్నది, లక్షల ఆదాయమూ ఉన్నది. మీరు నాకు బంధువు కూడా! ఐనా ఆకలితో అలమటిస్తున్న నా భార్యపిల్లలకు ఒక్క 50 రూపాయలు పంపలేక పోయారు! నాకేదైనా పనినీ కల్పించలేక పోయారు! పేదవాడైనప్పటికీ ఆ దుకాణదారుడు, కేవలం మా వూరివాడనే విశ్వాసం కొలదీ, కేవలం పరిచయం మాత్రమే ఉన్నా, నాకు ఆశ్రయాన్నిచ్చాడు. నాకు సహాయం చేశాడు. 50 రూపాయలు వెంటనే ఇంటికి పంపాడు. నన్ను తనవ్యాపారంలో సమానభాగస్వామిని చేశాడు. ఇప్పుడు మీరే చెప్పండి! ఇతని ఋణాన్నెలా తీర్చుకోగలను? ఇతనినెలా మరచిపోగలను? ఇదంతా అతడు పవిత్రమైన ప్రేమతోను, కర్తవ్య భావంతోనూ చేశాడే తప్ప ఉపకారం చేస్తున్నాననే భావంతో మాత్రం కాదు! అతడు నాకు సహాయం చేస్తున్నానని ఎప్పుడూ అనుకొనడు. నన్ను సుఖపెట్టి తాను సదా కృతజ్ఞునిగానే ఉంటూ సుఖిస్తున్నాడు. అతని భార్య కూడా

అతనివంటి ఉన్నతమైన భావాలు కలిగి ఉన్నాడు కాబట్టి వారిద్దరి ముఖాలూ ఎప్పుడూ ఆనందోత్సాహాలతో కళకళలాడుతూ ఉంటాయి!' అన్నాడు వైశ్యుడు.

'మా ఇంట ఏ విషయంలో అసమానత్వం కనిపించింది? వాళ్ళింట సమానత్వం ఎందులో కనబడింది?' అని ప్రశ్నించాడు ధనికుడు. 'మీ ఇంట చాలా మంచి భోజనమే లభించింది. ఇందులో ఏ మాత్రం సందేహంలేదు. కానీ అది నాకు విషతుల్యమే అయింది. ఇది మీకు గుర్తు ఉండే ఉంటుందనుకుంటా. నేనానాడు భోజనం చేసిన తరువాత లఘుశంక కని బయటకు వెళ్ళాను. చేతులు కడుగుకోవటానికి లోనికి వస్తూంటే మీ కంచంవైపు నాదృష్టి పడింది. మీ పళ్ళెంనిండా బాదం హల్వా, వెన్న, నాజూకైన రొట్టెలు, పాయసం, మీగడపెరుగు, క్యాబేజి కూర, ఆవకాయ మొదలైన వెన్నో వడ్డించబడ్డాయి. ఇవన్నీ నాకైతే వడ్డించలేదు కదా! ఇవన్నీ తినాలనే కోరిక నాకూ లేదు. కానీ మీరు చూపిన అసమానత్వ భావానికి నాకెంతో బాధ కలిగింది. అందుకే కదా నాకు వేరే భోజనం పెట్టింది. 'అతిథికి ముందు భోజనం చేయించాలి' అనే నెపంతో మీభార్య నాకవన్నీ వడ్డించలేదు. మీకు తర్వాత వడ్డించినది. ఇది అసమానత్వం కాదా? ఇది లేకుంటే ఇద్దరికీ ఒకేసారి వడ్డించ వచ్చుకదా! కాస్త ఖర్చు ఎక్కువై ఉండేది. దీనికి కూడా మీరేమీ అనకుండా మీ భార్య చెప్పిన దానికి వంతపాడారు. వరుసకు సోదరుణ్ణి అయిన నాతోనే ఇలా ప్రవర్తించ వచ్చునా? ఈ అసమానత్వం కారణంగానే మీరు పెట్టిన భోజనం నాకు విషతుల్యమైనది?

'అక్కడ అతని ప్రవర్తన చూడండి. అతడు పేదవాడే! వండిన లావు బియ్యపు అన్నం, రొట్టెలూ, ఆకుకూర, మజ్జిగ - వీటినే అతని భార్య ఎంతో ఆదరంగా వడ్డించినది ఇద్దరికీ సమానంగా. ఇంట్లో ఉన్నదాన్నే ఆమె ఇద్దరికీ సమానంగా వడ్డించి, ఎంతో ప్రేమగా భోజనం చేయించారు. రాత్రి పండుకొనటానికి తనకున్న నులక మంచాన్ని నాకు ఇచ్చి దాని మీద గోతాముల పరుపు వేశాడు. దోమలబారినుండి తప్పించు కోవటానికి పాత దుప్పటి నిచ్చారు. అతని నిష్కామ ప్రేమ పూర్వకమైన సమానత్వ ప్రవర్తన నా మీద ఎంత ప్రభావం చూపిందో నాకే తెలుసు. కాబట్టి నాకక్కడ

అమృతమే లభిస్తోంది. వారిద్దరి ప్రవర్తననూ తలుచుకొన్నపుడల్లా నాకెంతో హాయిగా అనిపిస్తుంది. సంతోషంలో మునకలు వేస్తూ ఉంటాను' అన్నాడు వైశ్యుడు మహదానంతో! అది విన్న ధనికుడు ఏదో కారణం చెప్పాలనే ఉద్దేశ్యంతో 'నాకు ఒంట్లో బాగుండటం లేదు. నాకు ఆకలి మందగించింది. కాబట్టి వైద్యుడివన్నీ తినుమని చెప్పాడు'. అన్నాడు. దాన్ని విన్న వైశ్యుడు 'ముందు మందాగ్ని రోగానికి ఇవన్ని తినుమని ఏ వైద్యుడూ పథ్యంగా చెప్పడు. ఒకవేళ అలా చెప్పినా అవన్నీ నాకూ వడ్డిస్తే నష్టమేమిటట?' అని ప్రశ్నించాడు.

ధనికుని దగ్గర ఏ సమాధానమూ లేకుండా పోయినది. అతడు తనలోని అసమానత్వ భావానికీ, అభిమాన హీనతకూ ఎంతో సిగ్గుపడి తలదించుకొని అక్కడినుండి వెళ్ళిపోయాడు.

ఇది ఒక కల్పిత దృష్టాంతము. అందరితో ప్రేమగాను సమాన భావంతోనూ, వినయవిధేయతలతో నిండిన త్యాగాన్నీ, ఉదారత్వాన్నీ కలిగిన ప్రవర్తనను అలవరచుకోవాలని దీని వలన మనం తెలుసుకోవాలి. అన్న పానాదుల వ్యవహారంలో సంపూర్ణమైన సమానత్వాన్ని చూపాలి. అంటే ధర్మ విరుద్ధమైన వారితో కూర్చొని, తినకూడని పదార్థాలను తినవలెనని కాదు. అతిథి ఇతర మతస్థుడూ, ఇతర జాతివాడూ అయినా యోగ్యమైన, శాస్త్ర సమ్మతమైన ఆదరసత్కారాలను అందించాలి. వినయపూర్వకంగానూ, ప్రేమపూర్వకంగానూ ప్రవర్తిస్తూ మనస్సులో ఎటువంటి భేద భావమూ లేకుండా వచ్చినవానికి మనం తినటానికి వండుకున్నదే భోజనంగా సమర్పించాలి. తర్వాతనే మనం భుజించాలి. పవిత్రమైన భావమును మనస్సులో నింపుకోవాలి. అంటే ఎవరి యెడలా ఎట్టి వైషమ్య భావమునూ కలిగి ఉండకూడదని తెలుసుకొని మన ప్రవర్తనను తీర్చి దిద్దుకోవాలి.

'అతిథి దేవోభవ' అనే శ్రుతి వాక్యాన్ననుసరించి అతిథిని భగవంతుని స్వరూపంగా భావించి సత్కరించాలనే భావాన్ని మనస్సులో నింపుకోవాలి



# 11. దేవుడు దయామయుడు - న్యాయశీలి

సచ్చిదానంద ఘనుడు, అఖిల విశ్వేశ్వరుడు, పరమదయాళువుయైన పరమేశ్వరునిఉనికిని అంగీకరించేవారు ఏ మతానికి చెందినవారైనా ఈశ్వరుడు దయాళువనీ, న్యాయనిర్ణేత అనీ తప్పకుండా ఒప్పుకొంటారు. ఈశ్వరునిలో దయాగుణమూ, న్యాయనిర్ణయమూ అనేవి ఏకపక్షభావాలు కావు. ఆయనలో ఈ రెండు గుణాలూ ఒకే సమయంలో రెండూ కలిసే సంపూర్ణంగా ఉంటాయి. అంతే కాదు జీవునితో వ్యవహరించే సమయంలో ఈ రెండు భావాల సమన్వయంతోనే ఆయన తనకర్తవ్యాన్ని నిర్వహిస్తాడు. 'న్యాయము మరియు దయ' అనే ఈ రెండు గుణాలూ ఒకేసారి ఎలా ఉంటాయి? అనే సందేహాన్ని కొందరు వెలిబుచ్చుతుంటారు. కోర్టులో న్యాయధీశుని స్థానంలో కూర్చున్న జడ్జీగారు దయా గుణాన్ని ఆధారంగా ఎక్కువ శిక్ష పడవల్సిన వానికి కొద్ది శిక్ష తగ్గించేస్తే ఆయన చెప్పిన తీర్పుకి అభ్యంతరం కలుగదా? లేక ఆ శిక్షార్హునికి పూర్తి దండన విధిస్తే ఆయన చేసిన న్యాయపరమైన తీర్పువలన ఆయనలోని దయాగుణం లేనట్టే అవుతుందా? ఇలానే ఈశ్వరుని గురించి కూడా ఎందుకు ఆలోచించరు?

ఈ సందేహాన్ని నివృత్తి చేయటం మామూలు పనేమీ కాదు. పరమాత్ముని గుణాలను నివేదించి, వాటికి టీకాటిప్పణులు చెప్పటం కేవలం చేతకానితనమే ఔతుంది. కానీ, నా మనోవినోదంకోసం పరమాత్ముని గుణగానం చేసే భావంతో కించిత్ సాహస ప్రయత్నం చేయబడుతున్నది. వాస్తవానికి మానవుడు చెప్పిన న్యాయ శాస్త్రానికీ ఈశ్వరుడు చేసే న్యాయానికీ ఏమాత్రమూ పోలిక ఉండదు. మానవుడు తన స్వార్థం కోసం చట్టాన్ని చేయకపోయి ఉంటే అతనిపై వాతావరణము, పరిస్థితులప్రభావం తప్పకుండా పడుతుంది. భవిష్యత్తును గురించి ఆలోచించినా వాటి ప్రభావం

ఉండబోదని అనుకొనలేము. ఆసక్తి మరి అన్యకారణాలవల్ల అన్యాయంగా పొరపాట్లు జరిగే అవకాశం కలుగుతుంది. కానీ ఈశ్వరునివల్ల పొరపాటు జరిగే అవకాశం కించిత్తూ ఉండదు. అదీగాక ఈశ్వరుడు దయ, న్యాయము ఉదారత్వమూ అనే గుణాలకు ఆలవాలమైనవాడు. కావున ఆయన చేసే శాసనాలలో దయ, న్యాయము, ఉదారత్వము మొదలైన వానిప్రభావం అతీతంగానే ఉంటుంది. అసలు విషయమేమంటే జగత్తును సత్యమని నమ్మే మానవుడు స్వార్థరహితుడు కాని కారణంగా న్యాయము, దయ, ఉదారత్వం మొదలైన లక్షణాలతో కూడిన చట్టాన్ని చేయనేలేడు. అన్ని విధములా స్వార్థరహితులూ, సహృదయులూ, దయాసముద్రులూ అయిన మహానుభావుల యొక్క సహృదయత, దయ, ప్రేమ, వాత్సల్యం మొదలైన సద్గుణాల లోతు మనకు అంతుబట్టక పోయినా వారిలాంటి నియమాలు చట్టాలూ చేయవచ్చు. ఇది మామూలు వాళ్ళ పనికాదు. వాళ్ళ తరమూకాదు. కాబట్టి మానవ న్యాయానికీ, ఈశ్వరన్యాయానికీ సామ్యం కుదరనే కుదరదు. కానీ విచారించి చూచినట్లైతే మానవుల్లోనూ దయా, న్యాయమూ అనే ఈ రెండు గుణాలూ కలిసి ఉంటాయనేది స్పష్టంగా విదితమౌతుంది. దీనిని ఋజువు చేయటానికి ఒక కల్పితమైన ఉదాహరణను పరిశీలిద్దాం.

రాంలాల్ అనే ఒక వ్యాపారి నారాయణ ప్రసాద్ అనే ఒక కాయస్థుని దగ్గర రెండు వేల రూపాయలు తీసుకోవలసి ఉంది. నారాయణ ప్రసాద్ సత్యశీలుడు, విశ్వాసపాత్రుడూను. కానీ చాలా రకాల ఆపదల్లో చిక్కుకోవటం వలన అతనికి వ్యాపారంలో నష్టం వచ్చింది. ఆకారణంగా ఇంట్లో ఉన్న సంపదనంతా అమ్మవలసి వచ్చినది. చివరకు భార్య తాలుకు నగలన్నీ అమ్ముడుపోయినాయి. రోజు గడవటానికై నెలకు నలభై రూపాయల జీతానికి ఒక చోట పనిచేయటం ప్రారంభించాడు. ఈ కొద్ది ఆదాయంతో అతని పెద్ద కుటుంబాని కెలాగో భోజనం పెట్టగలుగుతున్నాడు. అంతటా నిరుద్యోగ సమస్య కారణంగా ఆదాయం పెరిగే సూచనలు కనపడలేదు. రామలాల్ అతనిని డబ్బుకోసం వేధించసాగాడు. కానీ నారాయణ ప్రసాద్ ఇవ్వలేక పోయాడు. రాంలాల్ కోర్టులో కేసు పెట్టాడు. ఈ కేసుని పరిష్కరించే జడ్జీగారు చాలా మంచివాడు, న్యాయాన్ని తెలిసిన వాడు, సరియైన న్యాయం

చేసే వాడు, దయాశీలికూడా. నారాయణ ప్రసాద్ జడ్జీగారు ముందు హాజరై ఇలా విన్నవించుకొన్నాడు. 'అయ్యా! నేను రాంలాల్ గారికి రెండువేల రూపాయలు ఇవ్వాల్సిన మాట వాస్తవమే! ఆ డబ్బు నేను చచ్చేలోపుగా అతనికి చెల్లిస్తాను కానీ ఇప్పుడు నేను చాలా కష్టాల్లో కూరుకొనిపోయి ఉన్నాను. ఇంట్లో ఒక్క పైస కూడాలేదు. వచ్చే దారీలేదు. ఈ విషయాన్ని మీరు వాకబుచేసి తెలుసుకోవచ్చు. మా యింట్లో పెద్ద చిన్నా అంతా కలిసి ఎనిమిది మంది ఉన్నారు. వాళ్ళని పోషించటానికే చాలా కష్టమౌతున్నది. నెలకు నలభై రూపాయల జీతానికొక చోట నౌకరీ చేస్తున్నాను. ఇది మాకు సరిపోదు. అయినా ఎలాగో సర్దుకొని సంవత్సరానికి రెండువందల రూపాయల చొప్పున రాంలాల్ గారికి చెల్లించుకోగలను. దీనిపై కూడా రాంలాల్ కుదరదు అంటే మీరు నన్ను జైలుకు పంపండి. వెడతాను, కానీ దివాలాకోరునని మాత్రం ససేమిరా ఒప్పుకోను. ఆ పరిస్థితిలో భార్యా పిల్లలు దిక్కులేని వారైపోతారు. ఇక తమకేది మంచిదని తోస్తే అలాగే చేయండి' అన్నాడు.

నారాయణ ప్రసాద్ నిజాన్ని చెప్పినందుకు జడ్జిగారు చాలా సంతోషపడి 'నీవు అతనికి నచ్చజెప్పుకోవయ్యా. నీవున్న పరిస్థితిని బట్టి అతడు నీవు చెప్పిన దానికి ఒప్పుకోవచ్చు' అన్నారు. నారాయణ ప్రసాద్ రాంలాల్‌కి ఎంతో నచ్చజెప్పాడు. చాలా ప్రాధేయపడ్డాడు. అయినా రాంలాల్ ఎట్టి పరిస్థితుల్లోనూ ఒప్పుకోలేదు. కోర్టులోకి కేసు విచారణకొచ్చింది. రాంలాల్‌కి నారాయణ ప్రసాద్ రెండు వేలూ ఇవ్వాలని బుజువైంది. జడ్జీగారు వాస్తవాన్ని వాకబు చేయించిన మీదట నారాయణ ప్రసాద్ చెప్పింది అక్షరాలా నిజమని తేలింది. ఈ విషయం రాంలాల్ కూడా ఒప్పుకున్నాడు. దానిమీద రాంలాల్ ఒప్పుకోక పోయినప్పటికీ జడ్జీగారు నారాయణ ప్రసాద్ ప్రతి సవత్సరమూ రెండు వందల రూపాయలు రాంలాల్‌కిచ్చేటట్లు అతనిపై రెండు వేల రూపాయలకు డిక్రీ ఇచ్చారు. జడ్జీగారి దయాగుణాన్ని చూచి నారాయణ ప్రసాద్ ఆనంద పరవశుడైపోయాడు. మరి ఈ తీర్పులో జడ్జిగారు అన్యాయం చేశారని అనుకోవచ్చునా? లంచం ఇవ్వలేదు కాబట్టి అలా చెప్పారని అనుకోవచ్చునా? ఆయనలో దయాగుణం ఏమాత్రమూ లేదని అనుకోవచ్చునా? ఇందులో దయా, న్యాయమూ రెండూ ఉన్నాయి.

ఇక్కడి చట్టాలలోనే ఇలా అయితే భగవంతుడు తన ఇష్టానుసారం భక్తులకిచ్చే తీర్పులో దయ చూపటంలోనూ, న్యాయం చేయటంలోనూ దోషం ఉండి ఉంటుందా మరి?

ఇప్పుడు క్రిమినల్ కేసులలోని మరో రెండు ఉదాహరణలు చూద్దాం!

గోవిందరాం, రాంప్రసాద్ వీరిద్దరూ ఒకే వీధిలో ఉండేవారు. వాళ్ళెప్పుడు ఒకరితో ఒకరు వాదోపవాదాలు చేస్తూనే ఉండేవారు. తర్కం చేసే సమయంలో కలహభయం కూడా ఉంటుంది. ఒక రోజున పరస్పరం శాస్త్రానికి అర్థం చెప్పే విషయంలో - విపరీతార్థాన్ని విన్న రాంప్రసాద్‌కి చాలా కోపం వచ్చింది. క్రోధం వచ్చినపుడు మనుష్యునిబుద్ధి సరిగా పనిచేయదు. రాంప్రసాద్ కోపంలో గోవిందరాంకు రెండు మూడు దెబ్బలు బాగానే అంటించాడు. దాంతో గోవిందరాం అతనిమీద క్రిమినల్ కేసు పెట్టాడు. ఈ విషయం తెలియగానే రాంప్రసాద్ మేజిస్ట్రేట్ దగ్గరకు వెళ్ళి జరిగిందంతా విన్నవించుకొన్నాడు. 'మాకు ధార్మికవిషయాలలోనే వాదోపవాదాలు జరిగాయి. గోవిందరాం న్యాయంగానే నన్ను ఖండించాడు. కానీ నాకు చాలా కోపం వచ్చి నేనీఅపరాధం చేశాను. నిజానికి తప్పునాదే! నేను చేసిన పనికి చాలా నొచ్చుకొంటున్నాను. ఇక మీరేది న్యాయమనుకొంటే అలాగే చేయండి. నేను శిక్ష ననుభవించటానికి సిద్ధంగా ఉన్నా' నన్నాడు. ఇదంతా వినిన మేజిస్ట్రేట్ 'ఇందులో నేనేమీ చేసేది లేదు. నువ్వు గోవిందరాం దగ్గరకు వెళ్ళి క్షమింపుమని వేడుకో, అతడు క్షమిస్తే మంచిదే కదా. ఇదొక్కటే అన్నిటికంటే మంచి ఉపాయం!' అన్నాడు. వెంటనే రాంప్రసాద్ గోవిందరాం ఇంటికి వెళ్ళి అతని కాళ్ళ మీద పడి క్షమింపుమని వేడుకున్నాడు. తప్పు తనదేనని ఒప్పుకున్నాడు. తన్ను రక్షింపుమని ప్రార్థించాడు. రాంప్రసాద్‌లో కలిగిన పశ్చాత్తాపాన్ని గుర్తించిన గోవిందరాం హృదయం ద్రవించి పోయింది. కోర్టులో వేసిన కేసును వెనక్కి తీసుకోవటానికి రాజీపడ్డాడు. అలా అని దరఖాస్తూ చేశాడు. మేజిస్ట్రేట్ అతని దరఖాస్తును స్వీకరించి రాంప్రసాద్‌ని నిరపరాధిగా వదలేశాడు. ఇందులో మెజిస్ట్రేట్ గోవిందరాంకు అన్యాయం చేశారని అనగలమా? వీరు దయాగుణం లేని వారనీ చెప్పగలరా మరి?

ఒకేసారి భక్త అంబరీషుని యెడల అపరాధం చేసిన దుర్వాసుణ్ణి విష్ణువు అతనినే శరణుకోరుమని పంపాడు. అక్కడికి వెళ్ళిన దుర్వాసుని చూచి చక్రాన్ని ప్రార్థించి అతని ప్రాణములను రక్షించాడు. న్యాయము, దయ అనే రెండు గుణాలూ ఇక్కడ కలిసే పనిచేశాయి.

మంచి స్వభావముగలవాడు, సదాచారి అయిన శివరాముడనే వాడు ఒక గ్రామంలో ఉండేవాడు. అక్కడే ఒక బందిపోటుదొంగ కూడా ఉంటుండేవాడు. శివరాముడెప్పుడూ బందిపోటు చెప్పే దారిదోపిడీ విషయాల్ని ఆసక్తిగా వింటుండేవాడు. చెడు సహవాసాలదోషప్రభావం చాలా నష్టాన్ని కలిగిస్తుందిసుమా! శివరామునిమనస్సు కూడా ఒకరోజున దోపిడీ చేద్దామనే ఆశ పడింది. లోభం వాడి బుద్ధిని భ్రష్టుచేసింది. దాని పరిణామం - జ్ఞాన శూన్యుడైపోయి - నందరాం అనే వాడింట్లో దోపిడీ చేసి మూడు వేల రూపాయల నగదూ, కొన్ని నగలూ దొంగిలించాడు. తన్ను రక్షించుకోవటానికి అడ్డొచ్చినవారిని చితక బాదాడు కూడా!

ఇవన్నీ తీసుకొని ఇంటికి వచ్చి భార్యకంతా చెప్పాడు. శివరాముని భార్య చాలా మంచి స్వభావం కలిగినది. తనభర్త చేసిన పనికి ఆమె చాలా బాధపడినది. ఆమె అతనిపాదాలు పట్టుకొని ధర్మాన్ని గుర్తు చేసింది. వెంటనే వెళ్ళి ఆ ఆసామీకి ఆ ధనాన్ని తిరిగి అప్పగింపుమని వేడుకొన్నది. నిజానికి శివరాముడు మంచివాడే, దోపిడీ చేసే బుద్ధి కలవాడు కాడు. కానీ కుసాంగత్యంవల్ల వానిబుద్ధి భ్రష్టు పట్టిపోయింది. భార్య నచ్చజెప్పిన వెంటనే తాను చేసిన అపరాధం ఏమిటో తెలిసివచ్చింది. వెంటనే భార్య సలహా మీద కలెక్టర్‌గారిఇంటికి వెళ్ళి ఆ ధనమూ, నగలూ వారికిచ్చి లొంగిపోతూ, 'నా వల్ల తప్పు జరిగిందయ్యా! నేనపరాధిని కుసాంగత్యం వలన మనస్సులో లోభం తలెత్తింది. దాంతో బుద్ధి భ్రష్టు పట్టింది. పాపం నందరాంను అన్యాయంగా మోసగించాను. మా వంశంలో లేని కుకర్మను చేశాను. నా అపరాధం క్షమించరానిదే! ఐనా నేను మీ శరణుజొచ్చాను. నన్ను రక్షించండి. ఇక ముందిలాటి పని చేయనే చెయ్యను' అని ప్రార్థించాడు.

కలెక్టర్ గారికి అతని మాటల మీద విశ్వాసం ఏర్పడింది. వీని ఉద్దేశ్యం మంచిది కాకపోతే యీ వస్తువులతో వీడిక్కడికి ఎందుకు వస్తాడు? అనుకొన్నాడు. అతనిని అక్కడఆపి, పోలీసులతో నందరాముని పిలిపించాడు. నందరాం ఫిర్యాదు చేయటానికి పోలీసు స్టేషన్‌కి వెడదామనుకుంటూ ఉండగా పోలీసు వచ్చి 'మీ ఇంట దోపిడీ చేసినవాడు అన్ని వస్తువులతో కలెక్టర్ గారి బంగ్లా దగ్గరకొచ్చి లొంగిపోయాడు. దొరగారు మిమ్మల్ని రమ్మంటున్నారని' చెప్పాడు. నందరాం పోలీసుతో కలెక్టర్ బంగళాకి చేరుకొన్నాడు. అతనిని చూస్తూనే శివరాం అతనికాళ్ళమీద పడి తనఅపరాధాన్ని క్షమింపుమని రోదిస్తూ ప్రార్థించాడు. నందరాం వాని మాటలు వినకుండా 'నిన్ను జైలుకు పంపకుండా వదిలిపెట్టను' అన్నాడు. ఈ విషయం కోర్టుకు వెళ్ళింది. కలెక్టర్‌గారు శివరాముని జరిగిన విషయం గురించి అడిగారు. శివరాం ఇంతకు ముందు కలెక్టర్ బంగ్లాలో చెప్పిన విషయాన్నే మళ్ళీ చెప్పాడు. అప్పుడాయన నందరాంను ఇతని ప్రవర్తన గురించి నీ అభిప్రాయమేమిటి? అని అడిగారు. నందరాం దానికి సమాధానంగా శివరాం చాలా మంచి కుటుంబంనుంచి వచ్చిన వాడని తానెరుగుదునని, దోపిడీ దొంగల సహవాసం చేత ఇతనిబుద్ధి ఇలా మారిపోయిందని చెప్పి, ఇతనికి శిక్ష వేయకుండా ఉంటే మళ్ళీ ఇలాంటి పనే చేస్తాడని అన్నాడు. కలెక్టర్ గారు చాలా దయగలవారు. ఆయన శివరామునిసత్యసంధతకు ముగ్ధుడై భవిష్యత్తులో ఇలాంటి అపరాధం చేయరాదని హెచ్చరిస్తూ అతణ్ణి వదిలేశారు. ఇలా దయ చూపించిన కలెక్టర్ అన్యాయం చేసిన వాడౌతాడా? ఇలాగే సత్యమూ, సరళమూ అయిన హృదయంతో భగవంతుని శరణన్న వారికి ఆయన ముక్తిని ప్రసాదిస్తాడు.

ఈ ఉదాహరణలన్నీ సామాన్యమైన అపరాధాలేకదా అని అనిపిస్తుంది. రక్తపాతం మొదలైన సంఘటనల్లో ఇరుపక్షాలవారూ రాజీకి వచ్చినా న్యాయాధీశుడు అపరాధిని విడిచి పెట్టలేడు. ఒకవేళ అలా జరిగితే అన్యాయం జరిగినట్లే భావించాలి. దీనికి సమాధానం చెప్పే ముందు. రక్తపాతమూ హత్యలూ అనేవి మూడు రకాలుగా చేయబడతాయి. అని తెలుసుకోవాలి. అవి న్యాయం కోసమో, తెలియకో, లేక తెలిసో

చేయబడతాయి. న్యాయం కోసం చేయబడిన మానవ హత్య అపరాధంగా పరిగణించబడదు. నిస్వార్థ భావంతో ధర్మాన్ని రక్షించటానికీ, లోకహితానికే, న్యాయాన్ని రక్షించటానికి, లేక ఆత్మరక్షణార్థమూ నరహత్య చేయబడినట్లైతే హత్య చేసిన మానవుడు శిక్షార్హుడు కానేకాడు. అపరాధికి న్యాయపరంగా ఉరిశిక్ష వేసిన జడ్జీ, ఆ అపరాధికి ఉరిశిక్షను అమలు చేసే తలారీ - శిక్షార్హులు కారు. వాస్తవానికి దోపిడీ దొంగలనుండి ధన, ప్రాణ మానాలను రక్షించుకొనే ప్రయత్నంలో వాళ్ళ పై ఆయుధాలను సైతం ప్రయోగించిన వాడు శిక్షార్హుడు కాక, ప్రశంశ, బహుమతులు పొందటానికి అర్హుడౌతాడు. ఇటీవల ఒక బెంగాలీ యువతి చెడు ఉద్దేశ్యంతో ఇంటిలోనికి దూరిన ఒక నవయువకుణ్ణి చంపివేసినది. ఆమె పట్టుబడినది కూడా. కాని కోర్టు ఆమెను ప్రశంసిస్తూ, నిర్దోషిగా ప్రకటించి విడుదల చేసినది. మానవుడిచ్చే న్యాయపరమైన తీర్పులలో పొరపాట్లు జరిగే అవకాశాలు ఉండవచ్చు. ఒక్కొక్క సారి చేసిన పని న్యాయపరంగా సరిగా ఉన్నా, ఆ వ్యక్తి శిక్షార్హుడేయని తీర్పు వచ్చే అవకాశాలు ఉన్నాయి. కానీ అంతర్యామి, సర్వద్రష్ట అయిన భగవంతునివద్ద ఇలాంటి ప్రమాదాలు, పొరపాట్లు జరిగే అవకాశం ఏమాత్రమూ ఉండదు.

రెండవ రకమైన హత్య పొరపాటున జరిగేది. ఇటువంటి సందర్భాలలో హత్య చేసినవాడు అపరాధిగానే పరిగణింప బడతాడు. ఎందుకంటే ఆ హత్య అతని (అశ్రద్ధ) పొరపాటువలన జరిగి ఉంటుంది కాబట్టి ఇలాంటి అపరాధి ప్రయత్నించి శిక్ష నుంచి తప్పించుకుంటాడు, లేక తక్కువ శిక్షను కూడా పొందే వాడౌతాడు.

ఇక మూడవ రకమైనది. ఈ హత్య ముఖ్యంగా కోపము, లోభమూ, వైరమూ మొదలైన కారణాలవలన కావాలని చేసినదే అయి ఉంటుంది. ఇలాంటి అపరాధి కోర్టులో అపరాధిగా నిరూపించబడి శిక్షార్హుడై ఎట్టి పరిస్థితుల్లోనూ ఇక్కడి చట్టమునుండి తప్పించుకొనలేడు.

ఇందులో మొదట చెప్పినట్లుగా అనేక ఉదాహరణలు ఇయ్యొచ్చు. లభిస్తాయి కూడా! శ్రీఖడ్గ బహదూర్ అనే ఒక నేపాలీ యువకుడు అత్యాచారాలు చేసే హీరాలాల్ అగ్రవాల్ అనే వ్యక్తిని చంపేశాడు అతనికి

కొద్దిపాటి శిక్షకూడా పడినది. కానీ ప్రజలందరిమాట విన్న వైస్రాయ్ అతనిని విడుదలచేశాడు.

రెండవ దానికొక ఉదాహరణ :

రాంసింగ్ అనే రాజపుత్ర నవయువకుడు రాజపుతానాలోని ఒక గ్రామంలో ఉంటూ అడవిలోకి వెళ్ళి అక్కడున్న కొండక్రింద తుపాకీని గురి పెట్టే అభ్యాసం చేస్తున్నాడు. అతనితో అతనిమిత్రుడు రాజన్ సింగ్ కూడా ఉన్నాడు. తుపాకీ గురిపెట్టి పేలుద్దామనుకుంటు ఉండగా ఎదురుగా ఒక వ్యక్తి అడ్డుగా వెడుతూ కనిపించాడు. అతనిని రక్షిద్దామనే ఉద్దేశ్యంతో తుపాకీ ట్రిగర్ మీద నుంచి తన చెయ్యి తీసేశాడు. అప్పటికే ట్రిగర్ నొక్కుకు పోయింది. చెయ్యి తిప్పటంతోనే ఆ తుపాకీ గుండు ప్రక్కనున్న మిత్రుడు రాజన్‌సింగ్ గుండెలోనుండి దూసుకొనిపోయింది. రాజన్ సింగ్ అక్కడే కుప్పకూలిపోయాడు. రాంసింగ్‌కి చాలా భయంవేసినది. పోలీసులు వచ్చి రాంసింగ్‌ని హత్యాపరాధిగా పట్టుకొనిపోయారు. అతనికి తనమిత్రుని తన చేతులతోనే చంపినందుకు ఎంతో బాధ కలుగుతూంటే పైన యీ పోలీసు బెడద ఒకటి వచ్చి పడింది. పాపం! అతని స్థితి చెప్పనలవి కానిది. కోర్టులో విషయం ప్రస్తావనకు వచ్చినది. రాంసింగ్ జరిగినదంతా పూసగుచ్చినట్టు చెప్పి క్షమింపుమని ప్రార్థించాడు. అంతావిన్న న్యాయాధికారి సజన్‌సింగ్ ఇంటివాళ్ళని రాజన్‌సింగ్ మనసులో ఏదైనా దోషం ఉందనుకుంటున్నారా? అని, అతడు చేసిన తప్పిదాన్ని గురించి మీ అభిప్రాయమేమిటని ప్రశ్నించాడు. వాళ్ళ అభిప్రాయంలో రాజన్‌సింగ్ సజన్ సింగ్‌ని చంపుదామని అనుకొనలేదు. అతడు ఇతని స్నేహితుడే! ఆ సమయంలో వాళ్ళు అక్కడే ఉన్నారు కూడా. కానీ అతని అజాగ్రత్తవల్ల సజన్‌సింగ్ చంపబడ్డాడు కాబట్టి రాజన్‌సింగ్‌కి శిక్ష పడాల్సిందేనన్నారు. న్యాయాధికారి రాజన్‌సింగ్ యొక్క నీతిని, నిజాయితీని చాలా మెచ్చుకొన్నాడు. అతనిని విశ్వసించాడు. ఇక ముందు చాలా జాగ్రత్తగా ఉండుమని హెచ్చరించి రాజన్‌సింగ్‌ని వదిలేశాడు. ఇలా న్యాయం చేసే న్యాయాధికారులను అన్యాయం చేశారనవచ్చునా? మానవులే పై విధంగా దయకలిగి న్యాయాన్ననుసరించి ప్రవర్తిస్తుంటే భగవంతుని శరణన్న వానిని న్యాయాన్ని రక్షిస్తూ అతని అపరాధాల్ని క్షమించగలగటంలో ఆశ్చర్యమేమున్నది?

ఇలాగే అజాగ్రత్త వలన జరిగిన ఒక అపరాధమునకు ఒక గొప్ప ధార్మికవ్యక్తి అయిన వాడు శిక్ష ననుభవించిన పాత కథ ఒకటి గుర్తుకు వస్తున్నది. కథ దశరథ మహారాజుదే. మాతాపితృ భక్తిగల శ్రవణ కుమారుడు దశరథుని చేత ప్రమాదవశాత్తు చంపబడ్డాడు. దశరథుని అజాగ్రత్తవలన ప్రమాదవశాత్తు జరిగిన హత్యాపరాధం ఆకాలంలోనే క్షమించబడనప్పుడు అలాంటి అపరాధం ఇప్పుడుమాత్రం ఎలా క్షమించబడుతుంది? అని లోకం ప్రశ్నిస్తుంది. దీనికి సమాధానం చరిత్రే చెబుతున్నది - చూడండి.

దశరథ మహారాజు ఒకనాటి రాత్రి క్రూర జంతువులను వేటాడుటకై అడవికి వెళ్ళాడు. ఒక చోట ఏనుగు ఘీంకరించిన శబ్దం వస్తే ఆ వైపుగా శబ్దభేది బాణాన్ని సంధించాడు. అదే క్షణంలో మనిషి మూలుగు వినపడినది. దానితో 'అరె! ఏ అపరాధమూ చేయని నన్ను, మునికుమారుని బాణంతో కొట్టినదెవరు' నన్నిట్లు చంపటానికి నేనెవరికీ కీడు చేయలేదే? ఇక నా ముసలి తల్లిదండ్రుల సేవలు ఎవరు చూస్తారు? వీరి పాలనా పోషణా ఎవరు చేస్తారు?' అన్న దయనీయమైన మాటలు వినవచ్చినాయి. ఈ మాటలు దశరథుని హృదయానికి శూలాలవలె గుచ్చుకొని బాధించాయి. కంగారుపడి పరిగెత్తి ఆనది ఒడ్డున రక్తంలో పడి కొట్టుకొంటున్న జటాధారి మునిని చూశాడు. క్షమింపుమని దశరథుడు ప్రాధేయపడ్డాడు. అప్పుడా మునికుమారుడు 'గుడ్డివారైన నా తల్లి దండ్రులు దాహంతో ఉన్నారు. నీటికోసం ఇక్కడికి వచ్చాను. కుండ నింపుతూ ఉంటే అయిన శబ్దాన్ని విని నీవు బాణం వేశావు. నా తల్లి దండ్రులు నా రాక కోసం ఎదురు చూస్తూ ఉంటారు. వెళ్ళి జరిగిన దంతయు వారికి తెల్పుము. వారు నీకు శాపం ఇయ్యకుండుటకై నీవు వెళ్ళి వారిని ప్రసన్నులను చేసికొనుము! నా శరీరంనుంచి యీ బాణాన్ని లాగివేయుము. నాకు చాలా బాధగా ఉన్నది. నీకు బ్రహ్మహత్యాపాతకం చుట్టుకొనదు! నేను శ్రవణ కుమారుడను పేరుగల వైశ్యుణ్ణి!' అన్నాడు. అది విన్న దశరథుడు బాణమును అతని శరీరంనుంచి లాగి వేశాడు. వెంటనే శ్రవణ కుమారుడు ప్రాణాలు విడిచాడు. రాజు నీళ్ళు తీసుకొని శ్రవణునితల్లీ - తండ్రీ ఉన్న చోటుకు వెళ్ళాడు. వారు తమ కొడుకురాకకోసం ఎదురు చూస్తున్నారు. పాదాలసవ్వడి విని ఆలస్యంగా రావటానికి గల కారణమును

అడిగారు. దశరథుడు తనవివరాలన్నీ చెప్పి, ఎంతో వినయంగా జరిగిందంతా వారికి చెప్పాడు. వారిని నీరు త్రాగుడని ప్రార్థించాడు. ముసలిదంపతులు ఒక్కసారిగా మూర్ఛితు లయ్యారు. తిరిగి తెలివి తెచ్చుకొని 'రాజా! నీవు చేసిన యీ అశుభకర్మను నీవే స్వయంగా వచ్చి చెప్పకపోయినట్లైతే నీతల వేయి ముక్కలై పోయి ఉండేది. నీవిది ప్రమాదవశాన చేశావు కాబట్టి సరిపోయినది. అదే తెలిసి చేసి ఉంటే నీ రఘుకులం సమస్తమూ నాశనమైపోయేది! ఇప్పుడు మా ఇద్దర్నీ అక్కడికి తీసుకొని వెళ్ళుము!' అన్నారు. దశరథుడు వారినక్కడకు చేర్చాడు. ఆ వృద్ధులు కుమారునిమృత దేహాన్ని స్పృశిస్తూ దానిమీద పడి రకరకాలుగా విలపించసాగారు. దుఃఖితుడైన ఋషి చనిపోయే ముందు 'దశరథా! నేనేవిధమైన పుత్రవియోగ శోకంతో మరణిస్తున్నానో, నీ మరణం కూడా పుత్ర వియోగ శోకంతోనే కలుగుగాక!' అని శపించాడు. ఆ వృద్ధదంపతులిద్దరూ పరలోకానికి వెళ్ళిపోయారు.

తదనంతరం రాజు పుత్రకామేష్టి యజ్ఞం చేశాడు. ఫలితంగా ఆయనకు శ్రీరాముడు, లక్ష్మణుడు, భరతుడు మరియు శత్రుఘ్నుడు అను నలుగురు పుత్రులు కలిగారు. శ్రీరామునికి వనవాసం లభించినపుడు పుత్రవియోగ దుఃఖంతోనే దశరథ మహారాజునకు మరణం సంభవించినది. ఈ చరిత్ర వాల్మీకి రామాయణంలో 2/63 లో ఉన్నది. దీని వలన రాజునకు శిక్ష అనివార్యంగానే పడిందని స్పష్టమౌతున్నది. కానీ వాస్తవానికిది చాల స్వల్పమైన శిక్షగానే పరిగణించ బడుతుంది. పుత్రుడు వనవాసి అయ్యాడే కానీ శ్రవణునివలె శాశ్వతంగా దూరం కాలేదు. మా అభిప్రాయంలో దశరథుడు ఏదైనా విశేషమైన ప్రయత్నం చేసివుంటే యీ శిక్షకూడా పడేదీ కాదు. వ్యాకులుడైన దశరథుని చూచి శ్రవణుడు అతనిని తాను క్షమించి తన తల్లిదండ్రులను సముదాయింపుమని పంపాడు. ఇలా వృద్ధులైన శ్రవణుని మాతాపితలు దశరథునిపై విశేషంగా జాలి చూపించినట్లైతే అతడు ఏమచ్చాలేకుండా బయట పడేవాడు. అతడు ప్రయత్నించినంతే పని జరిగినది. ప్రయత్నించటం కూడా ప్రాయశ్చిత్తం చేసుకోవటమే! దశరథ మహారాజు ఆ సమయంలో విశేషంగా పరమేశ్వరుని ప్రార్థించి వుండినట్లైతే, ఈశ్వరుడు ఇలా జరుగరాదని తలచి ఉంటే - శ్రవణకుమారునితండ్రి

బుద్ధిలోనికి దయా, పవిత్రత అనే గుణాలను ప్రవేశపెట్టి వాటి ద్వారా దశరథునకు క్షమాభిక్ష పెట్టించేవాడు. సరిగా ఇలా జరిగిఉంటే ఈశ్వరుడు చేసిన న్యాయానికేమీ భంగం వాటిల్లేది కాదు. (న్యాయంలో దోషం ఉండేది కాదు). ఇక్కడ విషయం ఏమంటే - మానవుని ద్వారా ఎట్టి అపరాధాలు జరిగినా, ఈశ్వరుని శరణువేడి దానికనుకూలమైన ప్రాయశ్చిత్తాది ఉపాయాలు చేసినట్లైతే, వాటి ఫలితాలను అనుభవించకుండానే ఆ పాపాలు తొలగిపోగలవు! ప్రాయశ్చిత్తాది ఉపాయాలతో కూడా - ఫలము అనుభవించినట్లుగానే పాపాల నాశనం జరుగుతుంది. ఎందుకంటే ప్రాయశ్చిత్తం కూడా ఒక రకమైన అనుభవమే కదా!

వర్తమానకాలంలోని చట్టాలలో మూడవ రకమైన హత్య - అంటే కావాలని చెడు ఉద్దేశ్యంతో చేయబడే హత్యల కోసం దయా గుణాల ప్రయోగం లభించదు. కాబట్టి ఉదాహరణలతో భగవత్కృపను ఋజువు చేయటం వీలుకాదు. కానీ నిజమైన న్యాయాధీశుడు, ప్రజాహితైషీ అయిన రాజు యొక్క ఉద్దేశ్యం కూడా శిక్షా చట్టాన్ని చేసేటప్పుడు, శిక్షను అమలు చేసే సమయంలో అపరాధిని దండించి సరియైన మార్గంలో పెడదామనుకుంటాడే కాని, వానిపై ద్వేషంతో బాధపెట్టాలని గానీ, అకారణంగా అతన్ని హత్య చేయాలని గానీ అనుకొనడు. ద్వేషం, ప్రతిహింస చేయాలనుకునే మానవునికే హత్య చేయాలన్న కోరిక కలుగుతుంది. ఇంత అయినా న్యాయవంతుడైన రాజును ఈశ్వరునితో పోల్చకూడదు. ఈశ్వరునిచట్టము దయ, సహృదయత, జీవహితము అనే సద్గుణాలతో పరిపూర్ణంగా నిండి ఉంటుంది. మనం దానిససలు ఏమాత్రమూ ఊహించ లేము.

భగవంతుడు విధించిన శిక్ష గూడ వరముతో సమానమే. దాని వలన కలుగు ఫలితము ఫిర్యాదు చేసిన వానికిని, చేయబడిన వానికిని హితమే కలుగును. ఇదియే ఇందలి విశేషము - పరమ దయాళువైన భగవంతుని నిర్ణయమునకు తల యొగ్గి అపరాధి పూర్తిగా తప్పును తెలిసికొని, మున్ముందు అట్టి తప్పును చేయనని ఒట్టు పెట్టుకొనవలెను. నిర్మల హృదయముతో భగవంతుని శరణు పొంది తన సర్వస్వమును పరమాత్ముని చరణములకే అర్పింపవలెను. భగవన్నిర్ణయము ఎంత కఠినముగా ఉన్నను

దానిని ఒక వరముగా భావించి, సంతోషముగా స్వీకరింపవలెను. అంతేగాక తన తప్పులను మన్నింపుమని ప్రార్థింపక భగవంతుడు విధించిన శిక్షను సంతోషముతో అనుభవింపవలెను. ఈ విధముగా సర్వస్వమును భగవంతునకే అర్పించిన భక్తుని వాని అపరాధముల నుండి ముక్తునిగా చేసి, భగవంతుడు అతనికి అభయమిచ్చును.

అపి చేత్ సుదురాచారో భజతే మామనన్యభాక్ ।
సాధురేవ స మంతవ్యః సమ్యగ్వ్యవసితో హి సః ॥
క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాంతిం నిగచ్ఛతి ।
కౌంతేయ ప్రతి జానీహి న మే భక్తః ప్రణశ్యతి ॥
సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మా శుచః ॥

**(9/30-32, 18/66)**

'మిక్కిలి దురాచారుడైనను అనన్య భక్తితో నన్ను భజించినచో అతనిని సత్పురుషునిగానే భావింపదగును. ఏలనన యథార్థముగా అతడు నిశ్చయ బుద్ధి గలవాడు. అనగా పరమాత్మని సేవించుటతో సమానమైనది మరియొకటి ఏదియును లేదని గట్టిగా నిశ్చయించుకొనినవాడు. కాబట్టి అతడు శీఘ్రముగా ధర్మాత్ముడగును. అతడు శాశ్వతమైన పరమ శాంతిని పొందును. నా భక్తుడెన్నడును నష్టమునకు గురికాడు' అను విషయమును నిశ్చయముగా ఎఱుంగుము. కాబట్టి సర్వధర్మములను అనగా సమస్త కర్తవ్య కర్మలను నాకు సమర్పించి, సర్వశక్తి మంతుడను, సర్వాధారుడను, పరమేశ్వరుడను ఐన నన్నే శరణు జొచ్చుము. అన్ని పాపముల నుండియు నిన్ను నేను విముక్తుని గావించెదను. నీవు శోకింపకుము".

